

మిమిక్రీడాకారుడుగా కళా జీవితాన్ని ప్రారంభించి కమెడియన్‌గా ఉన్నత శిఖరాలనందుకున్న బ్రహ్మానందం
మహోన్నత శిఖరమైన ఎన్టీఆర్ ఫోటోలతో చేసిన ఈ గిమిక్రీ (గిమ్మిక్+మిమిక్రీ) ని బ్రహ్మానందం
పుట్టినరోజు (ఫిబ్రవరి 1) సందర్భంగా హాస్యాభిమానులందరికి కానుకగా అందిస్తోంది

హాసం

## ఇదీ సంగతులు

33

'హాసం' హాస్య-సంగీత పత్రిక

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం

బ్రహ్మానందం తో ప్రముఖ హాస్యనటులు 41


















'సెంటర్ స్ప్రెడ్'లో - 'ఇది.. మా అశోగ్గాడి లవ్‌స్టోరీ', 'ప్రేమికుడు' సినిమా పాటల పుస్తకాలు కలర్‌లో

ముఖచిత్రం: 'ఫూల్స్' సినిమాలో గజాలా

నా కార్టూన్స్ కంటే ఎడిటర్‌గారు పెట్టిన హెడ్డింగే బాగుంది. రాజాగారు ప్రతీ విషయంలోనూ అంత శ్రద్ధ తీసుకుంటుంనందుకు చాలా సంతోషంగా ఉంది. -బి.వి.సత్యమూర్తి, కార్టూనిస్టు.

1-15 జనవరి 2003 సంచికలో జంధ్యాల జయంతి సందర్భంగా శ్రీ మాధవపెద్ది సురేష్‌గారు రాసిన వ్యాసం చదివాక జంధ్యాల లేరని మళ్ళీ గుర్తుకొచ్చి హృదయం కలుక్కుమంది.

-మేడా మస్తాన్ రెడ్డి, పూణె

హాసం పత్రిక దాదాపు 1 సం॥ నుండి చదువుతున్నాను. చాలా బాగా నచ్చింది. ముఖ్యంగా కిశోర్ (కుమార్) జీవనఝరి - తనికెళ్ల భరణిగారి ప్రముఖ వాగ్గేయకారుల పరిచయం చాలా బాగుంది - ఎన్నో తెలియని, తెలుసుకోదగ్గ విషయాలను తెలుసుకొంటున్నాము.

-ఆచార్య భరద్వాజ, కుల్లూరు

మానవ జీవితంలో హాస్యం ఉల్లాసాన్ని, లలిత, సినిమా సంగీతం ఉత్తేజాన్ని, సంప్రదాయ శాస్త్రీయ సంగీతం ఔన్నత్యాన్నీ కలిగిస్తాయి. అటువంటి ఉల్లాస, ఉత్తేజ ఉన్నతులను పెంపొందించే ప్రయత్నం చేస్తోన్న ఏకైక పత్రిక 'హాసం' అని నేను భావిస్తున్నాను. మానవ జీవితంలో నైతిక ఆధ్యాత్మిక వ్యక్తిగత విలువలు క్షీణిస్తున్న ఈ తరుణంలో ఇటువంటి పత్రికలు ఆ విలువలను పునరుజ్జీవింప చేయగలవనీ, అందుకు భగవదాశీస్సులు నిరంతరం ఉండాలనీ ప్రార్థిస్తూ...

-వి.యస్.లక్ష్మీరావు, తెనాలి

హాసం పత్రిక చాలాబాగుంది. మేము 4 నెలల నుంచి క్రమం తప్పకుండా చదువుతున్నాము.

మా చిన్నతనంలో రేడియోలో (1970-78 సం॥లో) ఎన్నో నోములు నోచి; బాలలం మేం ఒక్కటే; కడలి అలల కలల పుట్ట ఓహో ఓహో ఓడ; పప్పా పాటపాడనా వంటి లలిత గీతాలు ప్రసారమయ్యేవి. అవి కూడా ప్రచురించగలరని ఆశిస్తున్నాము. ఆ పాటల కేసెట్లు ఎక్కడైనా దొరికేట్లయితే ఆ చిరునామా తెలియచేయగలరు.

భార్గవి,ప్రసన్న, శాంతి,లక్ష్మి,జయంతి, ఉమ

-కళ్యాణదుర్గం

సిలోన్ రేడియో గురించి, శ్రీమతి జ్యోతి పార్మార్, శ్రీమతి పద్మిని పెరీరాలు!! సమర్పిస్తున్న ప్రోగ్రాంల గురించి ఒక్కసారి చెప్పండి. ఆ యిద్దరు అనౌన్సర్లు నా ప్రాణాలు తోడేస్తున్నారు, వారి గాత్ర మాధుర్యం ఎంత శ్రావ్యంగా మదిలో అందంగా ప్రజెంట్ చేస్తారు...!? మనవాళ్ళు కూడా వీరిలా పాటను శ్రోతలకు పరిచయం చేస్తే బావుణ్ణు!

-జి.సుబ్బారావు, అన్నవర గూడెం.

మీరు సంగీత ప్రపంచానికి చేస్తున్న సేవ అమోఘం. 'హాసం' పత్రిక అన్ని పత్రికలకూ మించినది. పాతకాలపు సంగీత సంపదను మరిచి పోయిన తరుణంలో ఓ మంచి పత్రికద్వారా వాటిని పునరుద్ధరించు సంకల్పం అమోఘం, అద్వితీయం. ప్రతీ సంచిక మిస్ కాకుండా చదువుచున్నాను.




గతవారం ప్రచురించిన "ఒకే ఒక్కడు" పాత పాటలు బాగున్నవి. ఈ వారం 'మాస్కు చాటు మహానటి" సీరియల్ మనస్ఫూర్తిగా నవ్వుకొనేలా చేసింది.

-ఎమ్మెస్.కె. ప్రసాద్, శ్రీకాకుళం.

చాలాకాలం నుండి 'హాసం' చదువుతున్నాను. ఇప్పుడు చదువురీత్యా మద్రాసు రావలసివచ్చింది. ఇక్కడ 'హాసం' దొరుకుతున్నా మా ఐ.ఐ.టి. నుండి బైటికి వెళ్ళి కొనుక్కోవడం చాలా కష్టమైపోతోందండి! పైగా ఇక్కడి తెలుగు మిత్రులు "ఈ పత్రిక చాలా బాగుంది. సబ్‌స్క్రైబ్ చేస్తే రెగ్యులర్‌గా మేమూ చదవొచ్చు" అన్నారు. కాబట్టి డి.డి. పంపిస్తున్నాను. మొదట్లో "హాసం" వయసులో పెద్దవారికి తప్ప "మోడ్రన్ యూత్" కి నచ్చదని అనుకునే వాడిని. ఇక్కడ ఐ.ఐ.టి. మద్రాస్‌లో నా నుంచి 'హాసం' తీసుకుని చాలా మంది మిత్రులు పాత సినిమాల గురించి, పాత తరంలోని గొప్పవాళ్ళ గురించి తెల్సుకుని చాలా ముచ్చట పడ్తున్నారు! కాబట్టి ఇప్పుడు నేను నా అభిప్రాయం మార్చుకున్నాను. హాసం ఎప్పుడూ ఈ స్థాయిని నిల్పుకుంటుందని ఆశిస్తూ...

-ఫణీంద్ర, మద్రాసు.

చిరంజీవి, పవన్ కళ్యాణ్ ముఖ చిత్రంగా 'హాసం' పత్రికను చదివిన తర్వాత మనసు ఎంతో ఉల్లాసంగా మారిపోయింది. పాత ఒక రోత కొత్త ఒక వింత అనుకుంటున్న ఈ రోజులలో ఓల్డ్ ఈజ్ గోల్డ్ అంటూ మీరు అటు పాత తరం సినిమా (ఇద్దరి మిత్రులు)ను సీరియల్‌గా వేస్తూ... ఫోటోలతో అందించిన వైనం బాగుంది. చాలాకాలం తర్వాత ముళ్లపూడి రచన చదివే భాగ్యం కలిగింది. ఎం.చిత్తరంజన్ గారు సమర్పిస్తున్న "లలిత సంగీతం" శీర్షిక ద్వారా ఎంతోమంది ఏకలవ్యులుగా మారి గాయకులను తయారు చేస్తున్నారు. తెలుగు పత్రిక అయివుండి... హిందీలోని ఆణిముత్యాలను ఏరి పాటలను ప్రచురిస్తున్న మీకుకృతజ్ఞతలు.

-ఆల్వాల్ సురేష్ కుమార్, హైద్రాబాద్.

జనవరి 16-31 'హాసం'లో ఓ.పి.నయ్యర్ గురించి వచ్చిన వ్యాసం మా ఇంటిల్లిపాదిని అలరించింది. రెండు దశాబ్దాలపాటు తన మ్యూజిక్‌తో మేజిక్ చేసిన ఓ.పి. ఆశాభోంస్లేకి బంగారు భవిష్యత్తు నిచ్చిన వ్యక్తి. ఆశా, రఫీ, ఓ.పిల కాంబినేషన్‌లో ఎన్నో మరపురాని మధుర గీతాలొచ్చేయి. ఆయన ప్రతి పాటలోను ఓ స్టయిల్,ఓ ప్రత్యేకత కనబడుతుంటాయి. ఆయన పాటలు వింటే ఎక్కడలేని హుషారు, ఉత్సాహం పుట్టుకొస్తాయి. ఆయన 'నీరాజనం' స్వరాలకు శ్రోతలు నీరాజనాలే పలికేరు.

- గాదె విజయలక్ష్మి, విజయనగరం.

'హాసం'లోని ప్రతి పేజీ ఆనందపరచింది. చిత్తరంజన్‌గారు సమర్పిస్తున్న "లలిత సంగీతం శీర్షిక, మీ శీర్షిక ఆపాతమధురం అభినందనీయంగా ఉన్నాయి. "ఇద్దరు మిత్రులు" సీరియల్ నవల మళ్ళీ ఆ సినిమాలోని సన్నివేశాలు, వీనుల విందైన సంగీతం గుర్తుకు తెప్పించాయి. పాత తరానికీ, కొత్త తరానికీ వారధిలా వస్తున్న 'హాసం 'లాంగ్ లివ్ హాసం!

-డా॥ దమ్ము శ్రీనివాసబాబు, హైద్రాబాద్.

అనుకోకుండా 'హాసం' నా కంట పడింది. అద్భుతం, అత్యద్భుతం! పాతతరాన్ని ప్రేమించే నాలాంటి మనిషికి సరైన దివ్యౌషధం.

-కె.భాస్కరరావు, ఒరిస్సా

రచయితలకు తగిన పారితోషికం చెల్లిస్తూ, ప్రాంప్ట్‌గా రిప్లయ్ వ్రాస్తూ ప్రోత్సహిస్తున్నందుకు మీకు నా ధన్యవాదాలు. 'హాసం' పత్రిక ఇంకా అభివృద్ధి పథంలో పయనించాలని ఆకాంక్షిస్తూ..

-కె.కె.రఘునందన, విజయనగరం.

'హాసం' పత్రికలోని హాస్య సీరియల్స్, కథలు, జోక్స్ కడుపుబ్బ నవ్విస్తున్నాయి. 'హ్యూమర్‌బాక్స్' శీర్షికకు జోక్స్ మేము పంపవచ్చా? తెలుపగలరు.

-సరికొండ శ్రీనివాసరాజు, మిర్యాలగూడ

(హ్యూమర్‌బాక్సుకు ఎవరైనా పంపవచ్చు -ఎడిటర్)

1-15 జనవరి 2003 నాటి 'హాసం' లో ఆ పాత(ట) మధురం శీర్షికలో అంజలిపిక్చర్స్ వారి "సువర్ణసుందరి" చిత్రంలోని రసరమ్య గీతాలు హాయి హాయిగా రసజగత్తులో తేలియాడేలా అక్కినేని అభిమానినైన నన్ను మైమరిపించాయి. పక్షానికోమారు మరుపురాని మధుర గీతాలను అందిస్తున్న 'హాసం'కు వందనం అభినందన చందనం.

-దోవారి నాగేశ్వరరావు, వేకనూరు

16-31 జనవరి సంచిక చదివాను.మాధవపెద్ది సురేష్‌గారి 'సరిగమలు-గలగలలు', హ్యూమరథంలో రావికొండలరావుగారు వ్రాసిన భానుమతి విశేషాలు, అలాగే చిత్తరంజన్‌గారి లలితసంగీతం బాగా నచ్చినవి. బాపూ విశ్వరూపంలో 'నేటి పొరుడి స్థితి'ని చిత్రాల్లో చాలా చక్కగా వివరించారు. 'హాసం' మరిన్ని మధురస్మృతులను పంచి మమ్మల్ని దరహాసంలో ముంచివేయాలని.....

విజయరాఘవన్.కె., వరంగల్

సంపుటి : 2 సంచిక: 9

1-15 ఫిబ్రవరి 2003

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూదన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

## హాస్య-సంగీత పత్రిక

33

ఈ పక్షంలో తెలుగు సంగీత ప్రియులందరూ సంతోషించే అరుదైన సంఘటన ఒకటి జరగబోతోంది. అమరగాయకుడు ఘంటసాల వర్ధంతి సందర్భంగా ఫిబ్రవరి 11 న తపాలాశాఖ ఆయనపై ఒక తపాలాబిళ్ల విడుదల చేయబోతోంది. ఈ అరుదైన సత్కారం ఘంటసాలకు దక్కడం మనందరూ గర్వించదగిన విషయం.

ఘంటసాలకు ముందూ, వెనుకా ఎంతో మంది గొప్ప గాయకులున్నారు. కానీ ఘంటసాలకున్నంత మంది భక్తులు వేరే ఏ గాయకుడికి లేరని ఘంటాపథంగా చెప్పవచ్చు. ఆయనను డెమీ-గాడ్ స్థాయికి తీసుకుపోయాం మనం. ఆయన విగ్రహాలు ఆంధ్రదేశంలో అనేక చోట్ల వెలవబోతున్నాయి. మామూలు సాంసారిక జీవనం గడిపిన ఓ సినీగాయకుడి పట్ల ఇంత ఆరాధనా!? అని ఇతరులు తెల్లబోవచ్చు కానీ తెలుగువాళ్లు ఎవరూ తెల్లబోరు. ఆయన పేరు చెప్పగానే చేతులెత్తి నమస్కరిస్తారు. అదీ ఘంటసాల ఫినామినన్‌లో ఉన్న మహత్మ్యం!

కేంద్రప్రభుత్వంలోని అధికారులకు తెలుగువారి సొత్తయిన ఈ ఘంటసాల ఫినామినన్‌ను వివరించి వారి చేత ఈ స్టాంపు ప్రచురణకు ఒప్పించిన పెద్దలకు నమోవాకాలు. ఎందుకంటే స్టాంపు విడుదల చేయించడం ఆషామాషీ వ్యవహారం కాదు. ఆనవాయితీ ప్రకారం కూడా ఎంతటి మహనీయులయినా ఏదో సందర్భం -శతజయంతి అనో, స్వర్ణోత్సవం అనో, వజ్రోత్సవం అనో - ఏదో చెప్పుకోదగ్గ విశేషం ఉండాలి. అలా చూస్తే ఇది ఘంటసాల 29 వ వర్ధంతి. అంకెల పరంగా ఏ ప్రాముఖ్యతా లేనిది. అయినా తపాలా శాఖ వారిని దీనికి ఒప్పించారంటే ఎంతో కొంత లాబీయింగ్ చేశారని అర్థమవుతోంది.

లాబీయింగ్ అనగానే నిరసించవలసిన చర్య అనే అర్థం తీసుకోవడం పొరబాటు. మంచిపనులు చేయడానికి అధికారపీఠంపై ఉన్నవారికి అర్జీలు పెట్టి, విషయప్రాముఖ్యతను వారిచే గుర్తింపజేయడం తప్పుకాకపోగా అవసరం కూడా. పాతిక రాష్ట్రాలలో, పదిహేను భాషల్లో కృషి జరుగుతూండగా ఎక్కడో ఢిల్లీలో ఉన్నవారికి, మహా అయితే రెండు, మూడు భాషల్లో ప్రవేశం ఉన్నవారికి వ్యక్తిగతంగా ఇక్కడి ప్రతిభావంతుల గురించి తెలియవలసిన అవకాశమూ, అవసరమూ, పట్టించుకునే తీరికా ఉండదు. రకరకాల వైపుల నుండి రకరకాల ఒత్తిళ్లు వస్తున్నప్పుడు ఎవరు అర్హులో, ఎవరు కారో నిర్ణయించుకోవడం వారికి కష్టమే! అందువల్ల వారికి తెలియచెప్పవలసిన విధంగా, వారు విశ్వసించేవారు పూనుకోవాలి. ఏ భాషవారైనా చేసేది అదే!

మన తెలుగువారు మాత్రం ఈ కళలో చాలా వెనుకబడివున్నారని అంటారు. అందుకే మనవారికి రావలసినన్ని అవార్డులు, ప్రశంసలు రావటం లేదని అభిజ్ఞుల అభిప్రాయం. ఘంటసాల పోస్టల్ స్టాంపు విడుదల సందర్భంలో చూపిన చొరవ తక్కినవాటిలో కూడా చూపితే ఆ లోపాన్ని అధిగమించిన వారమవుతాము. తెలుగుసినీసంగీత చరిత్రలో ఒక మరుపురాని ఘట్టంగా జరిగే ఈ స్టాంపు విడుదల అట్టి ప్రయత్నాలకు నాంది పలుకుతుందని ఆశిద్దాం. ఈ స్టాంపు విడుదలకు కృషి చేసిన మహానుభావులందరికీ ఘంటసాల అభిమానులందరి తరఫున 'హాసం' కృతజ్ఞతలు తెలుపుతున్నది.



# గర్వభంగం

**- వారణాసి రామకృష్ణ**




వయసు, అనుభవం పెరిగే కొద్దీ విచక్షణ పెరుగుతుంది! కానీ కొందరికి అహం, గర్వం పెరుగుతుంది! దానికి ఉదాహరణ-అమ్మో! మనుషుల పేర్లు వద్దులెండి-పోట్లాటకొస్తారు. అందుకని అలాంటి వాళ్ళ లిస్టులో ఉన్న పేరు-చిత్రగుప్తుడు! ఎన్నో యుగాల నుంచి యమ ధర్మరాజు దగ్గర 'కీ' పోస్టులో పనిచేసేసరికి గర్వం పెరిగింది. దీనికి తోడు అతనికీమధ్య కంప్యూటర్ ఇచ్చిన దగ్గర్నించీ యమభటుల నెత్తిమీది కొమ్ముల కంటే వాడిగల కొమ్ములు తలమీద మొలిచాయి! దాంతో ఇష్టం వచ్చినట్టు కంప్యూటర్‌లోని మనుషుల పేర్లకెదురుగా 'మౌస్'తో క్లిక్ చేసి పారేస్తుంటే-పాపం ఇక్కడ భూమ్మీద ఆ పేరు గల మానవులు హఠాన్మరణం అనగా ఉన్నట్టుండి ఆక్సిడెంటూ లేదా పాతికేళ్ళకే కొలెస్టరాల్ పెరిగి ఠపీఠపీ మని బాల్చీలు తన్నేస్తున్నారు.

అయితే అహంకారులందరికీ ఏదో ఒక రోజు నెత్తిమీది కళ్ళు నేలకి దిగినట్టుగా గుప్తుడికీ గర్వభంగం కలిగింది! అదీ ఇద్దరు మానవ వనితల మూలంగానే!

ఎలా అని ఆశ్చర్యమా? అయితే ఆ వైనాన్ని చిత్తగించండి!

ఆ రోజు యధావిధిగా తెల్లారింది. ఇక్కడ కాదు-యమలోకంలో! చిత్రగుప్తుడు కంప్యూటర్ ముందు కూర్చుని కులాసాగా గేమ్స్ ఆడుతున్నాడు... సరిగ్గా అప్పుడు ఇద్దరు భటులు ఒక కుర్రాడ్ని పట్టుకుని వచ్చారు. గుప్తుడు వాళ్ళని విసుగ్గా చూసి

"ఏంటయ్యా-మనిషిని పట్టుకొచ్చారా?" అంటూ కంప్యూటర్ స్క్రీన్ మార్చి బద్ధకంగా ఆవలిస్తూ

"ఈ నర మానవుడి పేరేంటి?" భటుడ్ని అడిగాడు.

దానికా కుర్రాడు "కె.మృత్యుంజయరావ్!" చెప్పాడు. గుప్తుడు కుర్రాడ్ని ఉరిమిచూసి

"నువ్వు చచ్చినవాడివి! నోరెత్తటానికి వీల్లేదు!" అంటూ కంప్యూటర్లోని పేర్లన్ని తిరగేసి బోర్లించి అటుఇటు తిప్పి చూసి భటుడితో...

"వీడి పేరెక్కడా చచ్చిన వాళ్ళ లిస్టులో లేదు కదా! వీడ్నెందుకు పట్టుకొచ్చావు?" కోపంగా అన్నాడు.

భటుడు నిర్లిప్తంగా "ఏమో! నాకేం తెలుసు? హాస్పిటల్‌లో చచ్చి పడుంటే పట్టుకొచ్చా!" అన్నాడు.

"చచ్చి పడుంటే పట్టుకురావటమేనా? నీకిచ్చిన లిస్టులో పేరు ఉందో లేదో చూసుకోవద్దా?" కేకలు వేశాడు. అంతసేపూ నిశ్శబ్దంగా ఉన్న మరో భటుడు కోపంగా "ఏంటీ..? తెగ రెచ్చిపోతున్నావు? నీ ఇష్టం వచ్చినట్టు లిస్టు తయారు చేసి పట్టుకు రమ్మంటే పట్టుకొస్తామనుకుంటున్నావా? ఇక మీదట అవన్నీ నడవవ్!"

చెప్పే సరికి గుప్తుడు మరింత కోపంగా "ఏంటీ-నన్నే ధిక్కరిస్తావా? రాజుగారు రానీ-నీ సంగతి చెప్పి సస్పెండ్ చేయిస్తా!" అన్నాడు.

"నువ్వేంటి నన్ను సస్పెండ్ చేయించేది? నేనే పెద్దబాసు విష్ణుమూర్తి గారికి చెప్పి నిన్నీ సీట్లోంచి డిస్మిస్ చేయిస్తా! నువ్వు చేసే అవకతవకలన్నీ బైటపెడతా!"

ఆగ్రహంగా చిందులు తొక్కుతుంటే గుప్తుడు హడలిపోయి మరో భటుడితో

"వీడేంటిలా వీరంగమాడుతున్నాడు? వీడికెవరైనా గాడ్ ఫాదర్ దొరికాడా?" అడిగాడు.

"గాడ్ ఫాదర్ కాదు. గాడే ఫాదర్‌లా దొరికాడు! ఇతన్ని మా భటులందరికీ లీడర్‌గా నిన్ననే విష్ణుమూర్తి గారు అపాయింట్ చేశారు!"

చెప్పే సరికి గుప్తుడు కంగుతిని లీ.భ.తో

(అనగా లీడరు భటుడితో)

"నువ్వు నిజంగా ఎంత గొప్ప భటుడివి! లీడర్‌గా ఎన్నిక అయి కూడా కష్టపడి పని చేస్తున్నావు!"

పొగడేసరికి లీభ "చాలు! అంతొద్దు కానీ పనిచూడు ముందు" అన్నాడు.

గుప్తుడు కంప్యూటర్లో కుర్రాడి జాతకం చూసి "అమ్మో! వీడింకా అరవై ఏళ్ళు బతకాలి! అప్పుడే ఎలా చచ్చాడు?"ఆశ్చర్యంగా అనగానే కుర్రాడు మృత్యుంజయ్ ఆనందంగా

"ఆ! నాకింకా ఆయుషుందా? అయితే వెంటనే భూలోకం పంపెయ్యండి! లేటయితే నా గర్ల్‌ఫ్రెండ్ నా క్లోజ్ ఫ్రెండ్‌తో ఐ లవ్యూ అని చెప్పేస్తుంది!" హడావిడి పడ్డాడు.

లీభ కుర్రాడి భుజం తట్టి "తొందర పడకు మానవా!" చెప్పి గుప్తుడితో...

"ఈ మధ్య చాలా రోజుల్నించి ఇలానే జరుగుతోంది! భూమ్మీదున్న ఇద్దరు క్రూర వనితలు ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించటం వల్ల ఇలా ఎందరో అకాల మృత్యువాత పడుతున్నారు" చెప్పాడు.

"ఆ!! ఇంత ఘోరం జరుగుతున్నదా? ఎవరా క్రూర వనితలు?"

గుప్తుడు ప్రశ్నించగానే లీభ రిమోట్‌తో టీవీ ఆన్ చేసి భూమ్మీదున్న ప్రభుత్వ ఆసుపత్రి దృశ్యంలో వచ్చేలా ట్యూన్ చేశాడు.

అక్కడ ఇద్దరు స్టాఫ్ నర్సులు-గరం గంగావతి ఐసియూలో పనిచేస్తుంది. మరొకామె భయంకర భద్రావతి ఇన్‌పేషెంట్ వార్డులో పని చేస్తుంది.

ఇద్దరూ ఏ ఘడియలో పుట్టారో కానీ ఇద్దరి మధ్యా పచ్చగడ్డి వేస్తే భగ్గుమనటం అటుంచి కాలిన బూడిద వెంటనే మాయం అవుతుంది!

లీభ రిమోట్‌తో రివైండ్ చెయ్యగానే రహదారి కన్పించింది!

లీభ వెంటనే "స్టార్ట్! యాక్షన్!" అరిచాడు. రహదారి మీద దృశ్యం టీవిలో ప్రారంభమయింది. రహదారి మీద కునికిపాట్లు పడుతున్న కానిస్టేబుల్ దగ్గరికి దుమ్ము లేపుకుంటూ పోలీసు జీపు వచ్చి ఆగింది. అందులోంచి ఇన్‌స్పెక్టర్ దిగి

"ఏం వెంకటస్వామి! కేసు తగల్లేదా?" అడిగాడు కానిస్టేబుల్‌ని.

"ఇంకా లేద్సార్"

"వెంటనే ఒక్క కేసు బుక్ చెయ్యకపోతే ఈ నెల కోటా పూర్తి కాదు! అసలే కొత్త సి.ఐ. యమా స్ట్రిక్టు! కేసు లేకుండా స్టేషన్‌కొస్తే ట్రాన్సఫర్ గ్యారంటీ!"

వెంకటస్వామి హడలిపోతూ "వద్దుసార్! అంత పని చెయ్యకండి సార్! ఎలాగైనా కేసు పట్టుకొస్తాను సార్" చెప్పగానే యస్.ఐ.

"కేసు పట్టుకుని స్టేషన్ కొచ్చెయ్యి" అంటూ జీపు స్టార్ట్ చేసి వెళ్ళిపోయాడు.




మృత్యుంజయ టిప్‌టాప్‌గా తయారయి మోటార్‌బైక్ మీద గర్ల్‌ఫ్రెండ్‌ని కలవటానికి వెళ్తుండగా-వెంకటస్వామి "ఆగు!" అరిచాడు. మృత్యుంజయ పోలీసుని చూడగానే బెదురుపుట్టి ధన్‌మని బండి ఆపి బెరుగ్గా చూశాడు. వెంకటస్వామి "ఏరా కుర్రాడా? లైసెన్స్ ఉందా?" గర్జించాడు... మృత్యుంజయ కాగితాలు బ్యాగులోంచి తీసి చూపించాడు. అన్నీ కరెక్టుగా ఉన్నాయి. వెంకటస్వామికి ఏం చెయ్యాలో పాలుపోలేదు. వీడ్ని ఇరికించకపోతే-అమ్మో! ట్రాన్స్‌ఫర్ గ్యారెంటీ గుర్తొచ్చి, వెంటనే ఉపాయం తట్టి-

"రూల్స్ పాటించ కుండా ఇష్టం వచ్చినట్టు పోవటమేంట్రా కుర్రాడా?" గదిమాడు.

మృత్యుంజయ బెదిరిపోయి "అదేంటి సార్! కరెక్టుగానే లెఫ్ట్ సైడ్ వెళ్తున్నాను కదా!" చెప్పాడు

"అదే మరి చెప్పేది-నువ్వు లెఫ్ట్ సైడ్ ఎందుకెళ్తున్నావ్, రైట్ సైడ్ వెళ్ళాలి కదా!" చెప్పాడు.

"ఆ దెబ్బకి మృత్యుంజయ అదిరి పోయి "సార్! రైట్ సైడా?" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏంట్రా కుర్రాడా! అట్లా ఆశ్చర్యపోతావ్! నిన్నెవరైనా ఏదైనా ప్రశ్న అడిగితే రాంగ్ ఆన్సర్ చెప్తావా, రైట్ ఆన్సర్ చెప్తావా?" చొక్కా కాలర్ గుంజుతూ అడిగే సరికి వణికిపోతూ..

"రైట్ ఆన్సర్ చెప్తాను సార్!" చెప్పాడు

"బస్సు బైలుదేరాలీ అంటే కండక్టరు లెఫ్ట్ లెఫ్ట్ అంటాడా రైట్ రైట్ అంటాడా?"

"రైట్ రైట్ అంటాడు సార్!"

"మరి నువ్వు రైట్ సైడ్ వెళ్ళటం రైటా-లెఫ్ట్ సైడ్ వెళ్ళటం రైటా?"

"రైటే రైటు సార్!"

"కదా-మరి లెఫ్ట్ ఎందుకెళ్ళావ్? తప్పేనా?" అనే సరికి మృత్యుంజయ బుర్ర అవునని అడ్డంగా ఆడించాడు. వెంకట స్వామి పకపకమని నవ్వి "అమ్మయ్య! ఈనెల కోటా సక్సెస్! పద-స్టేషన్‌కి పద!" అంటూ మోటార్ బైక్ వెనక్కి కూర్చున్నాడు.

మృత్యుంజయ బండి స్టార్ట్ చేసి స్పీడుగా లెఫ్ట్ సైడ్ పోకుండా రోడ్డుకి రైట్‌సైడ్ పోనిచ్చాడు.

ఎదురుగా ఒకలారీ వేగంగా రావటం వెంకటస్వామి గమనించి,

"ఒరే-ఒరే కుర్రాడా? ఇదేంట్రా ఇట్లా పోనిస్తున్నావు? లెఫ్టు పోకుండా రైటు సైడు నడుపుతున్నావేంట్రా" భయంతో అరిచాడు.

మృత్యుంజయకి మరింత కంగారు పుట్టి

"అదేంటి సార్! రైట్ పోవటమే రైటని చెప్పారు కదా సార్!" అంటుండగా, వెంకటస్వామి "ఒరే నీ తెలివి తెల్లార! నా చావుకి తెచ్చావు కదరా!" అని గట్టిగా అరుస్తుండగా లారీ వేగంగా వచ్చి దాదాపుగా గుద్దబోయి లారీ డ్రైవర్ చాకచక్యంగా పక్కకి తిప్పేసరికి వెనక మరింత వేగంగా వస్తున్న



అంబులెన్స్ సడెన్‌గా రోడ్డుమీద అడ్డంగా వచ్చిన బైక్‌ని ఢామ్మని గుద్దేసింది. వెనక కూర్చున్న వెంకటస్వామి గాల్లోకి లేచి రోడ్డు కావల ఉన్న మురికి నీళ్ళ కాలవలో ఢడేల్‌మంటూ పడ్డాడు. మృత్యుంజయ రోడ్డు మీద పడటంతో ఒళ్ళంతా గాయాలయ్యాయి. వెంటనే అతన్ని అదే అంబులెన్స్‌లో ఆసుపత్రికి తరలించారు.

ఆస్పత్రిలో గాయాల బాధలకి తట్టుకోలేక అరుస్తుంటే, భయంకర భద్రావతి లావుపాటి ఇంజక్షన్ పట్టుకొచ్చి "ఏంట్రా కుర్రాడా! అట్లా అరుస్తావ్? ఇదేమైనా నీ ఇల్లనుకున్నావా?'' అంటూ ఇంజక్షన్ పొడిచింది. దాంతో "అమ్మో!'' కేక పెట్టాడు.

"నొప్పిగుందా బిడ్డా! బండిమీద పూలపూల చొక్కాలేసుకుని సోకులు కొడుతూ హీరోలెక్క స్పీడుగా పోతున్నపుడు నొప్పి తెలీదా బిడ్డా!'' నవ్వేసి వెళ్ళింది.

కాసేపయ్యాక మృత్యుంజయకి ఊపిరి ఆడనట్లయి ఎగశ్వాస పీల్చడం ప్రారంభ మయింది. అటుగా వెళ్తున్న ఒక డాక్టర్ చూసి "సిస్టర్! భద్రావతీ!'' కేకపెట్టాడు. భద్రావతి కారాకిళ్ళీ నములూ మెల్లగా వచ్చి "ఏంది... ఏమయింది?'' అడిగింది.

"ఈ పేషంటు చావు బతుకుల్లో ఉన్నాడు. ఆక్సిజన్ పెట్టి వెంటనే ఐసియూ వార్డుకి షిఫ్ట్ చెయ్యి!''

"ఐసియూకా? నేను అక్కడికైతే చెయ్య!'' మొండిగా అన్నది. డాక్టర్ ఆశ్చర్యంగా చూసి

"ఎందుకని?'' ప్రశ్నించాడు.

"ఐసియూలో పనిచేసే గరం గంగావతి అంటే నాకిష్టం లేదు! ఆమెకీ నాకు పడదు!''

ఆ మాట డాక్టర్‌కి తల తిరిగి బుర్ర గోక్కుంటూ ''ఏమిటి నువ్వు చెప్పేది?'' నోరెళ్ళబెట్టాడు.




"అవును డాక్టర్! కావాలంటే నాదోస్తు నీలవేణి మార్చురీలో పనిచేస్తుంది! అక్కడికి షిఫ్టు చేస్తా! మేమిద్దరం చక్కగా కబుర్లు చెప్పుకుని ఎన్ని రోజులయిందో!'' సంబరంగా చెప్పింది.

డాక్టర్‌కి ఒళ్ళు మండిపోయింది కానీ తెలివిగా మాత్రమే అక్కడ వ్యవహరించాలని తెలుసు కాబట్టి "ఓకే సిస్టర్! నువ్వెళ్ళి నీలవేణితో కబుర్లు చెప్తుండు! నేను గరం గంగావతిని ఇక్కడికి రమ్మని పేషంటుని తన వార్డుకి తీసుకెళ్ళమని చెప్తాను!'' అనేసరికి భద్రావతి కోపంగా..

"వ్వాట్ డాక్టర్! నా డ్యూటీ నన్ను చెయ్యనీకుండా అడ్డు తగులుతావా? ఇప్పుడే మా అసోసియేషన్ సెక్రటరీకి చెప్పి సమ్మె చేస్తాం! ధర్నాలు చేస్తాం! ఆందోళనకి దిగి పేషం ట్లందర్నీ చావ బాదుతాం! ఆస్పత్రి లో పరికరాలన్నీ ధ్వంసం చేస్తాం! ఖబడ్దార్!!'' వీరావేశంగా చెప్పి ఆయాసంతో ఆగి "-కాబట్టి నా పని నన్ను చెయ్యనివ్వండి!'' అంటూ ఆక్సిజన్ సిలిండర్ పేషంట్‌కి పెట్టి స్ట్రెచర్ మీద ఐసియూకి మారు స్తుంటే డాక్టర్ విజయం సాధించిన వాడిలా గర్వంగా నవ్వాడు.




ఐసియూ వార్డు తలుపు దగ్గర గంగావతి కోపంగా గుడ్లు మిటకరిస్తూ చూస్తోంది. భద్రావతిని చూడగానే బుస్సుబుస్సు మని శ్వాస బలంగా విడిచింది. గంగావతిని చూసి భద్రావతి కస్సుకస్సుమని ఎగశ్వాస పీలుస్తూ ముక్కుపుటలు ఎగరేసింది.

మృత్యుంజయ స్ట్రెచర్ మీద మూలుగుతూ పడి ఉన్నాడు. స్ట్రెచర్‌ని గంగావతి లాగుతూ

"ఇక్కడితో నీ సామ్రాజ్యం అయిపోయింది. లోనికి రామాకు! మర్యాద దక్కదు!'' అరిచింది. భద్రావతి కోపంగా'' నువ్వు రమ్మన్నా దిక్కుమాలిన నీ వార్డులోకి రాను!'' హూంకరించింది.

"దిక్కుమాలిన వార్డు నాది కాదు-నీదే!''

"ఛుప్! నాది కాదు-నీదే!''

"షటప్! నాది ఐసియూ వార్డు-అంటే చాలా ముఖ్యమైన వార్డు!''

"ఆఁ ముఖ్యం! సింగినాదమేమీ కాదు! నాది ప్రాణాలు పోసే వార్డు-నీది తీసే వార్డు!''

"ఏం కూసావే? నాది ప్రాణాలు తీసే వార్డా? నువ్వు పట్టుకొచ్చిన పేషంటు ఆక్సిజన్ సిలిండర్ పీకి పారేస్తే నీ తిక్క కుదురుతుంది!''

"ఏం-ఒళ్లు తిమ్మిరి తిమ్మిరిగా ఉందా? నోటికొచ్చినట్లు వాగకు! నా పేషంటు ఆక్సిజన్ పీకుతావా?''

"ఏం పీకలేననుకున్నావా?''

"బస్తీమే సవాల్! పీకు చూద్దాం-''

"పీకానంటే ఉద్యోగం వూడి పీక్కోలేక చస్తావ్''

"పీకావో-నిన్ను రెండు పీకుతా! నీ పీక పిసుకుతా!''

"అంత ధైర్యమా నీకు? పీకుతా చూడవే!'' అంటూ మృత్యుంజయ ముక్కుకి తగిలించిన ఆక్సిజన్ సిలిండర్ ట్యూబు కాస్తా పీకి పారేసింది. భద్రావతి వెంటనే గంగావతిని గోళ్ళతో రక్కింది.

గంగావతీ తక్కువ తినలేదు. పళ్ళతో కొరికింది! జుట్లు జుట్లు పట్టుకుని పీక్కుంటూ- ముఖాముఖి - పోరి పోరికే బీచ్ హోరా హోరీ సాగుతుండగా మరో పక్క మృత్యుంజయ విలవిలా తన్నుకుని కర్రలా బిర్రబిగుసుకు పోయాడు.

అక్కడితో టీవీలో దృశ్యం ముగిసింది!

లీభ రిమోట్‌తో టీవీ ఆఫ్ చేసి "అట్లా ఈ కుర్రాడు చచ్చిపోగానే పట్టు కొచ్చేసాం!'' చెప్పాడు. చిత్రగుప్తుడికి ఒళ్ళు మండుకొచ్చి

"ఇదేం పొయ్యేకాలమయ్యా! చక్కగా వైద్యం చేసి కాపాడాల్సింది పోయి వాళ్ళే ఇట్లా ప్రాణాలు తీస్తారా?'' ఆగ్రహించాడు.

లీభ నిర్లిప్తంగా చూసి "నిజానికి భూమ్మీద ఎందరో నర్సులు వేలు లక్షల మంది రోగులకి

నిస్వార్థంగా సేవలందిస్తున్నారు. అక్కడక్కడా ఇలాంటి వాళ్ళు ఉండడంతో పవిత్రమైన వాళ్ళ వృత్తికే కళంకం ఏర్పడుతోంది!'' చెప్పి చిత్రగుప్తుడ్ని కాస్త కోపంగా సూటిగా చూసి "వాళ్ళు ఒక్కసారి మానవత్వం మరచి అమానుషంగా ప్రవర్తించగానే మీకింత కోపం వచ్చిందే మరి మీరు గత కొంతకాలంగా కంప్యూటర్‌లో గేమ్స్ ఆడుతూ మీ వృత్తి మీరు సరిగ్గా చెయ్యక ఇష్టం వచ్చినట్టు పేర్లని వొత్తేస్తున్నారే-అదెంత అమానుషమో అర్థమైందా?'' తీవ్రంగా చెప్పేసరికి గుప్తుడు-

"నిజమే లీభ! కంప్యూటర్ వచ్చాక పని మరింత సులభమయింది కనుక పనిలో నాణ్యత పెంచాల్సింది పోయి దారుణంగా ప్రవర్తించాను!'' పశ్చాత్తాపంతో చెప్పాడు.

చిత్రగుప్తుడిలో మార్పు రాగానే చిత్రంగా లీభ బుస్సుమని మాయమైపోయి ఆ ప్లేసులోకి డుస్సుమని యమధర్మరాజు ప్రత్యక్షమయ్యాడు.

గుప్తుడు ఆశ్చర్యపోయి లేచి నిలబడి నమస్కరిస్తూ "మీరా! రాజు గారూ మీరేనా?'' అన్నాడు.

యమధర్మరాజు నవ్వి "నేనే గుప్తా! నీకు గర్వభంగం అవటం కోసం భటుడి వేషంలో నేనే

## సాంగురే బంగారు రాజా...

...ఇంటింటా- రామాయణం

వింతైన- ప్రేమాయణం

కలిసుంటే- సల్లాపము

విడిపోతే - కల్లోలము!!



వెళ్లి ఈ కుర్రాడ్ని పట్టుకొచ్చాను!'' చెప్పి మృత్యుంజయ వంక చూసి

"బాలకా! కాలేజీకి వెళ్ళి చక్కగా చదువుకుని వృద్ధిలోనికి వచ్చిన పిదపే నచ్చిన ప్రేయసితో వివాహ యత్నం చేయుము. అంతవరకూ ప్రేమా, దోమలకి దూరం ఉండుము! పొమ్ము!''-అని చెప్పి "బాలకా! రహదారి మీద రైటు పోవుట రాంగు! లెఫ్టు పోవుటయే కరెక్టు! అర్థమైందా? ఇక పొమ్ము!!''

అని చెయ్యెత్తగానే మృత్యుంజయ మాయమైపోయాడు.

గుప్తుడు మరింత ఆశ్చర్యంగా "రాజుగారూ! మరి నిత్యం పోట్లాడుకుంటూ అమాయకులని చంపుతున్న నర్సుల సంగతి-'' అని పూర్తి చెయ్యకముందే

"హాహా! నువ్వేమీ వర్రీ కాకు గుప్తా! నవ్వడం మానవుడికి దేవుడిచ్చిన వరం! ఇకపై మానవత్వం మరచి భూమ్మీద ఎవ్వరు కలహించుకున్నా, విధులను బాధ్యతతో నిర్వహించక గర్వం తలకెక్కించుకున్నా అట్టి వారికి హాస్యం అర్థం కాక నవ్వుకు నోచుకోక జీవితంలో ఎప్పుడూ ఏడుపుగొట్టు మొహాలతో ఉందురు గాక!!'' శాపం పెట్టాడు! ■




# హాస్యాభిషేకం




మల్లాది వెంకట కృష్ణమూర్తి కొత్తపుస్తకం- 'హాస్యాభిషేకం' అనే జోక్స్ కలెక్షన్ బుక్‌లో ఆయన పలురకాల జోకులు అందించారు. ఆపుస్తకంలో మూర్ఖులపై జోక్స్ అందించిన హాస్యానికి మచ్చుతునకలు కొన్ని :-

* హాస్పటల్‌లోకి వస్తున్న ఒకతనికి తెల్లబట్టల్లో ఉన్న ఇద్దరు డాక్టర్లు రోడ్డుమీది రాళ్ళల్లో దేనికోసమో వెతుకుతూండడం కనబడింది. అతను ఆసక్తిని చంపుకోలేక వాళ్ళ దగ్గరకి వెళ్ళి అడిగాడు.

"దేనికోసం వెతుకుతున్నారు?''

"హార్ట్ ట్రాన్స్‌ప్లాంట్‌కి ఓ ఇన్‌కంటేక్స్ ఆఫీసర్ వచ్చాడు. సరైన రాయికోసం చూస్తున్నాం'' బదులు చెప్పారు ఆ డాక్టర్లు.

* కొత్తగా పెళ్ళయిన భార్యభర్తలు గైనకాలజిస్ట్ దగ్గరకి వెళ్ళారు. పరీక్ష చేశాక ఆమె గర్భవతని తేలింది. ఏమే మందులు వాడాలో చెప్పాక ఆ డాక్టర్, నీళ్ళకి చెరగని ఓ ఇంక్‌పేడ్‌లో రబ్బర్ స్టాంప్‌ని అద్ది ఆమె పొత్తి కడుపుమీద ముద్ర వేశాడు.

"దేనికది?'' అడిగాడు భర్త ఆశ్చర్యంగా.

"త్వరలో మీకే తెలుస్తుంది'' నవ్వాడు డాక్టర్.

ఆసక్తిని చంపుకోలేక భర్త ఇంటికి వెళ్ళాక భూతద్దం తీసుకుని అతి చిన్న అక్షరాల్లో ఉన్న ఆ ముద్రని చదివాడు.

"దీన్ని మీరు చదవగలిగినప్పుడు మళ్ళీ డాక్టర్ దగ్గరకి చెకప్‌కి రండి'' అని వుంది.

*ఓ భార్య టి.వి. గదిలో కూర్చుని తెలుగు సినిమా ముక్కల ప్రోగ్రాం చూస్తుంటే, పక్కగదిలోంచి తన భర్త ఎవరినో బూతులు తిడుతూండడం వినిపించింది. వెంటనే ఆమె లేచి ఆ గదిలోకి వెళ్ళి చూస్తే అక్కడ ఎవరూ లేరు.

"ఏమిటండీ? ఎవర్ని తిడుతున్నారు?''

ఆశ్చర్యంగా ప్రశ్నించింది భార్య.

"ఎవర్నీ తిట్టడంలేదు. ఊరికే ప్రాక్టీస్ చేస్తున్నాను'' జవాబు చెప్పాడతను.

"ఏం ప్రాక్టీస్ చేస్తున్నారు?''

"మర్చిపోయావా? రేపేగా నేను ఎస్.ఐ.గా పోలీస్‌స్టేషన్‌లో ఉద్యోగంలో చేరేది'' చెప్పాడతను.



*"ఏమండీ! మనమ్మాయి పావలాబిళ్ల మింగేసింది. డాక్టర్ దగ్గరకి తీసుకెళ్ళండి.''

"వద్దే! ఆయన దగ్గరకి తీసుకెళితే వందరూపాయలు మింగేస్తాడు.

*"ఈ మధ్య రాయడం మానేసారే?'' ఓ రచయితని అడిగాడో పాఠకుడు.

"ఐడియాస్ రాక'' జవాబు చెప్పాడు రచయిత.

"కాని ఇదివరకు రాయడానికి మీకది అడ్డువచ్చేది కాదుగా?'' ప్రశ్నించాడు ఆ పాఠకుడు.

*"ఆపరేషన్ గదిలోంచి నువ్వెందుకు పారిపోయావు?'' హాస్పిటల్ ఇన్‌చార్జి ఓ రోగిని అడిగాడు.

"నర్స్ ధైర్యంగా వుండమని చాలాసేపు ధైర్యం చెప్పింది కాబట్టి.''

"అయితే?''

"నాక్కాదు. ఆపరేషన్ చేసే డాక్టర్‌కి ధైర్యం చెప్పింది'' జవాబు పూర్తిచేశాడు రోగి.

సీరియల్

13

# సినీతిచంద్రిక



రావి కొండలరావు

### జరిగిన కథ

ఒక ఊళ్లో ఒక ధనవంతుని కుమారుడు సినిమా తీస్తానని పట్టుబడతాడు. ఒక మాజీ దర్శకుడు వచ్చి వాళ్లకు సినిమా తీయడంలో సాధక బాధకాలు చెప్పసాగేడు. "నిర్మాత హీరోయిన్ మోహంలో పడడం వల్ల నా మొదటి సినిమా ఫెయిలయింది. ఆకలికి మాడుతుండగా ఫలానా అనే ఒకతను వచ్చి కొత్త నిర్మాత వద్దకు తీసుకెళ్లాడు. కథ గురించి చర్చించాక ఊరెళ్లి డబ్బులు తెస్తానని చెప్పి నిర్మాత మాయమయిపోయాడు. ఆకలిబాధలు తాళలేక ఓ పెద్ద డైరక్టరు వద్ద అసిస్టెంటుగా జాయిన్ అవుదామని వెళ్లాను. అక్కడ మాటలు పడలేక మానేసాను. ఫలానాకు ఏదో వేషం ఉందంటే రాత్రంతా స్టూడియోలో పడిగాపులు పడి చివరకు కాల్షీట్ క్యాన్సిల్ అవటంతో మరలా వచ్చి పార్కులోని పచ్చగడ్డిలో చిత్తుగా నిద్రపోయాం. (ఇక చదవండి)

"చిత్రఖేదం చూశావా ఫలానా?" అన్నాను నేను దార్లోనూ, పార్కులోనూ.

ఫలానా మాట్లాడలేదు; అతను చాలా కోపంగా ఉన్నాడు.

ఆ రోజు మధ్యాన్నం మెలకువ వచ్చింది. ఫలానాను లేపాను. సూర్యుడు నడినెత్తి దాటిపోయాడు. ఒంటిగంటో రెండో అయివుంటుంది. కడుపులో బ్రహ్మాండమైన ఆకలి వేస్తున్నది. చేతిలో కానీలేదు. ఫలానా దిగ్గునలేచి కూచుని - "దీం దుంపతెగ - ఏం ఆకలి గురూ .... చచ్చామే; ఉండండిగురూ .... ఇప్పుడే వస్తాను ...." అని చరచరా వెళ్ళిపోయాడు.

నా అవస్థకు నాకు నవ్వువచ్చింది. ఏడుపూ వచ్చింది. ఎన్నాళ్ళని ఈ అవస్థలు, బాధలు ఇట్లాపడాలి? ఈ ఖర్మం ఎందుకు పట్టినట్టు? హాయిగా ఇంటిపట్టున పడివుంటే - ఉన్నా, లేకపోయినా, వేళకింత తిండయినా తినవచ్చును. ఉన్న పొలం ఏదో చూసుకోవచ్చును. ఇంటి దగ్గర, బంధువులంతా గుర్తుకొచ్చారు. ఇక్కడ ఈ బాధలు ఇంకవడలేను. ఇంటికిపోయి పడివుంటాను అని తేల్చుకున్నాను.

అరగంటపోయాక, ఫలానా పరుగెత్తుకుంటూ వచ్చి "పదండి గురూ, హోటలు కట్టేస్తున్నాడు. పదండి, పదండి." అని తొందరచేశాడు.

"ఎందుకూ?" అన్నాను.

చేతిలో రెండు భోజనం టిక్కెట్లు చూపిస్తూ "పదండి మరి సంపాయించాను. లేకపోతే చస్తామా'' అన్నాడు ఫలానా పరుగెత్తుతూ.

చరచరా హోటలు చేరుకుని అక్కడే మొహాలు కడుక్కుని వాడు ఏం పెడితే దాన్నే అమృతం అనుకొని కడుపులు నింపుకున్నాము. బయటకొచ్చాక, "ఫలానా; నేను మా ఊరు వెళ్తున్నాను. ఎలా వెళతారు అని అడక్కు. వెళతాను. మళ్ళీ వస్తాను. వీలైతే నేనే వో పార్టీని తీసుకొచ్చి, మంచి చిత్రం తీస్తాను. నువ్వు చేసిన మేలు మాత్రం మరచిపోలేను థాంక్స్" అన్నాను. ఎప్పుడూ హుషారుగా ఉండే ఫలానా, ఒక్కసారి దిగులు పడ్డాడు. కళ్ళమ్మటినీళ్లు కూడా పెట్టుకున్నాడు.

''టిక్కట్టు కొనకపోయినా దారి ఖర్చయినా ఉండాలిగా గురూ నా దగ్గరేంలేదు ఇవ్వటానికి ....'' అన్నాడు విచారంగా.

"ఖేదపడకు, ఏం ఫర్వాలేదు, మళ్ళీ వస్తాను. తప్పకుండా వస్తాను ..." అని, ఫలానా చేతిని తీసుకుని, వూపి - "విష్ యూ గుడ్‌లక్" అని వెళ్ళిపోయాను. ఆ వెళ్ళిపోవటం, పోయిపోయి సెంట్రల్ చేరుకున్నాను. రాత్రి బయల్దేరే కలకత్తా మెయిల్‌లో పడ్డాను. దార్లో ఎవరన్నా టిక్కట్టు అడిగితే దిగిపోవటానికి గాని, వాళ్ళు వేసే శిక్షకు గాని సిద్దపడే ఉన్నాను. నేను చేస్తున్నది నేరమే ఐనా, పరిస్థితులను బట్టి అట్లా ప్రవర్తించవలసి వచ్చింది. అదృష్టవశాత్తూ నేను పట్టుబడలేదు. మొత్తానికి ఈ ఊరుచేరుకున్నాను. విన్నారా, ఈ బాధలు.... దుఃఖాలు, విచారాలు .... ఇవన్నీ విన్నారు కదూ. వీటినే మొత్తంగా చేరిస్తే "చిత్రఖేదము" అనబడుతుంది. ఆ ఘట్టం మీకు సూక్ష్మంగా వివరించాను'' అని కదిలాడు మహాశయుడు - నిట్టూరుస్తూ.

"అబ్బ - చాలా చెప్పావయ్యా -" అన్నాడు ధనవంతుడు తెగ నిట్టూరుస్తూ.

" ఆఁ ఏముంది - నథింగ్ - ఇది జస్టు సంక్షిప్తం చేసినది. మహాభారతాన్ని మూడు గంటల్లో సినిమా తీసినట్టు - చెప్పాను" అన్నాడు మహాశయుడు.

"ఇంకా ఏమైనా చెబుతారా - ఐందా?" అని లేచాడు కుమారరత్నం.

"ఇంకొక్కటి ఉంది, అదే ఆఖరిది. మీరు విన్న చిత్రలాభము, చిత్రభేదము, చిత్రఖేదము - తర్వాత చిత్రమోదము అనే ఘట్టాన్ని వివరించి, ఈ "సినీతిచంద్రికను ముగిస్తాను" అన్నాడు మహాశయ్.

"ఇవాళింక వద్దులెండి; రేపు కానిద్దురుగాని" అన్నాడు రత్నం చిరాగ్గా.

"ఓ, అట్లాగా" అని మహాశయుడు లేచాడు.

"చాలా చాలా సంగతులు చెప్పావయ్యా - అసాధ్యుడివే" అన్నాడు ధనవంతుడు.

మహాశయుడు సిగ్గుతో కూడిన చిరునవ్వు ఒకటి విసిరాడు వెళ్తూ.

ఆ మర్నాడుదయం ముగ్గురూ కూచున్నారు. మహాశయుడు ధనవంతుడింట్లోనే టిఫిన్ తిన్నాడు. చెయ్యైనా కడుక్కోకుండా "మొదలెట్టనా?" అని అడిగాడు.

''వెదుదువుగానిలే ఉండు..'' అని ధనవంతుడు చేతులు కడుకొచ్చి, వక్క వేసుకుని-కానీమన్నాడు, ఇవాళ్టితో ఈ కథ అయిపోతే, రేపు మద్రాసు బయల్దేర వచ్చునని, టిక్కెట్టు రిజర్వేషనుకు ఎట్లాగా -అని ఆలోచించ సాగాడు-రత్నం.

* * *

''ఐందాండి-ఈ ఊరొచ్చేసి-కొన్నాళ్ళు గడిపాను. అసలా సినిమానే అటువంటిది. ఎన్ని డక్కామొక్కీలు తినిపించినా ఇంకా మనల్ని లాగుతూనే ఉంటుంది, ఎప్పటికప్పుడే-"ఇంకా ఈ సినిమా ఫీల్డు వద్దు" అనిపించేస్తుందా-మళ్ళీ అంతలోనే మనసు లాగుతుంది... చిత్ర వైరాగ్యం..... ఈ ఊరొచ్చిన రెండు నెలల దాకా ఆ సంగతేం తలపెట్టలేదు. ఆ తర్వాత ఏం తోచకపోతే ఓ కథ తయారు చేశాను-రోజా కూచుని. బాగా వచ్చింది. బెంగాళీ కథలాగా వచ్చింది, ఈ సినిమా తీస్తే హిట్టని, రోజుకు వందసార్లైనా అనిపించేది. కాని, మళ్ళీ మద్రాసు వెళ్తే ఏం ప్రయోజనం? పోనీ, నేనే తీసుకుందాం అంటే స్థోమతు లేదు. అటు ఇటు చూసి, ఆ మర్నాడు నాలుగూళ్లు తిరిగాను, సినిమా వ్యాపారం ఎంత గట్టిదో-ఎంత పేరు వస్తుందో, ప్రఖ్యాతి వస్తుందో అని-కాస్త డబ్బున్న మనుషులికి నూరిపోశాను. అందులో కొంత మంది మోజు పడ్డారు. కొంత డబ్బు పెట్టడానికి ఇష్టపడ్డారు. కాని, వాళ్ళు పెట్టేది చాలా తక్కువ. మూడొంతు లైనా పెట్టుబడి పెట్టక పోతే. లాభం లేదన్నాను.

"డిస్ట్రిబ్యూటర్లుంటారుగా-వాళ్ల ఇవ్వరూ డబ్బు?" అని అడిగారు ఒకాయన.

"ఇస్తారు. ఐతే మనం పూర్తిగా వాళ్ళ డబ్బుమీద ఆధారపడరాదు. ఆధారపడితే చాలా నష్టాలు ఉన్నాయి. కావాలంటే, ఒక చిన్న పెద్ద కథ చెబుతాను వినండి.

"ఒకాయన సినిమా తియ్యాలని తెగ ఉబలాటపడి, కిందామీదా పడి, ఆఖరికి ఎట్లయితేనేం-మొదలెట్టాడు. (ఇంకావుంది)

## కమాల్ ప్రశ్న - ఢమాల్ కార్టూన్





**రాగం తీసే తానం**

**సంతానం**





ప్రముఖ గాయకుడు, స్వరకర్త లలిత సంగీత విద్వాంసుడు, వాగ్గేయకారుడు

**ఎం.చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

# లలిత సంగీతం

## రావోయి బంగారి మావాఁ

వచనం : పసిడి పొలాలలో పల్లెపడుచు తన మామ కోసం
కలవరపడుతూ యిలా పిలుస్తోంది

ప॥ రావోయి బంగారి మావాఁ
నీతోడి రాహస్యమొకటున్నదోయీ ॥రావోయి॥

చ॥ నీళ్ళ తూరల వెన్క నిలుచున్న పాటనే
జలజలల్ విని గుండె ఝల్లుమంటున్నాది ॥రావోయి॥

చ॥ అవిసి పువ్వులు రెండు అందకున్నయి నాకు
తుంచి నా సిగలోన తురిమి పోదువుగాని ॥రావోయి॥

చ॥ ఏటి పడవ సరంగు పాట గిరికీలలో
చెలికాడ మన వగల్ కలబోసి కొందాము ॥రావోయి॥



| | |
|---|---|
| రచన | : కొనకళ్ళ వెంకటరత్నం |
| సంగీతం | : ఘంటసాల |
| గానం | : ఘంటసాల |
| రాగం | : అభేరి |
| | -భీం పలాస్ (హిందుస్తాని సం॥) |
| తాళం | : ఖండచాపు (కర్ణాటక సం॥) |
| | - ఝప్‌తాల్ (హిందుస్తాని సం॥) |
| హరికాంభోజి స్వరాలు | |
| ఆరోహణ | : స గ మ ప ని స |
| అవరోహణ | : స ని ద ప మ గ రి స |

షడ్జము, సాధారణగాంధారం, శుద్ధమధ్యమం, పంచమం, కైశికి నిషాదం ఆరోహణలోను, తారషడ్జము, కైశికి నిషాదం, చతుశ్శృతి దైవతం, పంచమం, శుద్ధ మధ్యమం, సాధారణగాంధారం, చతుశ్శృతి రిషభం అవరోహణలోను వున్న స్వరాలు యీ రాగంలో.



లలిత గీతాలలో జానపద శైలిని అనుసరించి వ్రాయబడినవి ఎన్నోవున్నాయి. ఆ కోవకు చెందినవే నండూరి సుబ్బారావుగారు రచించిన ఎంకిపాటలు. ఎంకి, నాయుడు బావ పాత్రలను సృష్టించి ఎంతో భావుకతతో చక్కని గీతాలు అల్లారు నండూరి వారు. అదేవిధంగా కొనకళ్ళ వెంకటరత్నం 'బంగారి మామ పాటల'ను రసవత్తరంగా రూపొందించారు. 'రావోయి బంగారి మావాఁ' అనే యీ పాట పల్లె పడుచు తన ప్రియుని రాకకోసం పడే తపనను వెల్లడి చేస్తుంది. స్త్రీ పాడవలసిన యీ పాటను పురుషుడు పాడడమేమిటని యీ రోజులలో ఎవరైనా అనుకోవచ్చు. సుమారు 5,6 దశాబ్దాల క్రితం లలిత సంగీతం అభివృద్ధి చెందుతున్న దశలో, నాటకాలలో పురుషులు స్త్రీ పాత్రలు పోషించినట్లే స్త్రీలు పాడవలసిన పాటలను మగవారు కూడా పాడుతూండేవారు. 1940వ దశకంలో సాలూరి రాజేశ్వరరావుగారు ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో రావు బాలసరస్వతీదేవి చేత "కలగంటి కలగంటి కమల రేకులవంటి కన్నులు గల సామి కనిపించెనే" అనే పాటను పాడించి, ఆ తరువాత ఆయనే పాడి గ్రామఫోను రికార్డుగా విడుదల చేశారు. ఆయన గొంతుకలో కూడా ఆ పాట చాలా పాప్యులర్ అయింది. 'పంచదార వంటి పోలిసెంకటసామి నిన్ను నేను మరువలేనురా' అనే మరొక స్త్రీ పాడవలసిన పాటను ఘంటసాల గానం చేసి ఆ పాటకు ప్రాచుర్యాన్ని కలిగించారు. సుప్రసిద్ధ రంగస్థల నటుడు బందా కనకలింగేశ్వరరావు పాడిన 'గుత్తొంకాయ కూరోయ్ బావా కోరి వండినానోయ్ బావా- కూరలోపల నావలపంతా కూరి వండి నానోయ్ బావా' అనే బసవరాజు అప్పారావుగారి రచన గ్రామఫోను రికార్డుగా విడుదలై తెలుగువారిని బాగా ఆకట్టుకుంది.

"రావోయి బంగారి మావాఁ" అనే పాటకు ఉపోద్ఘాతంగా 'పసిడి పొలాలలో పల్లె పడుచు తన మామ కోసం కలవర పడుతూ యిలా పిలుస్తోంది' అని చెప్పి తరువాత ఘంటసాల ఆ పాటను పాడారు. సంగీత పరంగా చూస్తే పాటలలో గాయకులు పాడే ఆలాపనలు సాధారణంగా రెండు రకాలుగా ఉంటాయి. తాళం ప్రకారం ఆలాపనలు కూర్చబడగా గాయకులు పాడేవి ఒక రకము. తబలాపై తాళగతి నడుస్తూండగా దానికి కట్టుబడకుండా స్వేచ్ఛగా ఆలాపన చేయడం మరొకవిధము. ఆ రెండవ విధానంలో తాళాన్ని అనుసరించి కొన్ని ఆవర్తాలుగాని, లేక పాశ్చాత్య సంగీత పద్ధతి ప్రకారం కొన్ని 'బార్'లు గాని (బార్ లు సరి సంఖ్యగా అనగా ఈవెన్ నెంబరుగా వుండాలి) లెక్కగా నిర్ణయించుకుని ఆలాపన చేయడం జరుగుతూంటుంది. 'రావోయి బంగారి మావాఁ'



వచనం: పసిడి పొలాలలో పల్లెపడుచు తనమామకోసం
కలవరపడుతూ ఇలా పిలుస్తోంది

ప॥ సాసపప | పాగామ | మపపా, | ;; మగ |
రావో. య | బంగారి | మా. వా(. | . . . . |
గామనిప | మగగాగ | గగమాగ | రిసస రి |
సొతో. డి | రా. హాస్య | మొక టున్న | దో. యా. |
సాసపప | పాగామ | పససా దపద | పా;, |
రావో. య | బంగారి | మా.. వా(. | . . . |

1.చ॥ సాస సగ | గస సాస | సప పాప | మగమమా | ;పమగ | ;గామ | పనిసని పమగ |
నిళ్ళ తూ. | కల వెనక | నిలుచున్న | పా. టనే | . . . . | . . . | . . . . . . . |
గపమా గారి | సా;, | ;;, | సాస సగ | గస సాస | సప పాప | మగమమా |
. . . . . | . . . | . . . | నిళ్ళ తూ. | కల వెనక | నిలుచున్న | పా. టనే |
పదనిసా | నిద పమమ | పాసరి దప | మగరిసస | సాసపప | పాగామ |
జలజలల్ | విని గుం. డె | ఝల్లు. మం. | టు. న్న. ది | రావో. య | బంగారి |
పసని దపద | పా;, |
మా.. వా(.. | . . . |

2.చ॥ ససస సగ | గస సాస | సపపపా | మగమామ | ;;గా | పమాగాప మగ |
అవిసి పు. | వ్వులు రెండు | అం. ద కు | న్నయి నా కు | . . . | . . . . . |
సపపపా | మగమామ | , పదనిగ |
అం. ద కు | న్నయి నా కు | . ఉంచనా. |
సా;, | ;;, | ససస సగ | గస సాస | సాగగ | మాపాద | నిసనిసా | నిదపమగ |
. . . | . . . | అవిసి పు. | వ్వులు రెండు | రావోయ | బంగారి | మా. వా(. | . . . . . |
రిససనిని | నిరిసని | దప గరిస |
సిగలో. న | ఉంచమిపో | ముళ్ళుగా. ని |
సారిగ | మాపాద | పాదస ని, | పమగరిస | సారిరి | గామాగ | రిససా, | ;;, |
రావోయ | బంగారి | మా.. వా(. | . . . . . | రావోయ | బంగారి | మా. వా(. | . . . |
సారిరి | గామాగ | రిససా, | ;;, |
రావోయ | బంగారి | మా. వా(. | . . . |

3.చ॥ గామపని | నినినిపప | నిససనిస | సాస రిసనిస | ;;, | ;,పా |
ఏటిపటే | వసరం. గు | పా. టగిరి | కొలలో... | . . . | . . . |
పనిసరి నిరిసనిదదా... నిసనిరిసనిదపా.
పా,స నిరిసా ని... పా,ని సమగారిసా... 
ఆ....
గామ పనిసరిగా రిసానిదాపామాగారిసరి నిసగా,మరిగసా........
(తబలాపై తాళగతి నడుస్తుండగా యీ ఆలపన గానం చేయబడింది)
గామపని | నినినిపప | నిససనిస | సాస సా | పనిసగరి | సారిస నిదప |
ఏటిపటే | వసరం. గు | పా. టగిరి | కొలలో | చెవితా. కె | మన. వగల్ |
పసనిద | పమగరిస |
కలబోసి | కొం. దా. ము |
తరువాత 2వ చరణం చివరిలో పాడినట్లుగా పల్లవి పాడాలి.
ఆతరువాత
సారి పస సానిరిసా పగా గామా గపమాగా గసాగసా సా....
రా. వో... య. బంగా.... రి మా... వా(.....

## కొనకళ్ల వెంకటరత్నం

జానపద శైలిలో లలిత గీతాలను రచించిన వారిలో నండూరి సుబ్బారావుగారి తరువాత కొనకళ్ళ వెంకటరత్నం గారిని ప్రముఖులుగా చెప్పుకోవాలి. సముచితమైన పదబంధనతో సమున్నతమైన భావుకతతో అందమైన అక్షర శిల్పాలుగా రూపొందిన గేయాలు ఆయనవి.

**"సుక్కలన్ని కొండమీద సోకు జేసుకునే వేళ**
**పంటబోది వరిమడితో పకపక నవ్వేవేళ**
**సల్లగాలి తోటకంత సక్కలిగిలి పెట్టువేళ...**
**మొక్కజొన్న తోటలో ముసిరిన చీకట్లలో**
**మంచెకాడ కలుసుకో మరువకు మామయ్య'**

అంటూ సందేవేళ చీకట్లో తనమామను కలుసు కొమ్మంటూ కోడలుపిల్ల కొసరి పాడే యీ పాట సుప్రసిద్ధ జానపద సంగీత గాయనీమణులైన సీత, అనసూయల గాత్రాలలో చాలా ప్రసిద్ధి పొందింది. 1960వ దశకంలో 'అదృష్టవంతులు' చిత్రంలో యీ పాట చోటుచేసుకుని పి.సుశీల గాత్రంలో కె.వి.మహదేవన్ సంగీతంతో మరొకసారి ప్రజలను అలరించింది.



**"ముసురేసిందంటేమైన అసలే మతి పోతది మామా**
**ససిచెడినట్టుంటది లోలోన ఓ ముద్దుల మామా"** అనే పాటను ఆకాశవాణిలో రావు బాలసరస్వతీ దేవి పాడగా ఆ తరువాత 1969లో 'విధివిలాసం' అనే చలన చిత్రంలో ఉపయోగించ బడింది. సారథీ సంస్థ నిర్వాహకులు సి.వి.ఆర్.ప్రసాద్‌గారు నిర్మించిన ఆ చిత్రానికి మాస్టర్ వేణు సంగీత దర్శకుడుగాను, నేను అసోసియేట్ మ్యూజిక్ డైరెక్టరుగాను పని చేశాము. ఈ పాటలన్నీ 'బంగారి మామ పాటలు' అనే గ్రంథంగా 1960లో ప్రచురించబడినవి. ఆకాశవాణి కేంద్రాలలో కొనకళ్ళవారి గేయాలెన్నిటికో చాలా మంది స్వరకర్తలు బాణీలు కూర్చారు.

**"తబ్బిబ్బయింది నామనసు-తలుక్కుమన్నది నీ సొగసు మబ్బులు మబ్బులు మబ్బులొచ్చినయ్"**

పాటలో ఘంటసాల చరణాల మధ్యలో పాడిన పాట యొక్క నొటేషన్ ద్వారా యీ విషయాన్ని ఆలాపనలు, యీ రెండు రకాలుగా సాగాయి. పాఠకులు గమనించగలరు.

"వలచీనాడమ్మా మనసు కలచీ నాడమ్మా"
"ఈ యేళ మామయ్య మాయింటి కొచ్చాడు
ఎందుకో మరి ఎందుకో ఈ సందేళ పులమారి
నందుకో"
"ఎందుకో యీ రేయి యింత చక్కని హాయి
పయనమెందాకాను బంగారిమామా"
"గోదారి గట్టంట పోదారిమామా
సిగ్గులో వలపేటో భగ్గుమన్నది"
"పట్న వాసమెందుకులే బంగరి పిల్లా - ను
వ్విష్ట పడితివా స్వర్గం భూతలమెల్లా"
"ఒంటరినైపోనా యీ ఓరు గాలిలోన దొరా"

మొదలైన పాటలు ఆకాశవాణిలో విస్తృత ప్రచారాన్ని పొందాయి. శ్రీ పాలగుమ్మి విశ్వనాథం మున్నగు స్వరకర్తలు కొనకళ్ళ గీతాలకు స్వరరచన చేయగా డా॥కనకవల్లి, ఇందిరా రంగారావు యింకా మరెందరో ఆ పాటలు పాడారు.

జానపద శైలిలో దేనికీ అనుకరణ కాకుండా స్వతంత్ర పంథాలో సాగిపోయే కొనకళ్ళవారి గీతాలు సాహితీలోకంలో చిరయశస్సును గడించు కొన్నాయి. నండూరి, కృష్ణశాస్త్రి తల్లావఝుల వంటి ప్రసిద్ధ కవుల ప్రశంసలనందుకొన్నాయి.

## అభేరి రాగం ఆధారంగా కొన్ని చిత్ర గీతాలు




| పాట | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. తెలవారదేమో స్వామీ | శృతిలయలు | జేసుదాస్ | కె.వి.మహదేవన్ |
| 2. ఓ నెల రాజా వెన్నెల రాజా నీ వన్నెలన్ని చిన్నెలన్ని | భట్టి విక్రమార్క | ఘంటసాల, పి.సుశీల | పెండ్యాల |
| 3. తలుపు తీయునంతలోనే తత్తరమది ఏలనోయి | ప్రైవేటు రికార్డు | రావు బాలసరస్వతిదేవి | బసవరాజు అప్పారావు |
| 4. స్వాతంత్ర్యమె మా జన్మ హక్కని చాటండీ | ప్రైవేటు రికార్డు | ఘంటసాల | ఘంటసాల |
| 5. నేలతో నీడ అన్నది | మంచిరోజులు వచ్చాయి | ఘంటసాల | టి.చలపతిరావు |
| 6. ఎందుదాగివున్నావో బృందావిహారి | పూజాఫలం | పి.సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 7. కన్నులతో చూసేది గురువా | జీన్స్ | నిత్యశ్రీ | ఎ.ఆర్.రహమాన్ |
| 8. నినుచూడక నేనుండలేను | నీరాజనం | బాలు, చిత్ర | ఓ.పి.నయ్యర్ |
| 9. రాకోయి అనుకోని అతిథి | శ్రీరాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్ | పి.సుశీల | పెండ్యాల |
| 10. తెలుసా మనసా ఇది ఏనాటి అనుబంధమో | క్రిమినల్ | బాలు, చిత్ర | ఎమ్.ఎమ్.కీరవాణి |
| 11. ఆహో ఒక మనసుకు నేడే పుట్టిన రోజు | అల్లరిప్రియుడు | బాలు, చిత్ర | ఎమ్.ఎమ్.కీరవాణి |
| 12. తెరచి వుంచేవుసుమా పొరబడి నీహృదయము | ధనవంతులు-గుణవంతులు | పి.సుశీల | పెండ్యాల |

సంగీతానికి సంబంధించిన సమితులు, సమాజాలు నిర్వహించేవారు ఈ కూపన్ నింపి మాకు పంపితే 'హాసం' వద్ద ఆడియో క్లబ్ డేటాబేస్ తయారవుతుంది. మాకందిన వివరాలు 'ఆడియోక్లబ్స్' శీర్షిక ద్వారా పాఠకులకు తెలుపుతాం. దీనివల్ల ఈ క్లబ్స్ పరస్పరం సహకరించుకునేందుకు, సమన్వయం సాధించేందుకు ఉపయోగపడుతుంది.

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్

సంస్థ పేరు :.................................................... స్థాపించినసంవత్సరం:....................

ఉద్దేశ్యము :.................................................... సభ్యుల సంఖ్య :....................

అడ్రసు :....................................................................................

.................................................... పిన్‌కోడ్ నెం:....................

కార్యాలయం ఫోన్ నెంబర్, ఈ మెయిల్ :....................................................

కార్యనిర్వాహక సభ్యులు 1. ☎

2. ☎

3. ☎

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : తేదీ:.........



# బాపు విశ్వరూపం 5

ఓ తెలుగమ్మాయి ఆశించే అత్యుత్తమ ప్రశంస 'బాపుబొమ్మలా ఉన్నావనిపించుకోవడం'! అంతమాత్రాన అమ్మాయిల అందాలకే తన చిత్రకళను బాపు పరిమితం చేశారనుకోవడం పొరబాటు. వయ్యారి భామల ఒంపుసొంపులే కాదు, కలకంఠి కన్నీళ్లు కూడా తెలుసు బాపు కుంచెకు. ఒక స్త్రీ కన్నీటి బిందువును సందర్భం బట్టి ఎన్నిరకాలుగా చిత్రీకరించారో చూడండి.







స్త్రీ కన్నీటికి కారణాలూ చూపించారు బాపు. ఈ సమాజంలో స్త్రీ ఎన్ని రకాలుగా ఎక్స్ప్లాయిట్ కాబడుతోందో అర్థవంతంగా చిత్రీకరించారాయన. కార్యసాధనకు స్త్రీ శరీరాన్ని అస్త్రంగా వేసేవాడొకడు (తూణీరం గమనించండి), తాళిపేరుతో ఉచ్చు వేసేవాడొకడు. ఇక పతితలైన స్త్రీలతో వ్యవస్థ (దానికి ప్రాతినిధ్యం వహించేది పోలీసు టోపీయే) ఏ విధంగా వ్యవహరిస్తుందో వేరే చెప్పనవసరం లేదుగా!







స్త్రీల కష్టాల గురించి, కడగళ్ల గురించి చెప్పి ఊరుకోలేదు. వాటిని నిబ్బరంతో ఎదుర్కోవలసినది స్త్రీలే అని చాటిచెప్పారు బాపు తన సినిమాల ద్వారా. ఆయన సినిమాలలో హీరోయిన్లు ధైర్యసాహసాలతో వ్యవహరిస్తారు. బాపు నాయిక 'సాక్షి'లో చావుభయంతో వణికేవాడికి ధైర్యం నూరి పోస్తుంది, 'ముత్యాలముగ్గు'లో కాపురం చక్కదిద్దుకోవడానికి సిఫార్సు వద్దంటుంది,



'గోరంతదీపం'లో దుర్మార్గుడైన భర్త స్నేహితుడిపై చింతబరికె ఝుళిపిస్తుంది, 'పెళ్లీడు పిల్లలు'లో స్వంతకాళ్లమీద నిలబడాలని చూస్తుంది, 'మిస్టర్‌పెళ్లాం'లో ఇంటా, రచ్చా గెలవగలనని నిరూపిస్తుంది.

సినీకాళీయున్నైనా మర్దించగల 'స్త్రీ కృష్ణుడి' అవతారం నేటి యుగానికి అవసరమని బాపు 'గీతా బోధన' కాబోలు!

### జరిగిన కథ

అజయ్ అనే శ్రీమంతుడు, విజయ్ అనే పేదవాడు ఒక ఏడాదిపాటు తమ తమ స్థానాలను మార్చుకోవాలని నిశ్చయించుకుంటారు. అజయ్ స్థానంలో వచ్చిన విజయ్ మేనేజర్ భానోజి మోసం చేస్తున్నాడని గమనించి అతని కూతురు సరళతో ప్రేమ నటిస్తుంటాడు. విజయ్ స్థానంలో వచ్చిన అజయ్ చెల్లెలు మీనా కాపురం సరిదిద్దే ప్రయత్నంలో బావ బుజ్జిని బెదిరిస్తాడు. బుజ్జి భార్యను కలవడానికి చాటుగా వస్తూంటాడు. మోటారు మెకానిక్‌గా పని చేస్తున్న అజయ్‌కు తన కొలీగ్ ప్రకాష్ చెల్లెలు పద్మతో పరిచయం అవుతుంది.

(ఇక చదవండి)

# అన్నపూర్ణా వారి ఇద్దరు మిత్రులు

## సీరియల్ - నవల 10

**రచన : ముళ్లపూడి వెంకటరమణ**

ఇంట్లో ఎవరూ లేరు. బుజ్జి మనసు తువ్వాయిలా చెంగు చెంగున గెంతులు వేసింది. ఆనందం పట్టపగ్గాలు లేకుండాపోయి పాటగా విజృంభించింది.

'చక్కనిచుక్కా సరసకురావే...' అన్నాడు సరాగంగా.

మీనా చూట్టానికి నెమ్మదస్తురాల్లాగే ఉంటుంది. కాని ఏమంత ముద్దరాలు గాదు.

'టక్కరిబావా కిక్కురుమనకు' అంది చలాకీగా.

**చక్కనిచుక్కా సరసకురావే**
**ఒక్కసారి నవ్వినచాలే**
**ఉక్కిరి బిక్కిరి అయిపోతానే**
**టక్కరిబావా కిక్కురుమనకు**
**ఇక్కడి మాటలు ఇతరులు వింటే-**
**ఉక్కిరి బిక్కిరి అయిపోతావే**
**అల్లరిపిల్లా ఆపవేలా**
**పుల్లవిరుపు మాటలు**
**పెళ్ళాం కనబడితే ప్రేమే కలిగిందా**
**పెళ్ళామంటే బెల్లము**
**తల్లీదండ్రీ అల్లము**
**ముద్దులగుమ్మ మోహమాయె**
**పొద్దు చాలా పోయెనే**
**పెద్దలు గద్దిస్తే పెడసరమౌతావా**
**పెద్దల గొడవ ఎందుకే**
**ఇద్దర మొకటై వుందామే**
**నాయనగారి మీసము**
**చూస్తేనే సన్యాసము**
**అబ్బ! అబ్బబ్బ, నీ మాటలు కొరడా దెబ్బలు**
**సూటిగా పెళ్ళాడి చాటుగ రానేలా**
**చేయకు నన్నుదూరము**
**తీయకు మీనా ప్రాణము**
**తీయకు మీనా ప్రాణము**

రాత్రి బాగా పొద్దుపోయాక ఇంటికి బయల్దేరాడు బుజ్జి. కదిలిపోవడానికి మనసొప్పకపోయినా తప్పదు. ఏ రాత్రివేళో చల్లగావచ్చి, తండ్రి కంటబడకుండా తన గదిలోకిపోయి పడుకోవలసిందనీ, అందుకోసం తాను వీధితలుపు ఓరగా వేసివుంచుతాననీ తెలియ జెప్పింది తల్లి. మళ్లీ మర్నాడు సాయంత్రం, భార్యని చూడగలగాలంటే, ఆపూట ఇంటికి వెళ్ళక తప్పదు. ఈ ఏర్పాట్లగురించి దాసుగారింట భారీచర్చలు జరగలేదు అల్లుడింటి కొచ్చినందుకు రామదాసుగారు ఓమారు బ్రహ్మానందపడిపోయి లేచి, తన రామనామసంకీర్తనలో, తన భజనల్లో పడిపోయారు. ఆయన మళ్లీ ఇవతలికిరారు. వస్తే సమస్యలు కనిపిస్తాయని బెదురు. అజయ్‌కి, ఇది ఎబ్బెట్టన్న విషయం తట్టలేదు...

ఇంటిదగ్గర పరంధామయ్యగారు ఊరేగివచ్చి ఆరగింపుకానిచ్చి శయ్యనలంకరించినా, కులదీపకుడి గురించి అడగలేదు. ఆ వేళకే నిద్రపోతూ వుంటాడని ఆయన ధీమా. ఓ రాత్రివేళ, ఒత్తిగిలేసరికి పక్కలో మెత్తగా, వెచ్చగా తగుల్తూ ఇంకో శాల్తీ కనబడింది.

'ఛీ వెధవ కుక్కా, వెధవ కుక్కాని' అంటూ ఒక్కటేశారు. 'దీని బుద్ధి ఎక్కడికి పోతుంది. ఓహోయ్ ఇంటి ఇల్లాలా ఎక్కడ తగలడ్డావ్?'

'అబ్బబ్బ ఏవిటండీ.

అర్థరాత్రివేళ ఈ కుక్కజట్టీ' అంటూ లేచి వచ్చిందావిడ.



'అదే నేనూ అడిగేది. దాన్నిఒకచోట కట్టేసి తగలెయ్యకూడదూ? వచ్చి నా మంచం మీదే పడు కుంది.'

'పక్కన కూర్చో పెట్టు కుని పాలూ, పరవాణ్ణం పెడు తూండండి. పక్కలో ఏమిటి, రేపు నెత్తి మీదికే ఎక్కి కూచుంటుంది.'

'నువ్వూ తింటున్నావ్ పాలూ పరవాణ్ణం. అలాని నిన్ను నెత్తి కెక్కించుకుంటున్నానా ? ఎవరి హద్దుల్లో వాళ్ళుండి ఏడవాల్సిందే. అదీ నా పద్ధతి.'

'ఊ, సర్లెండి, ఇహ పడుకోండి' అంటూ సరిహద్దులు అనే విషయంపై ఆయన పాలసీ ఉపన్యాసాన్ని తుంచి పోబోయిందావిడ.

పరంధామయ్యగారు తిరిగి పవళింపుకు ఉపక్రమించబోతూ 'ఓ హేయ్ నిన్నే' అని మరో సరికొత్త గావు కేక వేశారు.

'మళ్ళీ ఏం వచ్చిదండీ ?'

'నీ కేమైనా బుద్ధి ఉందీ?'



'ఉంది' అందావిడ టూకీగా.

'ఉంటే - ఆ గడియ అలా తీసిపడుకుంటావ్? దొంగ చాటుగా ఎవడైనా ఇంట్లో దూరి ఉన్నది కాస్తా దోచుకుపోతే - '

'ఎందుకండీ అంత భయం మీరూ, కుక్కా-'

'నోర్మోయ్! నన్ను కుక్కంటావా?' అని గర్జించాడాయన.

'అబ్బే! కుక్కా, మీరు యిద్దరూ కాపలావుండగా-'

'అవును. నేను ఇల్లు కాపలా కాస్తుంటాను నువ్వూ, నీ సుపుత్రుడూ హాయిగా నిద్రపోదురుగాని. ఏడీ? ఏడీ నీ సుపుత్రుడు?'

'ఊ హు హు హు...' అని వణుకు నటిస్తూ దుర్గమ్మగారు సుపుత్రుడు గది కిటికీ దగ్గరికెళ్ళి నిలబడి, గురకపెట్టి - ప్రకాశంగా- 'అదిగో, ఆ గదిలో గురక పెట్టి నిద్రపోతుంటేనే-' అంది.

'మీకేం చీకా, చింతా, దీపాలు వెలిగించకముందే పడుకుంటారు. ఝాము పొద్దెక్కాక లేస్తారు. కష్టపడి నేను సంపాయిస్తుంటే హాయిగా మీరు అనుభవిస్తున్నారు. ఆఖరికి తలుపు ఘడియలు కూడా నేనే చూచుకోవలసి వచ్చింది' అంటూ లేచి వీధితలుపు గడియపెట్టేశాడు ఇంటియజమాని.



ఇల్లాలికి నిలువునా వణుకొచ్చింది. పిల్లడొస్తే యెలాగరా దేవుడా అని.

'పో, పోయి పడుకో. మళ్ళీ పొద్దునే గుండెదడ, ఆయాసం అని నా ప్రాణం తీస్తావు.'

విధిలేక గడియవేపు దీనంగా చూసి లోపలికెళ్ళింది ఇల్లాలు.

మరో ఘడియకల్లా, భుజంగరావు బహద్దర్, అత్తవారింటినించి ఆఘ మేఘాలమీద వచ్చేశాడు. చడీచప్పుడూ లేకుండా గుమ్మంఎక్కి తలుపు నెట్టాడు.

'కృష్ణా రామా పరంధామా' అంది చావడి కిటికి.

బుజ్జి ఉలికిపడి, ఆరుగెక్కి కిటికీలోంచి తొంగి చూశాడు.

పులి అక్కడే వుంది. ఇంకా గురకైనా మొదలెట్టలేదు. ఇక లాభంలేదని, బుజ్జి ఆ ఆరుగుమీదనే నడ్డివాల్చాడు.



దేహం ఇక్కడున్నా, ఆ యొక్క హృదయం, మనసు గట్రా అక్కడ అత్తారింట్లో వున్నాయి. వాటినిబట్టే దేహం కలవరించింది. 'మీనా' అంది. ఎవరూ ఒన్స్‌మోర్ అనక పోయినా మళ్ళీ ఆ మాటే అంది. మళ్ళీ అంది. అక్కడ మీనా మేల్కొందో లేదో తెలీదుగాని, కిటికీ పక్కన పరంధామయ్య గారు లేచారు. లేచి కర్ర, బ్యాటరీలైటు పట్టుకుని వీధరుగుమీదికి వచ్చారు.





'నువ్వెంత మంచి దానవే మీనా. మా నాన్నకే బుద్ధి లేదు' అంది బుజ్జి నిద్రిత దేహం.

బుద్ధిలేని నాన్న చేతికర్ర బుజ్జిని ఒక్కటి వేసింది.

'అమ్మోయ్!' అని గావు కేకేశాడు బుజ్జి. అతనికి బాల్యం నుంచీ కూడా ఆవదలో 'బాబోయ్' అన్న కేకకన్న 'అమ్మోయ్' అన్నదే ఎంచేతో బాగా అలవాటయిపోయింది.



'పెళ్ళాన్ని ఏలుకోలేని వాజమ్మ, పెళ్ళాన్ని తలుచుకుని కలవ రిస్తున్నావా. చెప్పు, చెప్పు ఎక్కడ తగలడ్డావ్? నోటంట మాట పెగల్దేం? చెప్పు' అన్నారు పరంధామయ్యగారు కర్ర పైకెత్తి.



సూరమ్మగారు గుమ్మం దాకా పరుగెత్తి అక్కడినించి మటుకు నెమ్మదిగా వచ్చి 'స్నేహితులెవరో పిలిచారని సినిమా కెళ్ళాడండి పాపం' అంది.

'సినిమాకా? వీడి బతుక్కి సినిమాకూడానా? నా కష్టార్జితమంతా ఇలా నాటకాలకీ, సినిమాలకీ తగలబెడతావురా? రా ఇంట్లోకి. నీ పని చెబుతా' అన్నాడు తండ్రి.



'ఆఁ... ఆఁ... వాణ్ణి బతకనివ్వరా యేఁవిటి. ఒక్కగానొక్కడు. వరప్రసాది' అంది తల్లి బెంబేలెత్తిపోయి.



'నోర్మూయ్' అని భార్యనీ, 'రా' అని కొడుకునీ ఆజ్ఞాపించి, వాడి చొక్కా పట్టుకు లోపలికి గుంజబోయి ఆగాడు. ముందుకు వంగి చొక్కా మళ్ళీ వాసన చూశాడు, సెంటే.

'ఏరా చెప్పు ఏ కొంపలంట తిరుగుతున్నావ్? చెప్పు' ఆశ్వరథ అనడం తక్కువగా ఉగ్రుడై పోయాడు.



'ఉహు హు హు...' అని తగినంత ధ్వనిచేసి నేలకొరిగి పోయింది సూరమ్మగారు.

వరంధామయ్యగారు కంగారుగా వెనక్కి తిరిగారు. 'వచ్చిందీ ఫిట్టు! ఒరేయ్ బుజ్జిగా, మీ అమ్మని కాస్త పట్టుకో సాల్టు సీసా తెస్తాను' అంటూ లోపలికి పరుగెత్తాడు.



సూరమ్మగారు మెల్లిగా కళ్ళుతెరిచి, బుజ్జినిచూసి నవ్వి వీపుతట్టింది.

* * *



పండగకాని పండగ, పుట్టినరోజు పండగ అంటారు కొందరు. కొందరికసలది పండగ కాదు. కొందరికి పండగే కాదు; జీవన చతురంగంలో ఒక పావు. బృహత్కార్య సాధనలో ఒక ముహూర్తం. చర్చలకు, ఒడంబడికలకు వేదిక. వాగ్దాన గ్రహణాలకు అవకాశం.



సరళమ్మకి పుట్టిన రోజంటే పుట్టినరోజు పండగే. చక్కగా ముస్తాబై, ఒంటి నిండా నగలు పెట్టుకొని బహుమతులందుకుందికి రెడీ అన్నట్టు నవ్వింది. నేస్తాలకి పార్టీ ఏర్పాటు చేసింది. భానోజీరావుగారికి అది కేవలం పండగకాదు. అజయ్‌బాబు మనసును సరళవేపు పూర్తిగా మొగ్గదీసి, పెళ్ళి ఖరారు అని తేల్చుకుంది కొక మహదవకాశం. కుమార్తె వెంట ఆయనా వచ్చాడు భవంతికి. గుమ్మంలోకి వచ్చాక, హితవు చెప్పాడు.



"చూడమ్మా సరళా, ముందు పెద్దమ్మగారి దగ్గరకు వెళ్ళి ప్రణామం చేసిరా, దేనికైనా ఆవిడని ప్రసన్నురాలిని చేసుకోవడం అవసరం. తరువాత అజయ్‌బాబుని కలుసుకోవచ్చు" అన్నాడు తమాషాగా నవ్వి.



"అలాగే నాన్నా-" అంటూ లోపలికి వెళ్ళింది సరళ. పెద్దవాళ్ళకి ముందు నమస్కరించాలన్న చిన్న విషయం కూడా నాన్న చెప్పాలా అనిపించి, నవ్వుకుంది సరళ. పిన్నిగారు హాలులోనే ఉన్నారు.

"నమస్కారం పిన్నిగారూ-"



"నువ్వా సరళా. రామ్మరా కూర్చో-"

వెనకాల బల్ల తుడుస్తున్న వెంకన్న యథాలాపంగా సరళకేసి చూసి, తన పని చూసుకోబోయి, గతుక్కుమని మళ్ళీ చూశాడు. పరీక్షగా చూశాడు. సరళ వెనకగానే, గోడమీద, అమ్మగారి పెయింటింగ్ ఉంది. ఆ చిత్రాన్ని చూశాడు. తిరిగి సరళని చూశాడు.



"ఇవాళ నా పుట్టినరోజు, మీ ఆశీర్వాదం కోసం వచ్చాను'' అంటూ వంగి, పిన్నిగారికి వందనం చేసింది సరళ.

వెంకన్న కొంచెం ముందుకువచ్చి ఆమె మెడ వంక పరీక్షగా చూశాడు మళ్ళీ చిత్రపటం చూశాడు.



"పసుపు కుంకుమలతో నూరేళ్ళు వర్ధిల్లు తల్లీ" అంది పిన్నిగారు. కళ్యాణమస్తు అంటే ఎవరెలాటి అర్థాలు

తీస్తారోనన్న ఊహతోనే ఆవిడ గడుసుగా అలా దీవించిందని అర్థం తీసేవాడే - భానోజీగారు ఆ క్షణాన అక్కడవుంటే.

వెంకన్న సరళకేసి మళ్ళీచూసి, బయటికి పరు గెత్తాడు. వసారాలో విజయ్ కనపడగానే ఎదురు పరుగెత్తి కంగారుగా, చాలా ఆందోళన వ్యక్త పరుస్తూ సంజ్ఞలు చెయ్యసాగాడు.



"ఏవిటీ? ఏమంటాడు?" అన్నాడు విజయ్.

వెంకన్న కంగారుచూసి అటువచ్చిన లచ్చి అర్థం చెప్పింది. "ఇదో ఇయ్యాల సిన్నమ్మగారు మెళ్ళ యాదో గొల్సు పెట్టుకొచ్చిరంట గద... అదచ్చంగా మన పెద్దొరసాని గొల్సు తీరుగనే ఉందంట."

"ఆ? అలాగా!" అన్నాడు విజయ్. ఇది కొత్త విషయం. సరళ గురించి ఏమనుకోవాలో తెలియ లేదు. అయ్యకి పుట్టిన కూతురా? మొన్న అయ్యగారి గదిలో ఇనప్పెట్టె ఖాళీ అవడానికి కారణం ఇక్కడే తెలుస్తుందా?...



నెమ్మదిగా హాలులోకి ప్రవేశించి ముందు 'అమ్మగారి' చిత్ర పటం దగ్గర ఆగి, మెళ్ళో నెక్లెసు చిత్రాన్ని పరిశీలనగా చూసి, సరళ సోఫా దగ్గరకు వెళ్ళాడు విజయ్. సరళ దిగ్గున లేచి నిలబడింది.

"నేనొస్తే లేవడం ఎందుకు సరళా?"

"అజయ్! ఇవాళ సరళపుట్టిన రోజు తెలుసా?" అంది అత్తయ్య.



"అవునా సరళా, అయితే, ఎన్నో యేడు వెళ్ళి ఎన్నో యేడు వస్తుంది?" ...అంటూనే నవ్వాడు. "వద్దులే ఊరికనే అడిగాను. మొగాడి జీతం, ఆడదాని వయసు అడిగేవాళ్ళను అమెరికాలో వెలేస్తారు" అన్నాడు.

"వయసు దాచుకునే అవసరం ఇంకా నాకు రాలేదులెండి" అంది సరళ నవ్వుతూ.

అంతేగాని, మొత్తానికి వయస్సు మాత్రం చెప్పలేదు. విజయ్ ఆమెనూ, స్త్రీ జాతినీ మనసు లోనే మెచ్చుకుని, "అందుకేనన్న మాట మిలమిలా, ధగధగా మెరిసిపోతున్నావు మెరుగు పెట్టిన బంగారంలా" అన్నాడు చనువుగా నవ్వుతూ.

అంతవరకూ ప్రసన్నంగా ఉన్న అత్తయ్య ముఖంపై చిరునవ్వు మాయమవడం విజయ్ గమనించలేదు.

"ఊ అంత అందంగా కనిపిస్తున్నానా మీ కళ్ళకి? లేక వేళాకోళం చేస్తున్నారా?" అంది సరళ, కొంత కొంటెగా, కొంత ఆశగా.

విజయ్ పకపక నవ్వి, సోఫాలోంచి లేచి, సరళ దగ్గరగా వెళ్ళాడు. ఒక క్షణంసేపు ఆమెనూ, ఆమె కంఠ సీమనూ పరిశీలనగా చూశాడు.

"వేళాకోళమా! నిజంగానే, ఆ వెలుగు జలతార్ బుటేదార్ బనారస్ చీరె,

> ఇద్దరు మిత్రులు చిత్రానికి డాక్టర్ కొర్రపాటి గంగాధరరావు గార్ని రచయితగా తీసుకున్నారు. అది వారికి తొలిచిత్రం. వారు బాపట్ల నుంచి మదరాస్ రావాలి. వారు వచ్చే రైలు - ఆలస్యంగా వస్తుందని రైల్వే అధికారులు చెప్పగా - ఆ సమయానికి నిర్మాత మధుసూదనరావుగారు స్టేషన్‌కి వెళ్ళారు. అప్పటికే రైలు వచ్చేసింది. ప్యాసింజర్లంతా వెళ్ళిపోయారు. రైలుబోగీలు అన్నీ ఖాళీగా వున్నాయి. శ్రీ గంగాధరరావుగారు ఎక్కడికి వెళ్ళారో తెలియదు. రైలు ముందుగా వచ్చినందుకు స్టేషన్ మాస్టర్‌పై మండిపడ్డారు. స్టేషన్ మాస్టర్ చాలా మెల్లగా - "ఆలస్యం తగ్గవచ్చు" అని నేను ప్రకటించాను కదా! అని ఆయన దారిన ఆయన లోపలకు వెళ్ళిపోయారు.

ఆ శాటిన్ చోళీ, ఆ హెయిర్ స్టయిల్, ఆ ఆభరణాలు-ముఖ్యంగా కౌస్తుభంలాంటి ఆ రవ్వల నెక్లెసు... ...ఆహా సాక్షాత్తు దిగివచ్చిన దేవకన్యలా వున్నావు..." అన్నాడు మాటమాటా వత్తి వత్తి పలుకుతూ.

సరళ సిగ్గుపడింది. అందంగా సిగ్గుపడింది.

"థాంక్స్. ఎన్నడూ లేనిదివాళ ఎందుకో అతిగా పొగిడేస్తున్నారు" అంది తల వంచుకునని.

అత్తయ్య బొమముడివడి, విడింది. "సరళా. వెళ్ళి నీ స్నేహితులందరినీ పిలవాలిగా" అందావిడ మృదువుగా.

"పిలవాలండీ!"

"అజయ్‌కేం ఎంతసేపైనా బాతాకానీ వేసుకూర్చుంటాడు. నువ్వెళ్ళమ్మా"

"అజయ్‌బాబూ, సాయంత్రం నా బర్త్‌డే పార్టీకి మీరు తప్పకుండా రావాలి" అంది సరళ లేస్తూ.

"నువ్వు పిలవటం నేను రాక పోవటమూనా? నువ్విక్కడికి రా ఇద్దరం కలిసే వెళ్దాం" అన్నాడు విజయ్.

సరళ అతనికేసి ఆశ్చర్యంగా చూసి "అంత కన్నానా" అంది. "వెళ్ళొస్తాను పిన్నిగారూ" అంటూ సెలవు తీసుకుంది.

"అజయ్!"



విజయ్ నవ్వాడు. అత్తయ్య అనబోయే దేమిటో అతనికి తెలుసు. సరళను వెళ్ళి రమ్మన్నప్పుడే పసిగట్టాడు.

"ఏమత్తయ్యా!" అన్నాడు నెమ్మదిగా.

"నీ ప్రవర్తన ఏమీ బాగులేదు."

"ఏమిటత్తయ్యా! సరళతో అంత చనువుగా మాట్లాడి నందుకేగా?"



"కాకపోతే, ఆ పొగడ్త లేమిటి? అలా మనిషిని చూసి మైమరచి పోవడ మేమిటి? ఇదేనా నువ్విచ్చిన వాగ్దానం? ఇంత వ్యామోహంలో పడి పోతావా?"

"వ్యామోహం కాద త్తయ్యా!...ఇవాళ సరళ ఒక నెక్లెస్ పెట్టుకొచ్చింది. వెంకన్న ద్వారా అది, అజయ్ బాబు తల్లిగారి జవహరీలోదేనని తెలుసు కున్నాను. సరళతో కొంచెం సన్నిహితంగా వున్నట్టు నటిస్తే, యెన్నో కొత్త సంగతులు బయట పడవచ్చు."

అత్తయ్య కొంచెం స్థిమిత పడింది.

(ఇంకావుంది)

# పద్మనాభం ఆత్మకథ

## సీరియల్ 9



అ తరువాత తీసిన హాస్యచిత్రాలు - 'జాతకరత్న మిడతంభొట్లు', కన్నడంలో 'గుండా జోయిస'. తెలుగులో ఎస్.వి.రంగారావు, కన్నడలో శ్రీ నాగయ్య గారు కోయదొరలుగా నటించారు.



. "ఆజన్మ బ్రహ్మచారి" వెయ్యినవ్వుల హాస్య చిత్రం. రచన - పాలగుమ్మి పద్మరాజుగారు. (గుహనాదన్ తమిళ్ డ్రామా 'కాశీయాత్రా' ఆధారంగా) సంగీతం - ఆస్థాన సంగీత దర్శకుడు యన్.పి.కోదండపాణి. ఆజన్మ బ్రహ్మచారిగా నాగభూషణం వేశారు. రామకృష్ణ, గీతాంజలి ఓ జంట. నాకు జంటగా లీలారాణి.

> బాలకృష్ణగారితో పరిచయం సి.ఎస్.ఆర్.గారి 'భక్తతుకారం' నాటకంలో. ఆయన తుకారాం మొదటి భార్యగా ఆక్టుచేసేవారు. 1945 నుంచి 2 ఏళ్ళు పాటు వేసిన ఆ నాటకంలో నేను మహాదేవుని వేషం వేశాను. తరువాత షావుకారు, పాతాళభైరవి, కార్తవరాయుని కథయింకా ఎన్నోసినిమాలలో కలిసినటించాము. నాటకాలకు వెళ్లినప్పుడు గుంటూరులో నాకు మలేరియా జ్వరం వచ్చింది. నన్ను ఏలూరుకు తీసుకెళ్లి 10 రోజులు వుంచుకొని చేయించాడు. తరువాత ఇద్దరం మద్రాసు చేరాం. ఆయన నాకు ఫ్యామిలి ఫ్రెండ్. అన్ని కష్టసుఖాలు నాతో చెప్పేవాడు. నేను తీసిన అన్ని సినిమాలలో బాలకృష్ణ వున్నాడు. 'పెళ్లికాని తండ్రి' లో రమాప్రభ నాన్నగా చేశాడు. ఆయనకు 7గురు ఆడపిల్లలు. మొదటి అమ్మాయి పద్మకు పెళ్ళి చేయగలిగాడు. తరువాత వేషాలు తగ్గాయి. బెంగతో ఆయన మనకు లేకుండా వెళ్లిపోయాడు. పాతాళభైరవి అంజి అంటే ఇప్పటికీ ప్రేక్షకులు మర్చిపోలేరు.

తర్వాతి సినిమా 'మాంగల్యభాగ్యం'లో శ్రీమతి భానుమతి గారిది ప్రధానపాత్ర. చిన్నప్పుడు 'కృష్ణప్రేమ'లో ఆమె పాటను అనుకరించేవాణ్ణి. నా దర్శకత్వంలో ఆ మహానటి పనిచేయడం ఎంత అదృష్టం! నాకు జోడి రమాప్రభ. ఇద్దరివీ డబుల్ రోల్స్. అప్పటికి కోదండపాణి చనిపోయారు. ఆయన అసిస్టెంటు ముత్తు సంగీతాన్ని సమకూర్చారు.

తుఫాను బాధితుల సహాయార్థం నలభై మంది తారాగణంతో కార్యక్రమాలు, నాటకాలు, యస్.పి.బాలసుబ్రమణ్యం సంగీత విభావరి, వినోద కార్యక్రమాలు చేశాం. ఆ కార్యక్రమాలన్నీ బి.యస్.రంగా గారి విక్రం స్టూడియోలో 'సినిమా వైభవం' సినిమాగా చిత్రీకరించాం. కృష్ణ, విజయనిర్మల, ప్రభాకర్‌రెడ్డి, జమున, చలం, శారద, రాజబాబు, దర్శకులు సి.యస్.రావు, పి.సి.రెడ్డి, విశ్వనాథ్, రాజబాబు, అందరం వేశాం. చిత్రనిర్మాణం ఒక నెలలో పూర్తయింది. నటులకు, సాంకేతిక వర్గానికి అందరికీ బట్టలు బహూకరించాం.

నా 8వ యేట పిల్లలతో మావూరి బావిలో మునగవేళ్లు నడుముకు కట్టుకుని ఈత నేర్చుకుంటున్నాను. హఠాత్తుగా మునగవేళ్లు తెగిపోయాయి . నీటిలో మునుగుతూ కేకలు వేశాను. ఇంతలో నా స్నేహితుడు ప్రభాకరరెడ్డి బావిలో దూకి రక్షించాడు!

నేను, మిక్కిలినేని రాధాకృష్ణ గారు ఒంగోలు సమీపంలో ఒక మీటింగు హాజరయి తిరిగి మద్రాసు వస్తున్నాము. నెల్లూరు సమీపంలో మేము ప్రయాణిస్తున్న రైలు ఇంజన్ పెద్ద చక్రం విరిగిపోయింది. అదృష్టవశాన బ్రతికాం!



"ఎదురీత" సినిమా యానాంలో షూటింగ్ ముగించుకుని కాకినాడ నుంచి కారులో నేను మేకప్ కృష్ణ గుడివాడకు వస్తున్నాము. తూర్పువైపుకు ప్రయాణం చేసే కారు వున్నట్లుండి పడమరకు తిరిగిపోయింది. ఏ మాత్రమున్నా కారు పెద్ద గుంతలో పడిపోయి వుండేది.

ఎన్నో సినిమాల షూటింగ్‌లు జరిగాయి కానీ "ఆషాడం పెళ్ళికొడుకు " షూటింగు ఒక భయంకరమైన అనుభవాన్ని మిగిల్చింది. రాజమండ్రి దగ్గర కొవ్వూరులో నేను, కొంతమంది డ్యాన్సర్స్ రైలు బ్రిడ్జ్‌పైన డ్యాన్స్ చేస్తున్నాము. సడన్‌గా కాలుజారి ఒరిగిపోయాను. చేతులతో గట్టిగా గట్టును పట్టుకున్నాను. నేను పడిపోకుండా పాపం ఒక అమ్మాయి నా భుజాలు పట్టుకుంది. కిందనుంచి డైరెక్టర్ శ్రీనివాస్, అందరూ కేకలు పెట్టారు. ఈలోగా కొంత మంది డ్యాన్సర్స్ నన్ను పైకి లాగారు. దాదాపు 50 అడుగుల ఎత్తునుంచి పడిపోయి వుంటే అన్ని ఎముకలు మునక్కాడల్లాగ విరిగివుండేవి. పుత్తూరు పోనక్కర్లేదు. పద్మనాభం

ఈ లోకంలో వుండేవాడు కాదు! కుడిచేతిలో శ్రీ వెంకటేశ్వరుని ఉంగరం, ఎడమచేతిలో నవగ్రహ ఉంగరం నన్ను కాపాడాయి.

అప్పుడనుకున్నాను - నాకు ఇంకా ఈ భూమి మీద నాకు నూకలున్నాయి! చేయవలసిన సత్కార్యాలు వుండబట్టే బ్రతికిబట్టకట్టాను అని.

ఇవన్నీ ఎందుకు చెప్పుకొచ్చానంటే, ఈ ఏక్సిడెంట్లన్నిటిని మించిన యాక్సిడెంటు నాకు "సినిమా వైభవం" సినిమాతో కలిగింది. అది ఆర్థికపరమైనది.

1975లో సినిమా వైభవం గురించి దశరథరామయ్య అనే ఫైనాన్సర్ దగ్గర 60 వేలు అప్పు చేయవలసివచ్చింది. అప్పుకు హామీగా 'దేవత, పొట్టి ప్లీడరు, శ్రీశ్రీశ్రీ మర్యాదరామన్న, శ్రీరామకథ' సినిమాల నెగటివ్‌లను తాకట్టుపెట్టాం. ఆరు నెలల్లో అప్పు తీర్చకపోతే ఆయన ఓనర్ అవుతాడు. ఇదీ ఒప్పందం.

"ఇది ఇర్రివోకబుల్ అగ్రిమెంటు. నా అప్పు తీరితే మీ నెగటివ్‌లు మీకు తిరిగి ఇస్తాను." అని అన్నాడు. ఇది జరిగింది 1975 ఏప్రిల్ 14న. నమ్మకంతో ఎగ్రిమెంట్ చేశాం.

తర్వాత గడువు దాటిపోయింది. మా సినిమాల హక్కులు నైజాం 40 వేలు, రాయలసీమ 80 వేలు, ఆంధ్రా 1,75,000 లకు అమ్మేశాడు. 2.75 లక్షలు వసూలు చేశాడు. మా 60వేల అప్పు ఎప్పుడోతీరిపోయింది. మాకు డబ్బు ఇవ్వలేదు సరికదా, నెగటివ్‌లు కూడా వాపసు ఇవ్వలేదు. కోర్టు కెక్కాం. ఇక లాయర్లు... హైకోర్టు.... మా కష్టార్జితాన్ని, జీవితాన్ని దోచుకొని నమ్మక ద్రోహం చేసి. మమ్మల్ని సర్వనాశనం చేశాడు ఆ దశరథరామయ్య.

75 నుంచి 83 వరకు కోర్టు చుట్టూ తిరిగినా మాకు లాభం లేకపోయింది. నా ఆర్జనతో సంపాందించి తీసిన చిత్రాలు చేజారిపోయాయి. ఆర్థికపరమైనఇబ్బందులు ఎదుర్కోవలసివచ్చింది. ఇలా నమ్మి మోసపోయి దైన్యస్థితిలో పడిపోయిన వారు ఎంతోమంది సినిమా ప్రపంచంలో ఉన్నారు. అందులో నాగయ్యగారిని చెప్పుకోవాలి. ఆయన తన సర్వస్వం వెచ్చించి 'రామదాసు' చిత్రాన్ని తీశారు. సినిమా రిలీజ్ అయింది. ఒక్క నయా పైసా కూడా నాగయ్య గారికి రాలేదు. యిల్లు కూడా లేకుండా చేసుకున్నారు. ఎంతో ఐశ్వర్యాన్ని గడించి, ఒక మహానుభావుడు చేసిన ద్రోహానికి బలయిపోయిన ఆయన్ని, చనిపోయిన తర్వాత చందాలు వేసుకుని తీసుకెళ్ళారు. అంతటి మహానుభావుడు ప్రేమ, మంచితనం పంచిన వ్యక్తి నాగయ్యగారికే మోసం జరిగింది. ఇక నేనెంత?

ఈ మధ్యలోనే 1976 లో మా నాన్న శేషయ్యగారు మమ్మల్ని విడిచి పరలోకాలకు వెళ్లిపోయారు. కొడుకు వైభవం మాత్రం చూశారు గానీ కష్టకాలం చూడలేదు. అదృష్టవంతుడు! ఆయన ఇక రెండునెలలకు పోతారనగా 'నాయనా



నీవు తల్లిదండ్రుల ఋణం తీర్చుకున్నావు - పూర్వజన్మలో నీవు ఎవరో తెలుసుకోవాలని ఉంది. ప్రాప్తముంటే శ్రీశైలం చూడాలని ఉంది." అన్నారు. కొడుకుగా నా బాధ్యత నిర్వహించి ప్రేమను ఎంతో పంచాను. నాకు జన్మనిచ్చిన తండ్రి ఆ సర్టిఫికెటు ఇవ్వడం నా అదృష్టం!

కోర్టుల చుట్టూ తిరుగుతూండగానే వేషాలు కూడా తగ్గాయి. 'దేశోద్ధారకులు' లో నేను నటించిన వేషం నిజ జీవితంలో కూడా చవిచూడాల్సివచ్చింది. ఏం చేయాలో పాలుపోలేదు. దైవాన్ని ఆశ్రయించాం. "తిరుపతి స్వామి దర్శనం ఎప్పుడూ చేస్తూనే ఉంటాము. మన ఇలవేలువు అయిన కాశీవిశ్వేశ్వరుణ్ని చూడాలనివుంది' అనుకొని 1983లో నేనూ, నా భార్య సరోజమ్మా కాశీ వెళ్ళాం. అట్నుంచే అలహాబాద్‌లో త్రివేణి సంగమం, గయ దర్శించి మద్రాసు చేరాం.

దరిమిలా, దశరథరామయ్య చనిపోయాడని తెలిసింది. నేను బాధపడ్డాను. అమాయకులను ఏడిపించి, తనవెంట ఏమి తీసుకెళ్లాడు? దశరథరామయ్య కుటుంబం కూడా జరిగిన దానికి బాధపడ్డారు. కోర్టు వెలుపల కాంప్రమైజ్ కావడానికి ఒప్పుకున్నారు. మేం లక్షరూపాయలు ఇస్తే 1992లో మా నెగటివ్‌లు మాకు వచ్చాయి.

వీటన్నిటివల్లా మానసిక క్షోభ కలిగింది. భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పాడు -'ధైర్యం, ప్రేమ, భక్తి, జ్ఞాన వైరాగ్యములు కలిగియుండుము అర్జునా!' అని. సినిమాలు తగ్గాయి కాని ఆర్జించిన పేరు ప్రఖ్యాతులు ఎవరూ దొంగిలించ లేక పోయారు.

(ఇంకా ఉంది)

(ఫోటో కర్టసీ- సంజయ్ కిషోర్)

'దేశోద్ధారకులు' సినిమా నాటికే నాకు సినిమాల్లో వేషాలు తగ్గాయి. ముఖానికి మేకప్ లేకుండా ఎనిమిది ఏళ్ళు గడిచాయి. విశ్వశాంతి ప్రొప్రయిటర్ శ్రీ విశ్వేశ్వరరావుగారు నాకు ఫోన్‌చేసి 'దేశోద్ధారకులు'లో నా వేషం గురించి 5 నిమిషాలు చెప్పారు. ఓ రిక్షావాడు పాత్ర, గర్భవతి అయిన అతని భార్య పురుగులు చేరిన విషాన్నం తిని చనిపోవడం ఎంతో హృదయవిదారకంగా వివరించారు. నేను వారితో ఒకే మాట అన్నాను - 'ఈ వేషం ఎంతో కరుణరస ప్రధానమైనది. నాకు రావడం నిజంగా అదృష్టం! నేను జూనియర్ శివాజీ గణేశన్‌లాగా చేస్తాను' అని. 'ఆకలయ్యి అన్నమడిగితే పిచ్చోడన్నారు నాయాళ్లు' పాట వ్రాసింది విశ్వేశ్వరరావుగారు, పాడినది ఎస్.పి. బాలసుబ్రమణ్యం, దర్శకులు శ్రీ సి.ఎస్.రావు గారు. చిత్రీకరణ విజయవాడలో, అదీ.. మే నెలలో జరిగింది. అంత గొప్పపాట చేస్తున్నప్పుడు నాకు ఆ మండుటెండ లెక్కలోకి రాలేదు.

**ఆకలయ్యి అన్నమడిగితే పిచ్చోడన్నారు నాయాళ్లు**
**కడుపు మండి న్యాయమడిగితే ఎర్రోడన్నారు నాయాళ్లు**

నేను ఏ ఫంక్షన్‌కు వెళ్లినా నన్ను ఈ పాట పాడమని కోరుతుంటారు.

'జాతకరత్న మిడతంభొట్లు' సినిమా అప్పలాచారి రచన. ఓ సన్నివేశంలో రాజ భటులు మిడతంభొట్లుని రాజుగారి దగ్గరకు తీసుకొస్తున్నప్పుడు ఓ గుడ్డివాడు " ఏం నేరం చేశాడు?" అని అడుగుతాడు.

చిన్నతనంలో మా సింహాద్రిపురం గ్రామసంతలో ఒక గుడ్డివానికి చిప్పలో రాయివేసి కొన్ని కాణులు తీసుకుపోయాను. పెద్దయ్యాక ఈ సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా ఎంతో బాధగా ఉండేది. ఆ బాధ నివారణకై ఈ సన్నివేశానికి ఓ నిజమైన గుడ్డివాణ్ణి తీసుకువచ్చి కొంత డబ్బు ఇచ్చి పంపాను.

అయినా ఆ పాపఫలం తీరలేదనిపించింది. మద్రాసులో లిటిల్ ఫ్లవర్ వారి బ్లైండ్ అండ్ డెఫ్ సంస్థ ఉంది. 1977లో "చింతామణి"(నేను సుబ్బిశెట్టి పాత్ర వేశాను) ప్రాక్టీసు చేసి మద్రాసు వాణీ మహల్‌లో ప్రదర్శన యిచ్చాము. డోనార్స్ దగ్గర వసూలు చేసిన డబ్బు 5 వేలు ఆ సంస్థ పేర ఆంధ్రాబ్యాంక్ టి.నగర్ బ్రాంచ్‌లో డిపాజిట్ చేశాము. 15 సం॥లు గడిచాయి. 13 వేలు అయింది. ఆ వడ్డీ ఇప్పటికీ శాశ్వతంగా ఆ సంస్థకు వెళ్తోంది.

# నాద బ్రహ్మ త్యాగరాజు

(1767-1847)



అంబ నవాంబుజోజ్వల కరాంబుజ శారద తన వీణయైన కచ్ఛపిని ఒక్కసారి మీటింది. ఆ నాదం త్రిలోకాల్ని సంచరించి... నారద మహాముని మనస్సుని స్పర్శించి... ఆయన వీణయైన మహతీ నాదంతో కలిసింది. ద్విగుణీకృతమైన నాద ద్వయం వాల్మీకి మహర్షి ఆత్మని ఆవాహన చేసుకుని త్రిగుణాత్మకమైన తేజోపుంజం ఒకటి

సత్యలోక...

తపోలోక...

మహర్లోకాలను దాటుకుంటూ భూలోకానికి వచ్చి కాకర్ల రామబ్రహ్మం సతీమణి అయిన సీతమ్మ గర్భం జొచ్చింది.

అన్నమయ్య నందకం అంశతో జన్మిస్తే...

త్యాగయ్య సరస్వతీ... నారద... వాల్మీకి అంశలతో సర్వజిత్ నామ సంవత్సర వైశాఖ శుద్ధ షష్ఠినాడు 'తిరువారూరు'లో జన్మించాడు.

తిరువారూర్‌లో వెలసిన శివుడి పేరు 'త్యాగరాజు'. ఆయన అనుగ్రహంతో పుట్టినవాడు కనుక తమ బిడ్డకు 'త్యాగరాజు' అనే పేరే పెట్టారు.

పుట్టగానే బిడ్డ ఆరున్నొక్క రాగం ఆలపించాడు. 'అమ్మా' అనే పిలిచాడో 'రామా' అనే పిలిచాడో ఆ పరమేశ్వరుడికే ఎరుక!

**చనుబాలు... షడ్జమం.. స**

**ఉగ్గుపాలు... రిషభం ..రి**

**లాల... గాంధారం.. గ**

**జోల...మధ్యమం..మ**

**నిదుర... పంచమం.. ప**

**మెలకువ... దైవతం.. ద**

**నవ్వు... నిషాదం..ని**

సంగీతమంతా పాపై పుట్టి ఆ ఇంట్లో పారాడుతున్నట్లుండేది. పాకుతూ పాకుతూ వెళ్లి రామ పంచాయతనంలోని రాముడి కాళ్లు పట్టుకున్నాడు.

'పట్టి విడువ రాదూ నా చేయి పట్టి విడువ రాదూ'...

శ్రీరాముడు నవ్వుకునీ 'గడుసువాడే, పట్టుకున్నది తనూ వొదలద్దంటున్నది నన్నూ' అని ఓరగా సీతమ్మ వారి కేసి చూసాడు.

'వాడు నా బిడ్డ' అంది గర్వంగా!

త్యాగయ్య కన్నీటి బొట్టు అమ్మవారి పాదాల మీద చిట్లీ 'సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మాకు తండ్రి' అన్నది త్యాగరాజాత్మ!

తల్లి బాల్యంలోనే 'త్యాగు'కి

జయదేవుడి అష్టపదులూ...

రామదాసు కీర్తనలూ...

అన్నమాచార్యుల సంకీర్తనలూ నేర్పింది.

తండ్రి పోతన భాగవతాన్ని నూరిపోసాడు. అందుకేనేమో పోతనలోని లేతదనం, కొత్తదనం, మెత్తదనం త్యాగయ్య వంట కూడా పట్టాయ్. అందుకే ఎనిమిదో ఏటే 'నమో రాఘవాయా' అంటూ మొట్టమొదటి దివ్యనామ సంకీర్తనం చేసాడు.

నారద, శారద, వాల్మీకాదులు 'శుభం భూయాత్' అంటూ ఆశీర్వదించారు.

త్యాగరాజు కంఠ మాధుర్యాన్ని గ్రహించిన తండ్రి ... తులజాజీ మహారాజు చేత అర్ధ సింహాసన గౌరవాన్ని పొందిన శొంఠి వెంకట రమణయ్య గారి దగ్గరికి తీసికెళ్ళి, 'వీణ్ణి మీ శిష్యుణ్ణి చేసుకో'మ్మని పాదాల మీద పడేసాడు.

'శొంఠి' వారు ఇంటిపేరు మటుకే ఘాటు, మనసు చక్కెర పొంగలి. శొంఠి వెంకట రమణయ్య దక్షిణామూర్తి స్వరూపమైతే త్యాగరాజు అపర సుబ్రహ్మణ్యేశ్వరుడు.

ఇక సంగీత రత్నాకర మధనం ఆరంభమైంది.

ఇంతా చేస్తే సంగీత సంద్రమంతా... అగస్త్యుడిలా ఆపోసన పట్టేశాడు!!

గాత్రం పచ్చిదనం ముదిరి పండింది.

గురువు గారి పాదాభివందనం చేసుకుని మేనమామైన 'వీణ కాళహస్తయ్య' దగ్గర వీణావాదన సాధన...

కొండలు అరిగించుకునే వాడికి కుండలు ఏ పాటి!

త్యాగరాజు ఎంత సంగీతం నేర్చుకున్నా ఇంకా కొన్ని సందేహాలు ఉండిపోయాయి. ఆ బ్రహ్మ రహస్యాల్ని విప్పాలంటే బ్రహ్మ మానస పుత్రుడైన నారదుడికే చెల్లు! అంచేత ఆయనే స్వయంగా ఓ యతి వేషధారియై వచ్చి 'స్వరార్ణవం' అనే సంగీత గ్రంథాన్ని ఇచ్చి ఆశీర్వదించి వెళ్లాడు. స్వరార్ణవం చదువుతోంటే త్యాగరాజు హృదయంలో సప్త స్వరాలు సప్త సాగరాలై పొంగి కళ్లవెంట ధారాపాతమై గొంతు గద్గదమై 'శ్రీనారద మౌనీ గురు రాయా కంటి ఏనాటి తపమో గురు రాయా' అంటూ పాడాడు.

సరిగ్గా ఇదే సమయంలో మరుదనల్లూరు మఠంలోని ఓ సన్యాసి వచ్చి త్యాగరాజుకి తారక మంత్రోపదేశం చేశాడు.

త్యాగరాజు 18వ ఏట పార్వతమ్మ అనే కన్యతో పెళ్లైంది. కాని ఆవిడ రెండేళ్ళకే పరమపదం చేరటం వల్ల ఆవిడ చెల్లెలైన కమలాంబతో ద్వితీయ వివాహం చేశారు. ఇల్లాలైతే అమిరింది గానీ ఇల్లా, వాకిలా? పొద్దుగూకులూ రామనామంలో మునగానాం, తేలానాం... ఇంటిల్లి పాదికీ అన్న సంపాదనే గాని అణా సంపాదన లేదు. అన్నగారు జపేశానికి ఒళ్లు మండుకొచ్చేది. ఇంత విద్యా పెట్టుకుని ఏ రాజాశ్రయమో పొందితే 'కనకాభిషేకాలు', 'గజారోహణాలు' చేస్తారు గదా వెర్రివాడా! రామనామం కూడెడుతుందా, గుడ్డెడుతుందా అంటూ విసుక్కున్నాడు, తిట్టాడు, కొట్టబోయినంత పనిచేశాడు... ఆఖరికి త్యాగరాజ స్వామి ఆరాధ్యదైవమైన రామ పంచాయతనం మీద దృష్టి పడింది. 'అదీ, వాడు చెడిపోవడానికి మూల పురుషుడు వీడూ' అంటూ ఓ అర్ధరాత్రి ఆ విగ్రహాల్ని పట్టుకెళ్లి కావేరీ నదిలో గిరవాటేసి చక్కా వచ్చాడు. మర్నాడుదయం 'రమించు వారెవరురా నిను వినా రఘోత్తమా' అంటూ పూజ చేసుకోవటానికి వచ్చిన త్యాగరాజుకి రాముడూ కనిపించలేదు, సీతా కనిపించలేదు. పీఠం ఖాళీ... అంతే... హృదయం శూన్యం.

**గుండె ఉంది... చప్పుళ్లేదు.**

**మెదడుంది... ఆలోచన్లేదు.**

**కళ్లున్నాయి... చూపులేదు**

గుండె గాజుగోళంగా బద్దలైపోయి ఆత్మంతా పెంకులు గుచ్చేసుకున్నాయి. మాటలేదు.. అని మౌనమూ గాదు. అప్రయత్నంగా కళ్ళవెంట నీరు... 'నన్ను వొదిలి వెళ్లిపోయావా రామా, నువ్వు లేకుండా బతికెయ్యమంటావా నన్ను' అంటూ అహోరాత్రులూ విలపించాడు. త్యాగరాజు బాధ చూళ్లేక రాముడు స్వయంగా తన విగ్రహాల్ని వెదికి కావేరీ నది ఒడ్డున పెట్టి మాయమయ్యాడనుకుంటా.

అంతే దొరికిన విగ్రహాల్ని గుండెకి హత్తుకుంటూ 'కనుగొంటినీ శ్రీరామునీ నేడూ' అంటూ కరువుదీరా పాడుకున్నాడు.

ఇదిలా ఉండగా తంజావూరు ప్రభువైన శరభోజీ మహారాజు త్యాగరాజుని తమ కొలువులో ఆస్థాన విద్వాంసుడిగా ఉండీ తనని కృతార్థుడ్ని

చేయమని అర్థిస్తూ అమూల్యమైన వస్త్రాలు, ఆభరణాలు పంపాడు. కాని వాటన్నిటినీ తృణప్రాయంగా ఎంచిన త్యాగరాజు 'నిధి చాల సుఖమా రాముని సన్నిధి చాల సుఖమా? నిజముగ తెలుపు మనసా' అనే కీర్తన పాడి ఆహ్వానాన్ని తృణీకరించాడు.

అంతే!... ఒక్కసారి రాజసం బుసలు కొట్టింది.

'నా అంతటి వాణ్ణి కాదంటాడా, త్యాగరాజుని కాళ్లు చేతులు విరిచి కట్టి నా దగ్గరికి ఈడ్చుకు రండి' అంటూ ఆదేశించాడు శరభోజీ. రాజాజ్ఞ అయింది!

కత్తులు కటార్లతో దండనాధులు బయల్దేరారు.

కాని, శివుడాజ్ఞ కాలేదు!

త్యాగయ్యకి చీమ కూడా కుట్టలేదు.

కాని శరభోజి మహారాజు కడుపులో శూలం పెట్టి పొడుస్తున్నట్టు ఆ మాటకొస్తే త్రిశూలం పెట్టి పొడుస్తున్నట్టు బాధ.

మెలికలు తిరిగిపోతున్నాడు రాజు! అల్లాడిపోతున్నారు రాజవైద్యులు.

ఎవరో విజ్ఞుడు "బహుశా ఉత్తముడైన త్యాగరాజుల వార్ని బంధించి తెమ్మన్నారు... కనక..." అర్థోక్తితో ఆపాడు. అర్థమైంది శరభోజి మహారాజుకి. లెంపలు వాయించుకున్నాడు - మనసులోనే ఆ నాదబ్రహ్మకు సాష్టాంగ పడ్డాడు.

కడుపునొప్పి మాయమైంది.

తను చేసిన తప్పుకి మనసా వాచా పశ్చాత్తాప పడి, తనే స్వయంగా త్యాగరాజ స్వామి సన్నిధికి చేరి, ఆయన స్నేహం సంపాయించి ఆయన పాడుతుంటే పక్కనే కూర్చుని వినీ తనూ అనుకున్నాడు... 'నిధి చాలా సుఖమా' అని!

త్యాగరాజ స్వామి వద్ద చాలా మంది శిష్యులుండేవారు. ఆయన ఆశువుగా, ఆర్ద్రంగా పాడుతుంటే పాడినవి పాడినట్టు పల్లవి ఒకరు, అను పల్లవి ఒకరు, చరణాలు కొందరు వ్రాసుకునే వారట. అలా దాచటం వల్లే మనకీమాత్రం కీర్తనలైనా దొరికాయి.

(అన్నమాచార్యుల వారి సంకీర్తనలు రాగి, ఇత్తడి ఫలకాల మీద ఉంటే దొరికినవి దొరికినట్టు రాగి బిందెలు, ఇత్తడి చెంబులు చేసుకుని... సంకీర్తనలకి నువ్వులూ నీళ్లూ ఒదిలిన జాతి మనది... లేకపోతే... ఆయన రాసినవి 32 వేలు... మనకి దొరికినవి ???)

త్యాగయ్య గారు మరొక గొప్ప పని చేసాడు... తన శిష్య బృందాన్ని వేసుకుని వీలైనన్ని క్షేత్రాలు తిరుగుతూ, వీలైనంత మంది దేవుళ్ళ మీద కీర్తనలు రాసాడు... కంచి, వాలాజీపేట, శ్రీరంగం... నాగపట్టణం... తపస్తీర్థం... ఘటికాచలం... పుత్తూరు... తిరుపతి! తిరుపతి చేరే సరికి మూల విరాట్టుని మూసేస్తూ తెర!

అప్పుడు త్యాగయ్య
'తెరతీయగ రాదా నాలోని
తిరుపతి వెంకటరమణా
మత్సరమను తెరతీయగ రాదా'

అని పాడే సరికి, తెర తొలగి పోయిందని ఐతిహ్యం!

ఆ తర్వాత శ్రీ వెంకటేశ్వరుడి దివ్య మంగళ విగ్రహాన్ని చూసి నోట మాట రాక...

'వెంకటేశ నిను జూడ పదివేల కనులు కావలెనయ్యా' అంటూ ఆనంద భాష్పాలు రాల్చాడు.

త్యాగరాజ స్వామి రచించిన కీర్తనల్లో ఖ్యాతి పొందిన పంచరత్నాలు చాలా ఉన్నాయి. ఘనరాగ పంచరత్నాలూ, నారద పంచరత్నాలూ, తిరువత్తియూరు పంచరత్నాలూ, కోవూరు పంచరత్నాలూ, నాగపుర పంచరత్నాలూ, శ్రీరంగ పంచరత్నాలూ...

వీటిలో ఘనరాగ పంచరత్నాలు ప్రసిద్ధాలు!

1. జగదానంద కారక- నాట రాగంలో
2. దుడుకుగల నన్నే దొరా - గౌళ రాగంలో
3. సాధించెనే ఓ మనసా - ఆరభి రాగంలో
4. కన కన రుచిరా - వరాళి రాగంలో
5. ఎందరో మహానుభావులు - శ్రీరాగం

'ఎందరో మహానుభావులు' అన్న కృతిని బహుశా తెలుగు వారందరూ వినే ఉంటారు. మామూలుగా వినడం కాదు. తమిళనాడులోని తిరువయ్యారులో ఆయన సమాధి అయిన చోట ప్రతి ఏటా త్యాగరాజ ఆరాధనోత్సవాలని జరుగుతాయి. కర్నాటక సంగీతం నేర్చుకున్న వాళ్లెవరయినా ఆరాధనోత్సవాలకి హాజరై పంచరత్న కీర్తనలూ పాడటం తమ పూర్వజన్మ సుకృతంగా భావిస్తారు. చెంబై వైద్యనాథ భాగవతార్ లగాయితు ఎమ్మెస్ సుబ్బలక్ష్మి దాకా, జేసుదాసు నుంచి తబలా మాస్ట్రో జాకిర్ హుస్సేన్ దాకా తమ తమ గాత్రాల్నీ, వాద్యాల్నీ వినిపించిన వారే. కచేరీకి లక్ష రూపాయలు తీసుకునే విద్వాంసుడైనా సరే తన టికెట్ తను కొనుక్కుని అక్కడకెళ్లి ఆ ఉత్సవంలో పాల్గొనడం తమ అదృష్టంగా భావిస్తారు. నిజంగా ఆ రోజుల్లో అక్కడికెళ్తే హోరెత్తే సంగీత సముద్రం... స్వరార్ణవం అక్కడ కనిపిస్తుంది. వీణలు, మృదంగాలు, కంజీరాలు, వాయిలీనాలు, ఘటాలు, మోర్సింగులు... అదో సంగీతానుభూతి!

మొన్న అనుకోకుండా తంజావూరు వెళ్లడం, అక్కడ నుంచి కావేరీ నది ఒడ్డున త్యాగరాజ స్వామి వారి సమాధి చూడ్డం, అక్కడ తెలుగు లిపిలో ఉన్న కీర్తనలు చూసి పులకరించి పోతూ గట్టిగా పాడుకుంటూ కన్నీళ్లు కార్చడం, త్యాగరాజస్వామి వారి సమాధి మీదున్న చిటికెడు విభూదిని నోట్లో వేసుకోవడం, ఆ మహానుభావుడి ఆత్మకి సాష్టాంగ దండ ప్రణామాలా చరించడం స్వీయానుభవం!

ఆ ఎదురుగుండానే వినమ్రంగా చేతులు జోడిస్తూ ఆ సమాధి మీద ఆలయం నిర్మించడానికి తన యావదాస్తిని ధారపోసిన గాయని 'బెంగుళూరు నాగరత్నమ్మ' విగ్రహానికి కూడా దణ్ణం పెట్టుకున్నాను.

నేను త్యాగరాజ స్వామివారి నిర్యాణం గురించి ప్రస్తావించలేదు. ఎంచేతంటే, కర్ణాటక సంగీతం సజీవం. దానికి మరణంలేదు. అంచేతే త్యాగరాజస్వామి చిరంజీవి.



చిలకలగూడ రైల్వేక్వార్టర్స్‌లో ఉండగా ప్రఖ్యాత వేణునాద విద్వాంసుడు టి.ఆర్.మహాలింగం గారి శిష్యుడు శ్రీ చంద్రశేఖరన్ గారు, గుళ్ళో త్యాగరాజ స్వామి ఉత్సవాలు జరుపుతుంటే అందరూ పడుకున్నాక త్యాగరాజుల వారి మెళ్లో వేసిన గారెల దండని చంద్ర శేఖరన్ గారి అబ్బాయి, నేను దొంగతనం చేసాం. దొంగతనంగానైనా ఆ మహానుభావుడి ప్రసాదం తిన్న పుణ్యమేమో... హాసానికి ఈ వ్యాసం!

**- తనికెళ్ళ భరణి**

గౌరవనీయులైన భరణి గారికి,

అభినయ కళ, సాహితీ ధారలతో ఓలలాడిస్తున్న 'భరణి', పక్షానికో పంచదార గుళికను నలుచెరగులా 'హాసం' ద్వారా తినిపిస్తున్న 'భరణి' ఒక్కరేనా? సరికొత్త డైమన్షన్‌లో మిమ్మల్ని పరిచయం చేస్తున్నందుకు 'హాసం' టీము అభినందనీయులు. సంగీతం శాస్త్రమని తెలియని పామరులకు, రసరంగ ఒడ్డున ఆడుకుంటున్న మాకు 'తెలియని సంగీత-సాహిత్య దిట్టలను' పరిచయం చేయడం-చదివేవారికి వెన్నెల్లో విహరించడం లాంటిది. "కార్తీక మాసంలో.. కవి పండిత-సభలో మల్లుగుడ్డపై పాద ధూళి చూర్ణమై... రాజకుటుంబీకుల తీర్థమై..." ఎంత చక్కగా చెప్పారు. విద్వన్మణులకు వారిచ్చిన గౌరవం ఆశ్చర్యానందోద్వేగాలను కలిగిస్తూ మనసును తాకుతోంది. కామసముద్రం అప్పలాచార్యులు -ఈ విద్వన్మణి పేరు మీ కలం వెంట మొదటిసారిగా చదివాను. ఇక ఎప్పటికీ మరువలేనేమో. జయదేవ కవి అష్టపదుల సారం గ్రహించడానికి ఆయన అవలంబించిన విధానం, తర్కం, సాధన 'ఆంధ్రాష్టపది' సృష్టిస్తే, చదివిన మాకు ఆనందామృతాన్ని ఇచ్చింది. గీతగోవిందం లాంటి మరొక అద్భుత సంగీత-సాహితీ సంపద, శ్రీ త్యాగరాజ విరచితమైన సంగీత గేయ నాటిక "నౌకా చరిత్రం"ను విపులంగా తెలుసుకోవాలని, మాలాంటి వారికి ("యవ్వన మదాంధకారిణులైన గోపికల గర్వభంగ మొనర్చిన గోవిందుడికి కథ"గా సింగిల్ లైన్ మాత్రమే తెలిసిన వారికి)శ్రీకృష్ణుడి మధుర-శృంగార లీలను... లోతుగా మీ సాహితీ రసధారలో చదవాలని ఆశగా ఉంటుంది. తప్పనిసరిగా మా కోరిక మన్నించగలరు. '10 రూపాయల హాసం పత్రిక' పదికాలాల పాటు అక్షరాలలో 'అమృతవర్షిణి'గా వర్ధిల్లాలని మనస్ఫూర్తిగా కాంక్షిస్తూ...

సంగీత-సాహిత్య సుమ సౌరభాల్ని "ఎల్లారుకు -తనీ"గా వెదజల్లుతున్న 'భరణి' గారికి ప్రణామములతో...

భవదీయుడు
బలుసు రామకృష్ణారావు, కన్నాపురం, ప.గో.జిల్లా.

## కొంటెకొశ్చెన్లు-తుంటరి జవాబులు




**సురేష్, రాజమండ్రి**

❖ ఆడువారి మాటలకు అర్థాలే వేరులే... మరి పాడువారి మాటలకు?

✦ (ఇప్పుడు) పాడువారి మాటలకు అర్థాలే లేవులే

**బి.శారదాదేవి, చందానగర్**

❖ అసలు సిసలైన హీరో కొడుకు?

✦ "ఏరా అస్సలు చదువుతున్నట్టే లేదేంటి?" అని తండ్రి ప్రశ్నిస్తే 'ఏ సబ్జెక్టూ నచ్చటం లేదు డాడీ" అని జవాబిచ్చేవాడు.

**కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం**

❖ నవ్వు అనగానేమి?

✦ సగటు మనిషి భార్య ముఖంలో ఒకటో తారీఖున మాత్రమే కనిపించేది.

## డబుల్‌రోల్




'వారి'ని ఎలా 'వారించాలో' తెలియటం లేదు

- చైతు ప్రకాష్, రుద్రారం.

ఆ 'పీటర్' గాడే ఈ 'పీట' ముడివేశాడు

- వై.క్రాంతి సాగర్, ఏలూరు.

ఆ 'పీపా' రేపేపా'టికి ఇచ్చేయాలి సుమా

- జె. శ్రీకాంత్, రాజమండ్రి.



## చిలిపి లిపి




Way 2 - వేటు

So the - సోది

- బి.శ్రీరాం, రుద్రారం.

1/4 stones- పావురాలు

- రఫీ, కృష్ణ, రాజాం

## ఈ రూటే వేరు



అప్‌సెట్ - అప్పుసెట్టవడం(అప్పుదొరకటం)

- డి.బల్తజార్, రామచంద్రపురం.

పిగ్ (Pig) - పెర్ఫెక్ట్లీ ఇంటలిజెంట్ గర్ల్

- స్పందన, కాకినాడ.

సర్ఫేస్ - అయ్యగారి ముఖం

- బి.వి.రావు, చందానగర్.

# పేరడీ పేరేడ్




దోమా అని అరచినా కుట్టకుండ ఉండవా
నా రక్తం తాగకుండ నువ్వు బ్రతక లేవా ॥దోమా॥
డబ్బెంతో ఖర్చుపెట్టి మందెంతో చల్లినా
కాయిల్స్‌ని కాయిల్స్‌గ మార్చి ధూపమేసినా
ఓ దోమా నను పగబట్టి కుడుతూనే ఉందువా
నన్నూ రక్షించగ పోవమ్మా దోమా ॥దోమా॥
పారిపోతినమ్మా నను తరిమి చంపకమ్మా
నీ కాటు పడకుండ నేనెందు దాగనమ్మా
పరిసరాల పరిశుభ్రతే
నిను ఆపగలదని తెలిసెనమ్మ
పరిసరాల పరిశుభ్రతే
నిను ఆపగలదని తెలిసెనమ్మ
ముస్సిపాల్టి వారినీ కుట్టమ్మా...కుట్టమ్మా...దోమా...

("శ్రీపాండురంగ మహాత్మ్యం" చిత్రంలోని "అమ్మా అని అరచినా" పాటకి పేరడీగా)

**లోగిశ లక్ష్మీనాయుడు, సింహాచలం.**

# పేరు -రిపేరు




భీముడు - ఒక్కడు - మహాబలుడు
ఈ అబ్బాయి చాలా మంచోడు - ఎవరే అతగాడు - మన్మథుడు
ప్రేమలో పావని కళ్యాణ్ - ఔను వాళ్లిద్దరూ ఇష్టపడ్డారు.

**- దేవులపల్లి రామమూర్తి, విజయవాడ.**

# చిలిపి కవిత




భారీ సెట్టింగులు వేసిన
సినిమా లాంటి
నగరం మనది
చిన్న 'పోర్షన్'కి కూడా
చాలా 'మూల్యం'
చెల్లించక తప్పదుమరి

**భమిడిపాటి వెంకటేశ్వరరావు, రుద్రారం**

**అలనాటి ఆణిముత్యాల**
**గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**




# నవ్వుటద్దాలు

- ఆచార్య తిరుమల




## పద్యాలకు మేలి ముసుగులు

కవులు సాధారణంగా చమత్కార ప్రియులై వుంటారు. ఒక విషయాన్ని అందరూ చెప్పే విధానంలో కాకుండా వేరే విధంగా చెప్పటానికి ప్రయత్నిస్తూ వుంటారు. అందులో అందాన్ని, ఆకర్షణని సాధిస్తే అది కవిత్వమై చలామణీలోకి వస్తుంది. ఈ చమత్కారం అనేది శబ్దాన్ని బట్టి, అర్థాన్ని బట్టి కూడా వుంటుంది. అయితే, శబ్దం కంటే అర్థం గొప్పది కాబట్టి అర్థ సౌందర్యాన్ని ఆస్వాదించే వేళ శబ్దోత్పత్తిని గూర్చి విచారించటం శృంగార సమయాన చీర ఖరీదుని గూర్చి ఆలోచించటం లాంటిదని-

అర్థాస్వాదన వేళాయాం శబ్దోత్పత్తి విచారకాః
నీవీ మోక్షణ వేళాయాం వస్త్ర మూల్య విచారకాః!!

అనే శ్లోకం తెలియజేస్తూ వుంది. అందుకే అలంకార శాస్త్రంలో శబ్దాలంకారాల కంటే అర్థాలంకారాల సంఖ్య ఎక్కువగా వుంటుంది. అర్థాలంకారాల్లో శ్లేషాలంకారం ఒకటి. రెండర్థాల పదాలతో ప్రస్తుత విషయంతో అప్రస్తుత విషయాన్ని కూడా స్ఫురింపజేయటం శ్లేషాలంకారం. దీంతో కవులు చాలా చమత్కారాలు సాధించారు. ద్వ్యర్థికావ్యాలు, త్ర్యర్థి కావ్యాలూ సృష్టించారు. అంటే-ఒకే పద్యంలో రెండేసి, మూడేసి అర్థాలొచ్చేలా రాశారు. పింగళి సూరన కవి రాఘవ పాండవీయమనే ద్వ్యర్థి కావ్యాన్ని రాశాడు. అందులోని ప్రతి పద్యాన్ని ఒకలా చదివితే రామాయణార్థం, వేరేలా చదివితే భారతార్థం వస్తాయి. అదో అద్భుతం!

మరో కవి-ఒకే పద్యంలో భారత, భాగవత, రామాయణాన్ని నిక్షేపించి యాదవ రాఘవ పాండవీయమనే మూడర్థాల త్ర్యర్థి కావ్యం రాశాడు. ఇటువంటి కావ్యాలు చదవటానికి పాండిత్యం, ఓపిక కూడా చాలా కావాలి. మిమ్మల్ని అంత కష్టపెట్టకుండా అందమైన చమత్కారాల మేలి ముసుగులోని కొన్ని పద్యాల్ని పరిచయం చేస్తాను. అయితే యిక్కడ కవులు సాధించిన సమన్వయాన్నే చమత్కారంగా గ్రహించటం ఆనంద దాయక మవుతుందని మనవి.

శేషం వెంకటపతి అనే కవి తన శశాంక విజయం కావ్యంలో చాలా గొప్పవైన తర్క, శబ్ద, యోగ, సాంఖ్య, మోక్షా, ద్వైత, అద్వైత శాస్త్రాల్ని కామశాస్త్రానికెలా అన్వయించాడో చూడండి:

ఇందులో కాముకుని దృష్టిని గ్రహించండి:-

**పాల యల్కవేళ నీ పాలతుకతోఁ గూడ**
**తర్కించు వేడుక తర్కశాస్త్ర**
**మంగజుకేళినీ యంగనతో గళ**
**స్వనములు పల్కుటే శబ్ద శాస్త్ర**
**మదనమౌ తమిదీని యాస్యంబున నిజాస్య**
**యోగ మొనర్చుటే యోగ శాస్త్ర**
**మిమ్ముగా నిమ్ముద్దు గుమ్మ గుణమ్ములు**
**సంఖ్య మొనర్చుటే సాంఖ్యశాస్త్ర**
**మలతి కొనగోట నొక్కి యీ యతివ నీవి**
**మోక్ష మొనరించుటే యెల్ల మోక్ష శాస్త్ర**
**మేను నీవని పైకొనుటేను ద్వైత**
**మిరువు రొకటైన నద్వైత మిద్ధరిత్రి!!**

అయ్యో! అదిటండీ శాస్త్ర ప్రయోజనం! సముఖం వెంకట కృష్ణప్ప నాయుడు అహల్యా సంక్రందనమనే కావ్యంలో అహల్య అందాన్ని చూసి అప్సరస లెలాంటి చేష్టలకి లోనయ్యారో ఈ పద్యంలో చెప్పాడు. చూడండి:-

వనితను గాంచి రంభ తలవంచె, తిలోత్తమ మోము నల్ల చే
సెను, శశిరేఖలో(గమలె, చేష్టలు దక్కెను చిత్రరేఖ, కా
కనొగిలె హేమ, మైమరపు గాంచె మదాలస, తగ్గుచెందె వా
మన, కరగెన్ ఘృతాచి అవమానత మేనక గాంచెనెంతయున్!!

అరటి చెట్టులా రంభ తల వంచింది. తిల(నువ్వులు) లా, తిలోత్తమ నల్లబడింది. చంద్రునిలో మచ్చలా శశిరేఖ కమిలింది. చిత్రంలా చిత్రరేఖ నిశ్చేష్టమయ్యింది. బంగారంలా హేమ కాకెక్కింది. మదంతో మదాలస మైమరచింది. వామన కాబట్టి తగ్గింది. నెయ్యిలా (ఘృతం=నెయ్యి) ఘృతాచి కరిగింది. మేనక అంటే కొలత కాబట్టి అవమానపడింది. అప్సరసల అసలు స్వరూపాలు ఇలాగే వుంటాయి.

అప్పకవి తేటగీతి పద్య లక్షణాన్ని ఎంత అందమైన ముసుగులో వుంచి చెప్పాడో చూడండి:-

మిత్రుడొక్కండు వీణియ మీటుచుండ
విబుధ వరులిద్ద రర్థంబు విప్పి చెప్ప
ఇనులు నిద్దరు వినుచుండ నేక రీతి
తేటగీతంబు మాటను వాటమయ్యె!!

మిత్రుడొకడు అంటే ఒక సూర్య గణం. విబుధ వరులిద్దరంటే రెండు ఇంద్రగణాలు, ఇనులు ఇద్దరంటే రెండు సూర్యగణాలు. అంటే తేటగీతి పద్య పాదానికి 1 సూర్యగణం, 2 ఇంద్రగణాలు, 2 సూర్యగణాలూ ఉంటాయని అర్థం. మిత్రుడు, ఇనుడు అంటే సూర్యుడు, విబుధ వరుడంటే ఇంద్రుడు. తేటగీతిని వీణకచేరీకి సమన్వయించటం ఇక్కడ చమత్కారం.

మరో కవి దశావతారాల్ని ఎలా చెప్తున్నాడో చూడండి:-

సలిల విహారు లిద్దరును సంతత కానన చారు లిద్దరున్
వెలయగ విప్రు లిద్దరును వీరపరాక్రమ శాలు లిద్దరున్
పొలతుక డాయు వాడొకడు భూమి చరించెడు వాడు నొక్కడున్
చెలువుగ మీ కభీష్టములు సిద్ది ఘటింతు రనంత కాలమున్!!

నీళ్ళలో తిరిగే వాళ్ళిద్దరూ, అడవుల్లో తిరిగే వాళ్ళిద్దరూ, ఇద్దరు బ్రాహ్మణులు, ఇద్దరు వీరులు, భార్యనొదిలేసిన వాడొకడు, నేలమీదనే తిరిగే వాడొకడు, మీ కోరిక లెప్పుడూ తీరుస్తారని అర్థం. చేప (మత్స్యావతారం) తాబేలు (కూర్మావతారం) నీటిలో తిరిగేవి. పంది (వరహావతారం), సింహం (నరసింహావతారం) అడవిలో తిరిగేవి, వామనుడు, పరశురాముడు బ్రాహ్మణులు, శ్రీరాముడు, బల రాముడు, వీర పరాక్రమ శాలురు, బుద్ధుడు భార్య నొదిలేసిన వాడు, భూమ్మీద తిరిగేవాడు కల్కి.

బుద్ధిమంతులు పొద్దునే జూదాన్ని గురించి, మధ్యాహ్నం ఆడదాని గురించి, రాత్రి దొంగని గురించి ప్రసంగాలు చేసుకుంటూ కాలం గడుపుతారని యీ క్రింది శ్లోకం తెలియజేస్తూ వుంది.

ప్రాతః ద్యూత ప్రసంగేన-మధ్యాహ్నే -స్త్రీ ప్రసంగతః
రాత్రౌ చోరప్రసంగేన-కాలో గచ్ఛతి ధీమతాం!!

జూదాన్ని, ఆడదాన్ని, దొంగతనాన్ని గురించి మాట్లాడుకుంటూ కాలక్షేపం చేసేవారు బుద్ధిమంతులెలా అవుతారు? అంటే-ఇక్కడ ఇదొక అందమైన ముసుగు మాత్రమే. ఇందులో భారత, భాగవత, రామాయణ ప్రసంగాలున్నాయి. ధర్మరాజు ద్యూతం భారతం, సీత కథ రామాయణం, వెన్నదొంగ కృష్ణచరిత్ర భాగవతం. వాటి ప్రసంగాలతో బుద్ధిమంతులైనవారు కాలం గడుపుతారని శ్లోక తాత్పర్యం.

పాల్కురికి సోమన అనే మహాకవి అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః-వర్ణమాలలో బసవేశ దర్శనం చేయించాడు. చూడండి.

**అ**మిత యశస్క **ఆ**ద్యయన **ఇ**ద్రుచి **ఈ**శ్వర **ఉ**గ్ర **ఊ**ర్జిత
క్రమ **ఋ**షభాంక **ౠ**జిహార **ౡ**స్థిత **ౡ**స్మిత **ఏ**కరుద్ర **ఐ**ం
ద్రమహిత రూప **ఓ** మితి పదద్యుతి **ఔ**ర్వలలాట **అం**బికా
సమరసభావ **అః**కలిత వర్ణనుతం బసవేశ పాహిమాం!!

అక్షరాల్లో ఈశ్వర శక్తిని నిక్షిప్తం చేసి చెప్పిన యింతటి పాండిత్య స్ఫోరకమైన పద్యం సాహిత్యంలో ఎక్కడా కనిపించదు.

చివరగా-ఓ చమత్కార పద్యంతో ముగిస్తాను.

రంభ, ఊర్వశుల్లో ఎవరు గొప్ప వారంటే ఆచార్య ఎస్వీ జోగారావు గారు ఇచ్చిన తీర్పు ఎంత గమ్మత్తుగా వుందో చూడండి:-

రంభ గొప్పదా? గొప్ప దూర్వశియ చెపుమ?
రంభ గారిది ధర్మ సత్రంబు కాగ
పొసగ నూర్వశి దొక పెద్ద పోషు హోటలు
అద్దె లేదు దానికి దీని కద్దె కలదు!!

## హరివంశరాయ్ బచ్చన్ స్మృతి

గత పక్షం జనవరి 17న ప్రముఖ హిందీ కవి, పద్మభూషణ్ డా॥హరివంశరాయ్ బచ్చన్ 95వ యేట కీర్తిశేషులయ్యారు. 'మధుశాలా', 'జనగీత' వంటి కావ్యాల ద్వారా ఎంతో కీర్తిని, అవార్డులను గడించు కున్న బచ్చన్ తన కవిత్వంతో, పాండిత్యంతో, నెహ్రూ కుటుంబాన్ని ఆకర్షించారు. ప్రయాగలో జన్మించి ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా, షేక్స్పియర్ నాటకాలకు హిందీ అనువాద కర్తగా, రాజ్యసభ సభ్యుడిగా కూడా ఉన్న బచ్చన్ అమితాబ్ బచ్చన్ తండ్రిగా హిందీయేతర ప్రాంతాల్లో కూడా గుర్తింపబడ్డారు. సినిమాలకై ఆయన రాసిన పాటలు రెండే -'రంగ్ బర్‌సే' (సిల్‌సిలా) 'అగ్నిపథ్' టైటిల్ సాంగ్. కానీ ఆయన రాసిన పాటలను కొన్ని హిందీ సినిమాలలో ఉపయోగించుకున్నారు. వాటిలో ఇది ఒకటి. 'ఆలాప్' సినిమాకై జయదేవ్ సంగీత దర్శకత్వంలో యేసుదాస్ పాడిన ఈ పాట అమితాబ్‌బచ్చన్‌పై చిత్రీకరింప బడింది.


కుమారుడు అమితాబ్‌తో
హరివంశరాయ్

కోయీ గాతా మైఁ సోజాతా ॥2॥
సంస్రితి కె విస్రిత్ సాగర్ మేఁ
సప్‌నోం కి నౌకా కే అందర్
దుఃఖ్ సుఖ్ కి లహరోం మేఁ ఉఠ్ గిర్
బహతా జాతా, మైఁ సోజాతా...
ఆంఖోం మేఁ లేకర్ ప్యార్ అమర్
ఆశీశ్ హథేలీ మేఁ భర్ కర్
కోఈ మేరా సర్ గోదీ మేఁ రఖ్
సహలాతా, మైఁ సోజాతా...
మేరే జీవన్ కా ఖారాజల్
మేరే జీవన్ కా హాలాహల్
కో ఈ అపనే స్వర్ మేఁ మధుమయ్‌కర్
దొహరాతా మైఁ సోజాతా
కోయీ గాతా మైఁ సోజాతా

ఫిబ్రవరి 3 చక్రవర్తి ప్రథమ వర్ధంతి సందర్భంగా...

# నువ్వులేవు... నీ పాట వుంది



"ఈయన పేరు.. అప్పారావ్.. చెవికాడ.."

పాండీబజార్.. హమీదియా హోటల్ ముందు, ఎవరో పరిచయం చేసారు అతన్ని.

"ఏం చేస్తుంటారు..."-మద్రాసు కొత్తగా వచ్చిన నేను.. వినయంగా అడిగాను.

"ఏదైనా చేస్తాను.. రచన, సంగీతం, నటన, దర్శకత్వం.. ఒళ్లు మండితే ఫైటింగ్, డాన్సింగ్, ఎడిటింగ్... ఏదైనా చేస్తాను-ఇచ్చే దమ్మున్నవాడు దొరకాలి... అంతే..."- అని, మొహం అంతా వ్యాపించేటట్టుగా పెద్ద నవ్వు నవ్వాడు అతను.

"ఈ మధ్యనే ఛటర్జీ గారి... 'మూగప్రేమ', ..... 'శారద'కి మ్యూజిక్ డైరెక్షన్ చేసాడీయన..."-అతన్ని పరిచయం చేసిన "ఎవరో" మళ్ళీ చెప్పాడు.

"వాటికి మ్యూజిక్ చేసింది... చక్రవర్తి కదా..."-అనుమానంగా అడిగాను.

"ఈ అప్పారావ్ గాడే.. ఆ చక్రవర్తి...! సంగీత అప్పారావ్... అనటం కంటే సంగీత చక్రవర్తి అనటం ఘనంగా వుంటుందని నలుగురూ అనటంతో మార్చేసుకున్నా పేరు..."- అంటూ మళ్ళీ నవ్వాడు. ఈసారి ఆ నవ్వు అతన్నుంచి పొంగి చుట్టూ వున్న అందర్నీ ముంచేసింది.

మనుషులు అంతా... నవ్వుతారు... నవ్వగలరు. కానీ కొంతమంది నవ్వుల్లోనే... నిజాయతీ-అమాయకత్వం-నిర్మలత్వం వుంటుంది.

చక్రవర్తిది అంతటి నవ్వు...! ఆ నవ్వే అతన్ని నాకు స్నేహితుడ్ని-ఆత్మీయుడ్ని చేసింది. అందుకే కావచ్చు... పరిచయం అయిన పది రోజులకే 'ఒరే... ఒరే...' అనుకునేటంత దగ్గర అయ్యాం...!

* * *

ఎక్కువగా క్రాంతికుమార్ ఆఫీసులో కలిసే వాళ్లం. కబుర్లు-జోకులు-మ్యూజిక్ సిట్టింగ్స్-అన్నీ అక్కడే...!

"ఈ చక్రవర్తి ఇంకా రాలేదు... మ్యూజిక్ సిట్టింగ్‌కి టైమ్‌కి రావటం మానేశాడు... పిక్చర్స్ ఎక్కువయ్యి-కళ్ళు నెత్తికెక్కాయి..."-ఓ రోజు క్రాంతికుమార్ కోపంతో కుర్చీని, బల్లని తంతూ కాలక్షేపం చేస్తున్నాడు. కాస్సేపటికి చక్రవర్తి వచ్చాడు.

'మూడ్' సరదాగా వుండటం మంచిదని ఛటుక్కున నేను అడిగాను.

"ఏరా చక్రీ... తలపైకి ఎత్తకుండానే నీకు-పైన రూఫ్‌కి వున్న ఫాన్, లైట్లు, బూజు, బల్లీ... అన్నీ కనిపిస్తున్నాయా..."

"లేదే... తల ఎత్తకుండా అవి ఎలా కనిపిస్తాయ్..." అర్థంకాక అన్నాడు చక్రవర్తి.

"క్రాంతి... నీ కళ్ళునెత్తికి ఎక్కాయి అన్నాడు. అలా ఎక్కివుంటే అవన్నీ కన్పించాలి కదా..." అన్నాను.

తనకి అర్థమైంది... నవ్వేస్తూ-"ఒరె ... నాకు కళ్ళు నెత్తికెక్కివుంటే-నేను ఇన్ని మెట్లెక్కి ఇబ్బంది పడేవాడినే కాదు... సిట్టింగ్స్‌కి నా ఇంటికే రమ్మనేవాడిని..." అన్నాడు (క్రాంతికుమార్ ఆఫీసు... మూడో అంతస్థులో వుండేది.) అతని మాటకి, నవ్వుకి, క్రాంతి కోపాన్ని వాయిదా వేశాడు.

నిజంగానే... గర్వం అనేది తెలీని మనిషి చక్రవర్తి.

అప్పుడు ఇండస్ట్రీలో వుండే టాప్ డైరెక్టర్స్, టాప్ ప్రొడ్యూసర్స్, టాప్ బ్యానర్స్ అతని కాల్‌షీట్ కోసం, అతని ట్యూన్ కోసం తిరుగుతున్నా-ఒకే రోజున నాలుగైదు థియేటర్స్ అతని పేరు మీద బుక్ చేసి వున్నా ఒక్కరోజులో ఏడెనిమిది పాటలు రికార్డింగ్ చేసిన సంఘటనలు వున్నా - ఆంధ్ర దేశంలో వినిపించే పాటల్లో తొంభైశాతం అతనివే వున్నా-అతనికి గర్వం, పొగరు, ఫోజు లాంటి అదనపు ఆకర్షణలు ఏ రోజునా రాలేదు. ఎప్పుడూ వినయంగా, గౌరవంగా, స్నేహంగానే వుండేవాడు.

వేటూరి, బాలు, చక్రవర్తి... ముగ్గురిదీ చాలా గొప్ప కాంబినేషన్. గోలపాట, గాలిపాట, లాలిపాట, జాలిపాట, గుండెను తాకే జోలపాట... ఏదైనా సరే ఆశువుగా వేటూరి రాసేయటం-అతి తేలికగా చక్రవర్తి ట్యూన్ కట్టెయ్యటం... అనర్గళంగా బాలు పాడేయటం జరిగిపోయేది. ముగ్గురికి కూడా ఒకరంటె ఒకరికి వల్లమాలిన అభిమానం-ఇష్టం వుండేది. కాకపోతే అప్పుడప్పుడు... అలకలు - చిన్న చిన్న అల్లర్లు..

"మా బావ ట్యూన్ కట్టి పూరుకోక.. దిక్కు మాలిన పల్లవి కూడా కూసాడు ఈసారి... మొత్తం పాటంతా ఏడవచ్చుగా..."-సుందర రామ్మూర్తి విసుక్కున్నాడు.

"ఏదో ట్యూన్ కోసం నోటికొచ్చింది అన్నాను బావా.."-తప్పేం కాదుగా అనే ఫేసు పెట్టాడు చక్రవర్తి.

"అనేసి... వినిపించావు... ఆ డైరెక్టర్ గాడు ఆ దిక్కుమాలిన పల్లవికి నన్ను చరణాలు రాయమంటున్నాడు... నా వల్ల కాదు.."- చిరాకుని సుందరంగానే ప్రదర్శించాడు సుందర రామ్మూర్తి.

"అలా అనకు బావా..."- అని బతిమాలాడు చక్రవర్తి.

"నువ్వు తనలోనే ట్యూన్ అను... దరిద్రపు పదాలు పొగెయ్యక.."-సర్దుకుని శాంతించేవాడు సుందరరామ్మూర్తి! ఎంత అందమైన కోప-తాపాలు...!

ఒకరోజు హఠాత్తుగా... క్రాంతికుమార్ ఆఫీసులో "నేను వేషాలు వెయ్యాలనుకుంటున్నా..." అని ఎనౌన్స్ చేసాడు చక్రవర్తి. ఫులిక్కిపడ్డాం చుట్టూ వున్న వాళ్ళం.

"హఠాత్తుగా ఏమయిందిరా నీకూ...?" - క్రాంతి అడిగాడు.

"చెయ్యటానికి టైం లేనన్ని మ్యూజిక్ కమిట్‌మెంట్స్ పెట్టుకుని, కొత్తగా ఇదేం మాయరోగంరా..." నేను అడిగాను.

"నువ్వేం రంగారావ్‌వా... రాజ్‌కపూర్‌వా... అర్జంట్‌గా వేషం వేసేటానికి...

రేపటి రికార్డింగ్ సంగతి చూడు..."-ఇంకొళ్ళెవరో కేకలేశారు. ఆఖరికి అంతా మీదపడి... అసలు అలాంటి ఉద్దేశం ఎందుకొచ్చిందని నిల్దీసి-కూల్దోసి అడగ్గా-

"బావ వేషం వేసేశాడు-బాలు వేషం వేసేశాడు నేనూ వెయ్యాలి.." అన్నాడు.

"తెలిసో-తెలీకో వాళ్ళు వేసేశారు... అంతమాత్రాన... వాళ్ళ తోకలాగ నువ్వెందుకు వెయ్యాలి..."

"వాళ్ళ తోక వేషం కాదు.... మామూలు, మంచి వేషం నేను వెయ్యాలి..." నవ్వుతూనే అన్నాడు.

"సరే... వేషం ఏదైతేనేం... వాళ్ళు వేసినంత మాత్రాన... నువ్వు వెయ్యాలా..."

"మరి ముగ్గురం కలిసి... ఏ హైదరాబాదో, విజయవాడో వెళితే వాళ్ళిద్దర్నీ గుర్తుపడుతున్నారు జనం-నన్ను గుర్తు పట్టడం లేదు..." వుక్రోషంగా చిన్న పిల్లాడిలా అన్నాడు.. అంతా నవ్వేశాం.

'గోపాల్రావుగారి అమ్మాయి'లో ఓ మంచి లాయరు వేషం వేసాడు.

'పక్కింటి అమ్మాయి'లో... బాలుతో పోటీగా పాట-ఆట-నటన అన్నీ చేసాడు.

ఆ తరువాత "రాజా"లో చిన్న వేషం వేశాడు.

దేంట్లోనైనా ది బెస్ట్ అనిపించుకోవాలనే తాపత్రయం వుండేది తనకి. నిజంగానే అనిపించు కునేవాడు.

"చక్రీ... కొత్తగా ట్యూన్ చేసిన ఆ పాట ఓసారి పాడవా..?"

రాత్రివేళ తిలక్‌స్ట్రీట్‌లో... మేడపైన కూర్చున్నపుడు అడిగేవాడ్ని.

"కుశలమా... నీకు కుశలమేనా..." - కృష్ణశాస్త్రిగారి పాట... ఎంత తియ్యటి ట్యూను... ఎంత బాగా పాడేవాడు... అంతా నిశ్శబ్దంగా వినేవాళ్ళం. "ఎక్కడవీ రాగాలూ...."-చీకటి వెలుగులు చిత్రంలోని పాట... ఎంత బాగా వినిపించేవాడో...!

సంగీతంలో.. తను ఎంత పండితుడో నాకు తెలీదు కానీ... మామూలు మనిషిని... తన పాటతో మరిపించేవాడు - మురిపించేవాడు - నవ్వించేవాడు - ఏడిపించేవాడు...

ఎన్ని అద్భుతమైన పాటలు చేసాడు...

"రేపల్లె వేచెను..." 'శారద' సినిమాలో పాట... ఆర్ద్రంగా, దీనంగా, జాలిగా...!

"ఒరే... నేను టీవీ సీరియల్ డైరెక్ట్ చెయ్యాలనుకుంటున్నానురా..."

వాళ్ళింటికి నన్ను పిలిచి చెప్పాడు. అప్పటికే అర్ధాంగిని పోగొట్టుకున్న అతను - గళం పోగొట్టుకున్న గాయకుడిలా దీనంగా అనిపించాడు. "తప్పకుండా... చెయ్యరా... నీకు కాలక్షేపంగా వుంటుంది..." అన్నాను.

"నువ్వు రాసి పెట్టాలి... మెయిన్ వేషానికి బాలుని అడిగాను... వేస్తానన్నాడు.." ఉత్సాహం తెచ్చుకుంటూ అన్నాడు... సరే అన్నాను. కొన్ని రోజులు డిస్కస్ చేసాం. కానీ అది ఎందుకో జరగలేదు. బహుశా అది ఒకటే అతని తీరని కోరిక ఏమో...!

* * *

ఎక్కడో రాలిన ఓ చిన్న చినుకు... నీరై... ఏరై... వరదయి... ముంచేసినట్టు, ఓ నాటి అప్పారావ్... చక్రవర్తి అయి... సంగీత చక్రవర్తి అయి... ప్రతినోట-తన పాట పాడుకునేట్టు చేసి హఠాత్తుగా ఎటో వెళ్ళిపోయాడు...!

చక్రీ... ఎప్పుడైనా... రాత్రివేళ... ఒంటరిగా కూర్చుని... నువ్వు చేసిన అప్పటి పాటలు కొన్ని వింటూంటే... ఎందుకో నువ్వు జాలిగా నవ్వుతున్నట్టు అనిపించి... కళ్ళ నీళ్ళు కదులుతాయి... తేరుకుని చుట్టూ చూస్తే... నువ్వు లేవు-నీ పాట వుంది!

**- సత్యానంద్**
(సినీ రచయిత)

## తెలుగు సినీ గీతకోశం

తెలుగు సినిమా గీతాల 'డాటాబ్యాంక్' తయారు చేయాలని 'హాసం' ఉద్యమిస్తున్నది. దానికి తన సహకారం అందిస్తూ సుమారు 3 వేల పాటల వివరాలను విశాఖపట్టణం నుండి శ్రీ పి.శేషగిరిరావు పంపారు. వాటిలో సినిమా పేరు, సంవత్సరం, పాటపల్లవి, రచయిత పేరు, సంగీత దర్శకుని పేరు పాడిన వారి పేర్లు ఇంగ్లీషులో అకారాది క్రమంలో ఏర్పాటు చేసి పంపారు. ఈ వివరాలను కంప్యూటర్‌లో M.S.Excel లో టైపు చేసి పెట్టుకుంటే - మిస్ అయినవి, కొత్తవి చేర్చి మళ్ళీ అకారాది క్రమంలో పెట్టుకోడానికి అనువుగా ఉంటుంది. మాకు చేరిన సమాచారం యథాతథంగా వచ్చే సంచిక నుండి ప్రతీ సంచికలోను కొద్ది కొద్దిగా ప్రచురించబోతున్నాం. పొరబాట్లు దొర్లినచోట పాఠకులు సూచిస్తే, సవరణలు ప్రచురిస్తాము. ఇదేవిధంగా ఇతర పాఠకులు తక్కిన పాటల సమాచారం కూడా అందిస్తే వీలువెంబడి, క్రమక్రమంగా ప్రచురించడం జరుగుతుంది. ఈ విధంగా కొన్నాళ్లకు సమగ్రమైన పట్టిక తయారవుతుందని 'హాసం' ఆశిస్తున్నది. వచ్చే సంచిక నుండి ప్రారంభం కాబోయే 'గీతకోశం'కై ఎదురు చూడండి.

- ఎడిటర్

## 'హాసం' ఆడియో క్లబ్ డేటా బేస్ కి పాఠకుల నుంచి వచ్చిన ఓ కూపన్

సంస్థ పేరు : స్వర సాధన సంగీత విద్యాలయం    స్థాపించినసంవత్సరం: 1998

ఉద్దేశ్యము : సంగీత శిక్షణ, సంగీతోత్సవాలు, ప్రచారం    సభ్యుల సంఖ్య : 60

అడ్రసు : C/O దేశపతి శ్రీనివాస శర్మ, శుభోదయ విద్యాలయం, కమాన్ వద్ద, సిద్ధిపేట, మెదక్ జిల్లా    పిన్‌కోడ్ నెం:502 103

కార్యనిర్వాహక సభ్యులు
1. ఎజాస్ అహ్మద్ ☎225445
2. డా॥ గాయత్రీ దేవి ☎223095
3. డా॥రమాదేవి ☎223331

సంప్రదించవలసిన వ్యక్తి, (ఫోన్ నెంబరుతో సహా) : దేశపతి శ్రీనివాస శర్మ (08457) 225422    తేదీ:16.01.2003

# చక్రవర్తి హిట్స్

## చిత్రం: ప్రేమాభిషేకం

రచన: దాసరి గానం: బాలు

ప: వందనం అభివందనం నీ అందమే ఒక నందనం
వందనం అభివందనం నీ అందమే ఒక నందనం
నిన్నకు రేపుకు సంధిగ నిలిచిన సుందరీ
పాదాభివందనం పాదాభివందనం...॥2॥

చ: కన్నులు పొడిచిన చీకటిలో అరే దీపపు వెలుగుల్లో
తీరని ఊహల రేవుల్లో తీరం చేరని పడవల్లో
వస్తానని నేను వస్తానని వస్తానని నేను వస్తానని
తలపుల తలుపుకు తనువిచ్చి వలపుల గడపకు నడుమిచ్చి ॥2॥
ఎదురు చూసిన సారిక అభిసారిక... సారీ... ॥వందనం॥

చ: జీవితమన్నది మూడునాళ్ళనీ యవ్వనమన్నది తిరిగిరానిదని
ప్రేమన్నది ఒక నటనమనీ...నీకంటూ ఎవరున్నారని
ఉన్నారని ఎవరున్నారని ఉన్నానని నేను ఉన్నానని
ప్రేమపురానికి సెలవిచ్చి స్వర్గపురానికి దారిచ్చి ॥2॥
సుఖము పోసిన మేనక అభినయ మేనక సారీ... ॥వందనం॥

## చిత్రం: బలిపీఠం

రచన: దేవులపల్లి కృష్ణశాస్త్రి గానం: బాలు, సుశీల

అ: కుశలమా నీకు కుశలమేనా?
మనసు నిలుపుకోలేక
మరీమరీ అడిగాను అంతే... అంతే... అంతే...

ఆ: కుశలమా మీకు కుశలమేనా?
ఇన్నినాళ్ళు వదలలేక,
ఏదో ఏదో వ్రాశాను అంతే... అంతే... అంతే

అ: చిన్న తల్లి ఏమంది?
ఆ: నాన్న ముద్దు కావాలంది
అ: పాలుగారు చెక్కిలిపైన పాపాయికి ఒకటి!
తేనెలూరు పెదవులపైన దేవిగారి కొకటి
ఆ: ఒకటేనా... ఒకటేనా...
అ: ఎన్నెనా... ఎన్నెనా
ఆ: మనసు నిలుపు కోలేక మరీ మరీ అడిగాను
అంతే... అంతే... అంతే... ॥ అ: కుశలమా ॥

అ: పెరటిలోని పూలపొన్న
ఆ: త్వర త్వరగా రమ్మంది
అ: పొగడ నీడ పొదరిల్లో
ఆ: దిగులు దిగులుగా ఉంది
ఎన్ని కబురులంపేనో... ఎన్ని కమ్మలంపేనో...
పూలగాలి రెక్కలపైనా నీలిమబ్బు పాయలపైనా
అందేనా... ఒకటైనా

అ: అందెనులే... తొందర తెలిపెనులే
ఇన్నినాళ్ళు వదల లేక
ఏదో ఏదో వ్రాశాను
అంతే... అంతే... అంతే... ॥కుశలమా॥

## చిత్రం: వేటగాడు

రచన: వేటూరి గానం: బాలు, సుశీల

అ: ఆకుచాటు పిందె తడిసె ॥2॥
కోక మాటు పిల్ల తడిసె ॥ఆకు॥
ఆకాశ గంగొచ్చింది అందాలు ముంచెత్తింది
గోదారి పొంగొచ్చింది కొంగుల్ని ముడిపెట్టింది

ఆ: గోడ చాటు గువ్వ తడిసె
గుండె మాటు గుట్టు తడిసె ॥గోడ॥
ఆకాశ గంగొచ్చింది అందాలు ముంచెత్తింది
గోదారి పొంగొచ్చింది కొంగుల్ని ముడిపెట్టింది

అ: ముద్దిచ్చి ఓ చినుకు ముత్యమై పోతుంటే
చిగురాకు పొదాల సిరిమువ్వలౌతుంటే
ఓ చినుకు నిను తాకి తడియారి పోతుంటే ॥2॥
ఓ చినుకు నీ మెడలో నగలాగ నవుతుంటే

ఆ: నీ మాట విని మబ్బు తెరిచి
జడివాన లే కురిసి కుదిపి
జల్లు తడిసి వెల్లి విరిసి
వలపు సరిగంగ స్నానాలే చెయ్యాలి ॥ఆకు॥

అ: మైమరచి ఓ మెరుపు నిన్నల్లుకుంటుంటే
ఎదలోన ఓ మెరుపు పొదరిల్లు కడుతుంటే
ఓ మెరుపు నీచూపై ఉరిమేసి రమ్మంటే
ఓ మెరుపు నీ నవ్వై నన్నే నమిలేస్తుంటే

అ: నీ పాట విని మెరుపులొచ్చి
నీ విరుపులే ముడుపులిచ్చి
చలిని పెంచి చెలిని పంచి
కలలు వెచ్చంగ తడి అద్దుకోవాలి ॥ఆకు॥

## చిత్రం: మూగప్రేమ

రచన: ఆత్రేయ గానం: సుశీల

ఈ సంధ్యలో కెంజాయలో
చిరుగాలుల కెరటాలలో
ఏ మల్లి మరులెల్ల ఎగబోసెనో
ఏ రాజు ఎదలోతు చవిచూసెనో ॥ఈ సంధ్య॥

ఈ మేఘమే రాగస్వరమో
ఆ రాగమే మూగపదమో
ఈ చెంగు ఏ వయసు పొంగో
ఆ పొంగు ఆపేది ఎవరో
ఎవరో అది ఎవరో రెపరెప ॥ఈ సంధ్య॥

పులకించి ఒక కన్నె మనసు
పలికింది తొలి తీపిపలుకు
చిలికింది అది లేతకవిత
పొదిగింది తనలోని మమత
మదిలో మమతలో
రిమజిమ రిమజిమ ॥ఈ సంధ్య॥

నా కళ్ళలో ఇల్లరికము
నా గుండెలో రాచరికము
నీదేను నీదేను నిజము
నేనుందు నీ లోన సగము
సగమె జగముగా
కలకలకల కిలకిలకిల ॥ఈ సంధ్య॥




# ఇష్క్ బినా...

చిత్రం : తాళ్(1999)
రచన : ఆనంద్‌బక్షీ
సంగీతం : ఎ.ఆర్.రెహమాన్
గానం : అనురాధా శ్రీరామ్, సుజాత, సోనూ నిగమ్, ఎ.ఆర్.రెహమాన్
అభినయం : ఐశ్వర్యారాయ్, అక్షయ్ ఖన్నా, బృందం

ఇష్క్‌బినా క్యా మర్నా యారా, ఇష్క్ బినా క్యా జీనా
గుడ్ సే మీఠా ఇష్క్ ఇష్క్, ఇమ్లీ సే ఖట్టా ఇష్క్
వాదా యే పక్కా ఇష్క్ ఇష్క్, ధాగా యే కచ్చా ఇష్క్ ॥ఇష్క్ బినా॥
నీచే ఇష్క్‌హై, ఊపర్ రబ్ హై
ఇన్ దోనోఁ కే బీచ్ మేఁ సబ్ హై
ఏక్ నహీఁ సౌ బాతేఁ కర్‌లో
సౌ బాతోఁకా ఏక్ మత్‌లబ్ హై
రబ్ సబ్‌సే సోనా ఇష్క్ ఇష్క్
రబ్ సే భీ సోనా ఇష్క్ ॥రబ్ సబ్‌సే॥ ॥ఇష్క్ బినా॥
హీరా నా పన్నా ఇష్క్ ఇష్క్
బస్ ఏక్ తమన్నా ఇష్క్ ఇష్క్ ॥ఇష్క్ బినా॥

ఇష్క్ హైక్యా యే కిస్‌కో పతా, ఇష్క్ హై క్యా సబ్‌కో పతా
యే ప్రేమ్‌నగర్, అన్‌జాన్ డగర్, సాజన్ కా ఘర్, క్యా కిస్‌కో ఖబర్
ఛోటీసీ ఉమర్, యే లంబా సఫర్, యే ఇష్క్ హై క్యా యే కిస్‌కో పతా
యే దర్ద్ హై యా దర్దోఁ కీ దవా, యే కోయీ సనమ్ యా ఆప్ ఖుదా
యే కోయీ సనమ్ యా ఆప్ ఖుదా, ఆప్ ఖుదా ॥ఇష్క్ బినా॥
తుమ్‌నే ఇష్క్ కా నామ్ సునా హై
హమ్‌నే ఇష్క్ కియా హై
ఫూలోం కా గుల్‌షన్ ఇష్క్ ఇష్క్ ॥ఫూలోం కా॥ ॥ఇష్క్ బినా॥

ఎన్నో విజయవంతమైన చిత్రాలను రూపొందించి షోమ్యాన్‌గా పేరు గడించిన సుభాష్‌ఘాయ్ తీసిన తొలి పూర్తిస్థాయి ప్రేమకథా చిత్రం 'తాళ్'. అంతవరకు ఆయన చిత్రాలలో హీరో హీరోయిన్లు మామూలు ప్రేమికులలా వ్యవహరించరు. 'తాళ్' చిత్రంతో సుభాష్‌ఘాయ్ కాలానికి అనుగుణంగా మారి నేటి తరాన్ని కూడా ఆకట్టుకునే చక్కని దర్శకుడనిపించుకున్నారు. కథా పరంగాను, సన్నివేశాలలోను, ఫోటోగ్రఫీలోను, సంగీతంలోను కొత్తదనానికి పెద్దపీట వేసి నేటి యువ దర్శకులకు తాను ఏ మాత్రం తీసిపోనని నిరూపించుకున్నారు.

సుభాష్‌ఘాయ్ చిత్రాలలో సంగీతానికి సముచితమైన ప్రాధాన్యత ఉంటుంది. 'కర్జ్', 'హీరో', 'కర్మా', 'రామ్‌లఖన్', 'ఖల్‌నాయక్' చిత్రాలకు లక్ష్మీకాంత్-ప్యారేలాల్ అందించిన సంగీతం ప్రేక్షకుల్ని ఉర్రూతలూగించింది. 'పర్‌దేశ్' చిత్రానికి నదీమ్-శ్రవణ్ అందించిన సంగీతం కూడా ఎంతో పాపులర్ అయింది. ఇక 'తాళ్' చిత్రానికి సంగీతమే నేపథ్యం. జానపద సంగీతం, ఆ సంగీతాన్ని కమర్షియలైజ్ చేసే మ్యూజిక్ ఇండస్ట్రీ నేపథ్యంలో సాగే ప్రేమకథ ఇది. ఇంత స్కోప్ ఉన్న ఈ చిత్రానికి భారతదేశంలో నంబర్‌వన్ సంగీత దర్శకుడు ఎ.ఆర్.రెహమాన్‌ని ఎంచుకోవటంలో సుభాష్‌ఘాయ్ విజ్ఞత స్పష్టమవుతుంది.



'రోజా' చిత్రంతో దక్షిణ భారతదేశాన్ని ఒక వూపు ఊపిన రెహమాన్, ఆ చిత్రం హిందీలోకి డబ్ చేశాక యావద్భారతదేశాన్ని ఒక ప్రభంజనంలా చుట్టేశాడు. హిందీలో డైరెక్టుగా చేసిన తొలి చిత్రం 'రంగీలా'తో తన స్థానాన్ని సుస్థిరం చేసుకున్నాడు. మణిరత్నం హిందీలో తొలిసారిగా దర్శకత్వం వహించిన 'దిల్‌సే' చిత్రానికి ఆయన అందించిన సంగీతం, చిత్ర విజయాన్ని కూడా అధిగమించి పాపులర్ అవార్డులు గెలుచుకుంది. 'రోజా', 'మిన్సార కణవు' (తెలుగులో 'మెరుపుకలలు, హిందీలో 'సప్నే') చిత్రాలకు జాతీయ అవార్డులు గెలుచుకున్నారు. 'రంగీలా, 'దిల్‌సే' చిత్రాలకు ఫిలింఫేర్ అవార్డులు అందుకున్నారు. ఆయన సినీ జీవితంలో తదుపరి మైలురాయిగా నిలిచిన చిత్రం 'తాళ్'.



'తాళ్'లో కథానాయిక మానసి ఒక జానపద కళాకారుని కూతురు. పట్నం నుంచి వచ్చిన మానవ్ ఆమెను చూడగానే ప్రేమిస్తాడు. ఆమె పెరిగిన వాతావరణం వల్ల అతనికి దూరంగా ఉంటుంది. ఆమె పాడే జానపద



గీతాల్లో ప్రేమ భావాలే ఎక్కువ ఉంటాయి. ఆమె ప్రేమ గురించి పాడుతుందే గానీ తను ఆమెను ప్రేమించి ఆ భావాలతో ఉక్కిరిబిక్కిరి అవుతున్నానని అతను తెలిపే సన్నివేశంలో వచ్చే పాట 'ఇష్క్ బినా'. కవ్వాలి తరహాలో సాగే ఈ పాటలో వారిద్దరూ కళ్ళతోనే ఊసులాడుకుంటారు. అతని ప్రేమ నిజమైనదని ఆమెకు అర్థమవుతుంది. కానీ కొన్నాళ్ళకు కొన్ని పట్టింపుల కారణంగా విడిపోతారు. తరువాత మానసి ఒక మ్యూజిషియన్ సహకారంతో ప్రఖ్యాత గాయని అవుతుంది. కెనడాలో జరిగే ఓ పోటీలో ఆమె 'ఇష్క్ బినా' పాటనే పాడుతుంది. తన హృదయంలో మరుగున పడిన ప్రేమను ఈ పాట మళ్ళీ ఆమెకు పరిచయం చేస్తుంది. అలా వారి ప్రేమకు వారధి అయిన ప్రేమ గీతంగా, ప్రేమ గొప్పదనాన్ని తెలిపే జానపద గీతంగా, అంతర్జాతీయ ప్రేక్షకులను ఆకట్టుకునే ఒక ఇండీపాప్ గీతంగా ఈ పాటను ఎ.ఆర్.రెహమాన్ రెండు వెర్షన్లలో అద్భుతంగా మలిచారు. ఎలాంటి పాటనైనా అలవోకగా రాయగల ఆనంద్‌బక్షీ ఈ పాటను హృదయానికి హత్తుకునేలా రాశారు. ఈ పాటకు ఆయనకు ఉత్తమ గీత రచయిత ఫిలింఫేర్ అవార్డు లభించింది. రెహమాన్‌కు ఈ చిత్రానికి ఉత్తమ సంగీత దర్శకుడిగా మరో ఫిలింఫేర్ అవార్డు దక్కింది.

జానపద గీతంగా మొదలయ్యే ఈ పాటలో మొదట పామరుల భాష, తర్వాత కథా నాయకుడు తన భావాలు చెప్పేటపుడు కొంచెం ఉన్నతమైన భాష ఉపయోగించి ఆ తేడాను చక్కగా చూపించారు ఆనంద్‌బక్షీ. ఇష్క్ అంటే ప్రేమ. మర్‌నా అంటే చావటం. జీనా అంటే బతకటం. గుడ్ అంటే బెల్లం. మీఠా అంటే తీయనిది. ఇమ్లీ అంటే చింతకాయ. ఖట్టా అంటే పులుపు. వాదా అంటే ప్రమాణం, బాస. పక్కా అంటే గట్టిది. కచ్చా ధాగా అంటే బలహీనమైన దారం అని అర్థం. కానీ దాని భావం ఏమిటంటే బలహీనమైన దారాలతో కట్టినా తెగిపోనంతటి గట్టి బంధమని.

'ప్రేమ లేని చావూ ఓ చావేనా
ప్రేమ లేని బతుకూ ఓ బతుకేనా
బెల్లం కన్నా తీయనిది ప్రేమ
చింత కన్నా పుల్లనిది ప్రేమ

ఒట్టిపోని బాస ఈ ప్రేమ
తెగిపోని పాశమీ ప్రేమ'

ప్రేమ లేకుండా జీవించడం, జీవితాన్ని ముగించటం సిగ్గుచేటని మొరటుగా అంటూ అంతలోనే ప్రేమను బెల్లంతో, చింతకాయతో పోల్చటంలో జానపద ఛాయలు చక్కగా కనబడతాయి. పక్కా, కచ్చా అనే విలోమ పదాలు ఉపయోగించి ప్రేమకు వ్యతిరేక అర్థాలు చెప్పినట్టు భ్రమ కల్పించినా ఇక్కడ ప్రేమలోని దృఢత్వాన్నే చెప్పారు. ప్రేమ గురించి అనుభవ పూర్వకంగా తెలుసుకోకుండా కేవలం విని పాడే హీరోయిన్‌కి అతికినట్టు సరిపోయే పద ప్రయోగమిది.



నీచే అంటే కింద. ఊపర్ అంటే పైన. రబ్ అంటే దైవం. బీచ్ మే అంటే మధ్యలో. సబ్ అంటే సర్వం. సౌ అంటే వంద. బాత్ అంటే మాట. మత్‌లబ్ అంటే అర్థం. సోనా అంటే గొప్పది, అందమైనది అని అర్థం. హీరా పన్నా అనే జంట మజ్నూలైలా లాంటి చారిత్రక ప్రేమ జంట. తమన్నా అంటే ఆశ.



'ఇలలో ప్రేమ, దివిలో దైవం
ఈ రెండిటి మధ్యే ఉన్నది సర్వం
ఒకటి కాదు వంద చెప్పండి
ఆ మాటలన్నిటికీ ఒకటే అర్థం
దైవం అన్నిటికన్నా మిన్న
దైవం కన్నా మిన్న ప్రేమ
మజ్నూ లైలా కాదు ప్రేమ
మదిలో మెదిలే ఆశ ప్రేమ'



ప్రేమ దైవానికి ప్రతిరూపమని, దైవం కన్నా గొప్పదని ఇక్కడ చెప్పారు. లైలా మజ్నూ వంటి విషాద ఉదంతాలనే ప్రేమ పర్యవసానంగా భావించకూడదని, మదిలో పుట్టే ప్రేమని అణచకూడదని భావం. ఈ విధంగా పాడుతున్న వారితో హీరోయిన్ కూడా గొంతు కలపటంతో హీరో ప్రేమ గురించి మీకేం తెలుసు అని తన భావాలను చెబుతున్నాడు.

'కిస్‌కో పతా' అన్నా 'కిస్‌కో ఖబర్' అన్నా ఎవరికి తెలుసు అని అర్థం. అన్‌జాన్ డగర్ అంటే తెలియని దారి అని. సాజన్ కా ఘర్ అంటే ప్రియుని ఇల్లు. ఛోటీ సీ ఉమర్ అంటే చిన్న జీవితం. లంబా సఫర్ అంటే సుదీర్ఘ ప్రయాణం. దర్ద్ అంటే బాధ. దవా అంటే మందు. సనమ్ అంటే ప్రియుడు లేదా ప్రేయసి. ఖుదా అంటే దైవం. గుల్షన్ అంటే తోట. కాంటే అంటే ముళ్ళు. దామన్ అంటే ఒడి.

'ప్రేమంటే ఏమిటో ఎవరికి తెలుసు, అందరూ చెప్పేవారే.
ప్రేమనగరమా, అజ్ఞాతమార్గమా, ప్రియవాసమా, ఎవరికి తెలుసు
చిన్న జీవితంలో సుదీర్ఘ ప్రయాణం, ఈ ప్రేమంటే ఎవరికి తెలుసు
ఇది బాధా, బాధకి మందా, ప్రియమైనా మనిషా లేక స్వయంగా దైవమా
నువ్వు ప్రేమ గురించి విన్నావంతే
నేను ప్రేమించి చూశాను
పూలతోట ప్రేమ, ముళ్ళబాట ప్రేమ'

ప్రేమంటే అందరూ చెప్పినంత తేలిక కాదని, ఎన్నో భావాల సమ్మేళనమని అతను అంటున్నాడు. హాయిని, బాధని కూడా కలిగిస్తుంది ప్రేమ. ఆమె తన ప్రేమకు బదులివ్వకపోవటం ఎంతో బాధ కలిగిస్తోందనే భావం వ్యక్తపరుస్తున్నాడు అతను.

ఈ చిత్రంలోని 'తాళ్ సే తాళ్ మిలా' పాటకు అల్కా యాజ్ఞిక్‌కు ఉత్తమ గాయనిగా ఫిలింఫేర్ అవార్డు వచ్చింది. 1999లో ఈ చిత్రంతో పాటు 'హమ్ దిల్ దే చుకే సనమ్' హిట్ అవటంతో హీరోయిన్ ఐశ్వర్యారాయ్ అగ్రతారగా ఎదిగింది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**

---




శ్రీ ఎల్. దీపక్‌రెడ్డి అధ్యక్షుడిగా ఎ.శ్రీశైలం వ్యవస్థాపక కార్యదర్శిగా ఇటీవలే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడుగారి చేతుల మీదుగా ఆవిర్భవించిన 'స్వర్ణాంధ్ర కళాపీఠం' అనే సాంస్కృతిక సేవా సంస్థ 2002వ సంవత్సరానికి తెలుగు అవార్డులను ప్రకటించింది. ఉత్తమ సంగీత దర్శకుడు గా చక్రి (ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు, ఇడియట్), ఉత్తమ గేయ రచయిత గా సిరివెన్నెల సీతారామ శాస్త్రి(ఖడ్గం - టైటిల్ సాంగ్), ఉత్తమ గాయకుడు గా ఆర్.పి.పట్నాయక్(జయం - ప్రియతమా తెలుపుమా...), ఉత్తమ గాయని గా చిత్ర(నువ్వే నువ్వే - నువ్వే నువ్వే కావాలంటుంది) అవార్డులు గెలుచుకోగా, శ్రీ సునీల్ ఉత్తమ హాస్య నటుడు గా(ఆడుతూ పాడుతూ), కోవై సరళ ఉత్తమ హాస్యనటిగా(సందడే సందడి) ఎంపికయ్యారు. ఈ అవార్డులకు ఎన్నికయిన చిత్రాలలో ఉత్తమ చిత్రంగా లాహిరి లాహిరి లాహిరిలో, ద్వితీయ ఉత్తమ చిత్రంగా సంతోషం, తృతీయ ఉత్తమ చిత్రంగా ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు, ఉత్తమ కుటుంబకథాచిత్రంగా ప్రేమలో పావనీ కళ్యాణ్, జాతీయ సమైక్యతను బోధించే చిత్రంగా ఖడ్గం కూడా ఉన్నాయి. అవార్డులకు ఎంపికయిన చిత్రాలలో హాస్యానికి, సంగీతానికి ప్రాధాన్యతనిచ్చే చిత్రాలే ఎక్కువ వుండటం గమనార్హం.

## హిందీ రంగంలో కీరవాణి



పూజాభట్ నిర్మించిన 'జిస్మ్' గత పక్షం విడుదలయింది. సంగీతం కీరవాణి (ఎమ్.ఎమ్.క్రీమ్ పేరుతో) ఆ సంస్థ గతంలో నిర్మించిన 'సుర్' ఫెయిలయినా సంగీత దర్శకుడిగా కీరవాణిని కొనసాగించారు. 'సుర్' సినిమా ఫెయిలయి థియేటర్స్ లోంచి ఎత్తేసినా ఆడియో సేల్స్ పెరిగాయి. కొన్ని వారాలపాటు టాప్ త్రీ పొజిషన్‌లో ఉన్నాయి. అంతే కాదు 'స్క్రీన్' ఎవార్డుల నామినేషన్‌లో 'సుర్' కూడా ఉంది. అందుకే కాబోలు కీరవాణి (ఉత్తమ సంగీతానికి) సంగీత ప్రతిభపై ఆ సంస్థ నమ్మకం కోల్పోలేదు. రాయచూర్ (కర్ణాటక)లో వ్యవసాయం చేస్తూండగా హిందూస్తానీ శాస్త్రీయ నేర్చుకోవడం హిందీ సినిమాలకు పని చేయడంలో కీరవాణికి ఉపకరించింది. గత 14 సంవత్సరాలలో తెలుగు, తమిళ, హిందీ, మళయాళం, కన్నడ భాషలలో 165 సినిమాలకు సంగీత దర్శకత్వం వహించిన కీరవాణి 150 పాటలు పాడడంతో బాటు 40 పాటలను రచించారు కూడా.







విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 40/-

పాట వెనుక నుండే రచయిత, సంగీత దర్శకుడు, గాయనీ గాయకుల పేరిట క్యాసెట్లు వెలువడడం ఆయా కళాకారుల ప్రత్యక్ష విజయానికి సంకేతాలు. కానీ సదరు గీతాల వెనుకనున్న దర్శకుడు, కథకుడు లేదా సంభాషణ రచయిత పేర్న ఓ పధ్నాలుగు పాటలు వెలువడడం పరోక్ష విజయమే కాదు అతి అరుదుగా జరిగే సంఘటన కూడా! తెలుగువారికి గర్వకారణమైన బాపు-రమణ కాంబినేషన్‌తో రూపుదిద్దుకున్న చిత్రాల నుండి ఓ పధ్నాలుగు పాటలను ఎంపిక చేసి 'బాపు - రమణ సినీ హిట్స్'గా ఓ ఆడియో క్యాసెట్‌ను హెచ్.ఎం.వి. వారు తీసుకు వచ్చారు.

శ్రీరామ జయరామ (ముత్యాలముగ్గు - 1975), రామ నీల మేఘ

**(తరువాయి 35వ పేజీలో..)**




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ 80/-

సినీ జగతిలో నలభై వసంతాలను పూర్తి చేసుకున్న వేటూరి సుందరరామ్మూర్తి రాసిన 28 సినీ గీతాలను డబుల్ ప్యాక్ ఆడియోగా హెచ్.ఎం.వి.వారు విడుదల చేశారు.

వీణ వేణువైన (ఇంటింటి రామాయణం - 1979), సిరిమల్లె నీవే (పంతులమ్మ - 1978), రవివర్మకే (రావణుడే రాముడైతే - 1978), సీతాలు సింగారం (సీతామాలక్ష్మి - 1978), నవమినాటి వెన్నెల నీవు (శివరంజని - 1978), కొమ్మ కొమ్మకో సన్నాయి (గోరింటాకు - 1979), మిన్నేటి సూరీడు (సీతాకోక చిలుక - 1981), వీణ నాది (కటకటాల రుద్రయ్య - 1978), తొలిసారి ముద్దివ్వమంది (ఎదురీత - 1963), జాబిలితో చెప్పనా (వేటగాడు - 1979), వాన వెలిసిన వేళ (ఘరానా

**(తరువాయి 35వ పేజీలో...)**

# 'సంబరం'కి 4word

'సంతోషం' సినిమా దర్శకుడు దశరథ్ ప్రస్తుతం 'సంబరం' అనే సినిమాకి దర్శకత్వం వహిస్తున్నాడు. ప్రముఖ దర్శకుడు తేజ ఈ సినిమాకి నిర్మాత. మరొక ప్రముఖ దర్శకుడు యస్వీ కృష్ణారెడ్డి ఈ సినిమాలో ఓ ముఖ్య పాత్రని పోషించటం ఓ విశేషం.

ఈ వార్త వినగానే చాలా మందికి కలిగే సందేహం ఒక్కటే-కృష్ణారెడ్డి లాగే పట్నాయక్ కూడా సంగీత దర్శకుడే ఆయన లాగే ఈయన్నీ ఫోటోజెనిక్ ఫేసే. ఆయన లాగ సినిమాల్లో యాక్ట్ చేయకపోయినా ఈయనకీ కాస్తో కూస్తో నటనానుభవం వుంది. ఇవన్నీ కాక పట్నాయక్ అటు తేజకి ఇటు దశరథ్‌కి అత్యంత సన్నిహితుడు. వీటన్నిటినీ పక్కనపెట్టి దశరథ్-యస్వీ కృష్ణారెడ్డి గారినే ఎన్నుకోవటానికి కారణం ఏమై వుంటుంది!?





"సినిమా చూసిన తర్వాత మీరే ఒప్పుకుంటారు... మా నిర్ణయం కరెక్టని... మేం ఆ నిర్ణయం తీసుకునేటప్పుడు పట్నాయక్ కూడా మాతోనే ఉన్నాడు. తను కూడా కృష్ణారెడ్డి గారయితేనే ఎంతో బావుంటుంది అని అన్నాడు" అని తెలిపారు దర్శకుడు దశరథ్.

"అసలు మేం ఆ నిర్ణయం తీసుకునేటప్పుడు అందరి దృష్టిలో మెదిలింది కృష్ణారెడ్డి గారే...." అని అన్నారు తేజ నిర్ద్వంద్వంగా.

"ఆ పాత్రని పోషించటానికి చెప్పే డైలాగులకు ఓ పెద్దరికం కావాలండీ.... నాకన్న కృష్ణారెడ్డిగారే ఖచ్చితంగా నప్పుతారు" అన్నారు పట్నాయక్ ఎంతో సంస్కారంగా.

ఇక కృష్ణారెడ్డి గారేమన్నారో తెలుసా? "ఈ పాత్ర ద్వారా ఏ మాత్రం మంచి పేరొచ్చినా టోటల్ క్రెడిట్ అంతా ఆ టీమ్‌కే చెందుతుంది."

.... ఇంత మంది క్రియేటివ్ ఇంటలెక్చువల్స్ హస్తవాసితో తయారవుతున్న ఆ పాత్ర, ఆ చిత్రం అందరికీ సంబరాన్ని అందిస్తుందనడంలో 'నిజం' ఉంది.



(34వ పేజీ తరువాయి)

శ్యామా (శ్రీరామాంజనేయ యుద్ధం - 1975), రామయ తండ్రి (సంపూర్ణ రామాయణం - 1972), శివ శివ శంకర (భక్త కన్నప్ప - 1976), నను పాలింపగ (బుద్ధిమంతుడు - 1969), రాయినైనా కాకపోతిని (గోరంత దీపం - 1978), మహాబలిపురం (బాలరాజు కథ - 1970), పలుకే బంగారామాయెరా (అందాల రాముడు - 1973), అంటున్నది రాధ (బంగారు పిచ్చిక -1968), అమ్మకడుపు చల్లగా (సాక్షి - 1967), ఏదో ఏదో అన్నది (ముత్యాల ముగ్గు - 1975), పిరికి మందు తాగి (మనవూరి పాండవులు - 1976), ఎదగడానికెందుకురా (అందాల రాముడు -1973), టాటా వీడుకోలు (బుద్ధి మంతుడు - 1969) మొదలైన పాటలున్నాయి ఈ క్యాసెట్‌లో!

ఈ పాటలన్నీ బాణిముత్యాలే...! ఎన్నిసార్లు విన్నా తనివి తీరని ఈ క్యాసెట్‌లోని పాటలలో శ్రీరామునికి సంబంధించిన పాటలుఎక్కువగా ఉండడం - బాపూ- రమణలకు రామునిపై గల భక్తిని తెలిసినవారికి అంత ఆశ్చర్యంగా ఉండకపోవచ్చు. కానీ 14 ఏళ్ళు అరణ్యావాసం చేసిన రాముడికి, 14 అంకెకి ఏదో లంకె ఉన్నట్టుగా ఈ క్యాసెట్‌లో పాటలు కూడా పధ్నాలుగే ఉండడం కాకతాళీయమే అయినా కాకున్నా కరతాళీయం ఉందని మాత్రం అవును.

(34వ పేజీ తరువాయి)

దొంగ - 1980), ఎల్లువొచ్చి (దేవత - 1982), ఇంద్ర ధనస్సు (గజదొంగ - 1981), కంచికి పోతావా (శుభోదయం - 1980), రాగం తీసే కోయిలా (నాగమల్లి - 1980), వ్రేపల్లియ ఎదఝల్లున (సప్తపది - 1981), వేదం అణువణువున నాదం (సాగర సంగమం - 1983), జిలిబిలి పలుకుల (సితార - 1984), మా ఇంటిలోన (కొండవీటి సింహం - 1981), మనసా తుళ్ళి పడకే (శ్రీవారికి ప్రేమలేఖ -1984), కృషి ఉంటే (అడవి రాముడు - 1977), ఎవరికి తెలుసు (మల్లెపూవు - 1978), సిరిమల్లె పూవా (పదహారేళ్ళ వయస్సు - 1978), అనురాగదేవత నీవే (కుమార రాజా - 1978), నిన్నటి దాకా శిలనైనా (మేఘసందేశం - 1982), ఒక హృదయంలో (కల్పన - 1977), ఆకాశం దించాలా (భక్త కన్నప్ప - 1976), శంకారా నాద శరీరాపరా (శంకరాభరణం - 1979) మొదలైన పాటలున్నయి ఈ క్యాసెట్‌లో.

ఇవన్నీ వేటూరిలోని కవితాత్మను రకరకాల కోణాలలో ఆవిష్కరించే పాటలు. అందుకే పాపులారిటీని పొందడమే కాక పండిత, పామరుల ప్రశంసలను అందు కున్నాయి, అందుకుంటున్నాయి, కుంటాయి కూడా. నిజం చెప్పాలంటే వేటూరి ప్రతిభను తేటతెల్లం చేసే పాటలను ఒక చోట చేర్చగలిగితే '10 ప్యాక్ ఆడియో' కూడా సరిపోదు. అయినా ఇలా డబుల్ ప్యాక్‌గానైనా రావడం మెచ్చుకొనదగ్గదీ...కొనదగ్గదీ!

---

జడ్జి : సాలూరి పూర్ణచంద్రరావు

MAA TV

## మా టీవీ సమర్పించు

## పాడాలనివుంది

సూత్రధారి : యస్పీ బాలసుబ్రహ్మణ్యం

జడ్జి : బాలేష్

### కార్యక్రమాల వివరాలు

### 10వ ఎపిసోడ్-మొదటి రౌండ్ : 1-2-2003

1. వెంకట సతీష్
   - దినకరా శుభకరా (వినాయక చవితి)
   - హాయ్‌రే హాయ్ (సింధూరం)
   - ముద్దబంతి నవ్వులో (అల్లుడుగారు)
2. నాగ సాహితి
   - నగుమోము చూపించవా (అమరశిల్పి జక్కన)
   - మల్లికూయవె గువ్వా (ఇట్లు శ్రావణి సుబ్రహ్మణ్యం)
   - సఖియా వివరించవే (నర్తనశాల)
3. కౌశిక్ కళ్యాణ్
   - మదిశారదాదేవి మందిరమే (జయభేరి)
   - జిగిజిగిజిగిజీ (చెట్టుకింద ప్లీడరు)
   - ప్రేమ ఎంత మధురం (అభినందన)
4. అనూష
   - పాడెద నీనామమే (అమాయకురాలు)
   - కోనసీమ కుర్రదాన్నిరో (నవ్వుతూ బ్రతకాలి)
   - ఎలా ఎలా తెలుపను (నువ్వు లేక నేను లేను)

### 11వ ఎపిసోడ్-మొదటి రౌండ్ : 8-2-2003

1. కృష్ణవేణి
   - బ్రోచేవారెవరురా (శంకరాభరణం)
   - పాండవులు, పాండవులు (అక్కాచెల్లెళ్ళు)
   - ఆకులో ఆకునై (మేఘసందేశం)
2. సుమన్
   - వాగర్థా వివసంప్రుక్తౌ (సాగర సంగమం)
   - మా ఊళ్ళో ఒక పడుచుంది (అవేకళ్ళు)
   - మనసున (లవ్‌బర్డ్స్)
3. లక్ష్మి
   - మరల తెలుపనా ప్రియా (స్వయంవరం)
   - సందమామ కంచమెట్లు (రాంబంటు)
   - ఎలా ఎలా ఎలా (నువ్వు నాకు నచ్చావ్)
4. ప్రవీణ్
   - నీ మధు మురళీగానలీల (భక్త జయదేవ్)
   - నీ నడకలు చూస్తే (టక్కరిదొంగ చక్కని చుక్క)
   - తరలిరాద తనే వసంతం (రుద్రవీణ)

### 12వ ఎపిసోడ్-మొదటి రౌండ్ : 15-2-2003

1. కమలప్రియ
   - నీ దయరాదా రామా (పూజ)
   - హైలో హైలెస్సా హంస కదా (భీష్మ)
   - మదిలో వీణలు మ్రోగే (ఆత్మీయులు)
2. కిరణ్‌కుమార్
   - గున్న మామిడి కొమ్మ మీద (బాలమిత్రుల కథ)
   - ధీంతనక్తరినక్తితోం (సంతోషం)
   - ఎవరికెవరు ఈలోకంలో (సిరిసిరిమువ్వ)
3. జ్యోతి
   - నెమలికి నేర్పిన నడకలివీ (సప్తపది)
   - అసలేం గుర్తుకురాదు (అంతఃపురం)
   - జాణవులే, నెరజాణవులే (ఆదిత్య 369)
4. జి.రాజు
   - పాడాలనే వున్నది (చిల్లర దేవుళ్ళు)
   - పెదవుల్లో పెప్సీకోలా (శ్రీరామ్)
   - పావురానికి, పంజరానికి (చంటి)






విడుదల : బ్లిస్
వెల : రూ 19.99 పై

దాసరి నారాయణరావు దర్శకత్వంలో గజాలా, శ్రీనాథ్ కాంబినేషన్‌లో యం.రవీంద్రబాబు నిర్మాతగా రూపుదిద్దుకున్న 'ఫూల్స్' సినిమా ఆడియో క్యాసెట్ 'బ్లిస్ మ్యూజిక్' ద్వారా విడుదలయింది. ఈ సినిమా కోసం వందేమాతరం శ్రీనివాస్ స్వరపరచిన ఆరు పాటలలో అయిదు పాటలను ఓ ఆరుగురు ప్రముఖ సంగీత దర్శకులు ఆలపించటం ఈ ఆడియోకి చేకూరిన అదనపు ఆకర్షణ.

దాసరి రాసిన 'సౌందర్యమా కలగన్న కాశ్మీరమా' పాటను కీరవాణి, ఉష ఆలపించారు. శివరంజని, మోహన రాగాలను మిశ్రమం చేస్తూ మెలోడీతో పాటను నడిపిన పద్ధతిని చూస్తే టి.వి.రాజు, పెండ్యాల, ఘంటసాల వంటివారు ఈ రాగాలతో ప్రేక్షకుల హృదయాలపై ముద్రించిన వారి శైలి గుర్తు వస్తుంటుంది. కావాలంటే ఈ పాట చరణాలను పదేపదే విని చూడండి. ఇక అనుపల్లవిలోని 'ముళ్ళపూడి కథకు నీవు' అనే వాక్యాలకు సంబంధించి ఇదే పేజీలో గల వివరణ చూస్తే రచయితగా దాసరి రూటే వేరు అని అనిపిస్తుంది.

తైదల బాపు రాసిన 'బస్సు ఎక్కితే కావాలోయ్ బాసు నీకు టిక్కెట్' పాటను చక్రి ఆలపించారు. పాట వింటుంటే ఉదిత్ నారాయణ్ పాడినట్టు వుంటుంది. ఈ విషయమై చక్రిని అడిగితే-"అలా అనిపించటం సహజమే ఎందుకంటే ఆ పాట పాడే టైమ్‌లో నాకు కొంచెం కోల్డ్ ఉంది. పాడుతుంటే నాకే అనిపించింది- ఉదిత్ నారాయణ్ టైప్‌లో వస్తోందని! ఎలాగూ అలా వస్తోందికదాని అదే కంటిన్యూ చేశాను"అని అన్నారాయన. బహుళ ప్రజాదరణకు నోచుకోబోయే ఈ పాట మధ్యమావతి రాగంపై ఆధారపడింది. ఈ పాటకు సంబంధించిన మరో వివరణను కూడ ఇదే పేజీలో చూడవచ్చు.

సుద్దాల అశోక్‌తేజ రాయగా రాధిక, సుధారాణి పాడిన 'ఆకుచాటు పిందెలం' పాటలోని 'తయ్యూం తత్తెయ్యో' వింటుంటే అటు టీవీ సీరియల్ 'శూలం' టైటిల్ మ్యూజిక్, ఇటు 'ఔను వాళ్ళిద్దరూ ఇష్టపడ్డారు' సినిమాలోని 'నూజివీడు సోనియా' పాట ఓపెనింగ్ గుర్తుకువస్తాయి.

దాసరి రాయగా దేవిశ్రీప్రసాద్, స్వర్ణలత పాడిన 'తన్నులు తింటే తిన్నానుగాని..' పాటలో సినీనటుల ప్రస్తావన హుషారుగా తమాషాగా అమిరింది.

దాసరిరాయగా ఆర్.పి.పట్నాయక్, నిష్మ (నాగూరుబాబు సోదరుడు షహీద్‌బాబు కుమార్తె) పాడిన 'అడుగు... అడుగనీ.. మనసు అడుగుతుంటే' పాట వింటుంటే ఇది ఆర్పీ కోసమే ట్యూన్ చేసినట్టనిపిస్తుంది. 'నా అడుగులోన అడుగు వేయటం నీకుఇష్టమేనా' అనే వాక్యం వింటుంటే- పట్నాయక్ తన కోసం తను ట్యూన్ చేసుకున్న పాటల స్టయిల్‌ని వందేమాతరం ఎంత చక్కగా అడాప్ట్‌చేశాడు అనిపిస్తుంది. ఇక గాయనిగా వయసులో చిన్నదైన నిష్మ ఎంతో ఎక్స్‌ప్రెసివ్‌గా పాడింది, 'అడుగుమరి...' అనే పదం రిపీటేషన్‌లో ఆమె ఆ ఎక్స్‌ప్రెసివ్‌నెస్ (భావావిష్కరణ) స్పష్టంగా తెలుస్తుంది.

దాసరి రాయగా వందేమాతరంశ్రీనివాస్, శ్రీలేఖ పాడిన 'ఓయ్.. ఏంటోయ్' పాట టేస్టు ప్లస్ హుషారు సమపాళ్ళలో కలసిన పాట. చిన్నప్పుడు విన్న 'నా బంగారు పుట్టలో వేలుపెడితే కుట్టనా' అనే చీమ కథను ఈ ప్రేమపాట చరణాలకు ప్రేరణగా వాడుకోవటం తమాషాగా బావుంది. ■

# 'ఫూల్స్' పాటల ప్రదర్శన-దాసరి వివరణ

దాసరి నారాయణరావు దర్శకత్వం వహించిన 'ఫూల్స్' సినిమా ఫిబ్రవరి 6న విడుదల కానుంది. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ఆ సినిమాలోని పాటల ప్రదర్శనను ఏర్పాటు చేశారు



దాసరి. 'సౌందర్యమా కలగన్న కాశ్మీరమా/బస్సు ఎక్కితే కావాలోయ్ బాసు నీకు టిక్కెట్/అడుగు అడుగనీ/ఓయ్.. ఏంటోయ్' అనే నాలుగు పాటలను మాత్రం 'హాసం' చూడడం జరిగింది. నాలుగు పాటలూ దాసరి గత వైభవాన్ని పునరావృతం చేసే విధంగా వున్నాయి. పాటల ప్రదర్శన పూర్తయ్యాక దాసరి గారిని 'హాసం' కలిసింది.

"సౌందర్యమా కలగన్న కాశ్మీరమా' అనే పాటలో 'ముళ్ళపూడి కథకు నీవు' అని హీరో అంటే 'కృష్ణశాస్త్రి కవితనౌతా' అని బదులిస్తుంది హీరోయిన్. 'బాపుగారి బొమ్మనౌతా' అని వుంటే బావుండేది కదా... 'కృష్ణశాస్త్రి కవితనౌతా' అని ఎందుకు మీరు రాశారు?" అని అడిగింది 'హాసం'.

"మీరన్నది ఎవరైనా ఆలోచిస్తే తట్టే వాక్యమే! కానీ నేనలా ఆలోచించలేదు. ప్రతి కథకీ ఓ సంభాషణ వుంటుంది. ఆ సంభాషణ కవితాత్మకంగా వుంటే ఎలా వుంటుంది? ముళ్ళపూడి కథకు కృష్ణశాస్త్రి కవిత స్థాయిలో సంభాషణలు వుంటే ఎలా వుంటుంది...? ఆ ఆలోచనే నా చేత అలా రాయించింది" అన్నారు దాసరి కూల్‌గా నవ్వుతూ...



"మరి బస్సు ఎక్కితే కావాలోయ్ బాసు నీకు టిక్కెట్ పాటలో ప్రేమించడానికి నీకు టిక్కెట్టు' ఎవరిస్తారు అని రాయించారు. ప్రేమ అనేది కొనుక్కుంటే దొరికే వస్తువు కాదు కదా టిక్కెట్, టోకెను పెట్టి కొనుక్కోవడానికి? అలా ఎందుకు రాయించారు?"

"నేను చెప్పేది కూడా అదే... ఈ పాటకు ముందు సపోర్టింగ్‌గా ఓ సన్నివేశం వుంటుంది. ఆ సన్నివేశంతో గనక ఈ పాటను చూస్తే అసలీ ప్రశ్నే వుండదు" అన్నారు దాసరి మరింత కూల్‌గా నవ్వుతూ...

రచన: వేటూరి (1) గానం : అభిజిత్, సాధనా సర్గమ్

పనిపగమగపస్స.... పనిపగమగపస్స....
లాల లల లల్లా...లాల లల లల్లా....
అ: నీకు మనసిస్తా నిన్నుపెనవేస్తా
కన్ను చిటికేస్తే కౌగిలికి వస్తా
చెలీ వస్తావా? చెలా యిస్తావా?
ఓ ప్రియా నీ దయా దిల్ దేదియా
ఆ: నీకు మనసిస్తా మాటకలిపేస్తా
కన్నెవయసిస్తా కౌగిలికివస్తా
మొరాలిస్తావా? వరాలిస్తావా?
ఈ ప్రియా నీ దయా దిల్ దేదియా
అ: నీకు మనసిస్తా నిన్నుపెనవేస్తా...
అ: నే ఆగ లేక నీ దారి కాస్తా
నా ప్రేమ లేఖా నీ పేర రాస్తా
ఆ: వేసంగి ఎండలో నా నీడ నీ జతా
సీతంగి మంచులో నీ తోడు కోరుతా
అ: నీవుకీ నేనుకీ మారదీ కథా...
ఆ: నీకు మనసిస్తా మాటకలిపేస్తా
కన్నెవయసిస్తా కౌగిలికివస్తా
అ: చెలీ వస్తావా? చెలా యిస్తావా?
ఓ ప్రియా నీ దయా దిల్ దేదియా
ఆ: నీకు మనసిస్తా మాటకలిపేస్తా
అ: అలలు దాటే కలలు పండిస్తా
పన్నీరు మీద పూలపడవేస్తా
ఆ: పున్నాగ పూలతో సన్నాయి పాడుతా
వెన్నెల్ల తోటలో నా రేయి పంచుతా
అ: జన్మకీ ప్రేమకీ ఒక్కటే కథా...
ఆ: నీకు మనసిస్తా అ :నిన్నుపెనవేస్తా...
ఆ:కన్నెవయసిస్తా అ: కౌగిలికివస్తా
ఆ:మొరాలిస్తావా? అ:చెలా యిస్తావా?



మల్లి జాజి మకరందాలే హాయీ హాయీ...హాయీ...
అ: వచ్చే వాన జల్లు నన్ను గిచ్చేరమ్మని
ఆ: నచ్చే నిన్ను నాకే యిచ్చే జోడీ కమ్మని
అ: పూసే పూలనడిగా గుమ్మతేనే తెమ్మని
ఆ: వాలే తుమ్మెదల్లే వచ్చిపోవా ఝుమ్మని

రచన: వేటూరి (5) గానం: అభిజిత్

వసంతాల ఈ గాలిలో గులాబీ గుబాళింపులు
సరాగాల ఈ సంధ్యలో పరాగాల తబ్బిబ్బులు
ఈవేనాటి క్రీ నీడలో హుషారాల నీరెండలు
కుహుమన్నా ఈ గొంతులో ధ్వనించాయిలే ప్రేమలు
వసంతాల ఈ గాలిలో గులాబీ గుబాళింపులు
సరాగాల ఈ సంధ్యలో పరాగాల తబ్బిబ్బులు
మేఘాల సందేశము ఆ ప్రేమ విరిజల్లులే
సప్నాల సంకేతము ఎదలోని హరివిల్లులే
మైనాల సంగీతము ఈ పూల గంధాలులే
ప్రతి రోజు సాయంత్రము నీవేడి నిట్టూర్పులే
అది శోకమో ఒక శ్లోకమో ఈ లోకమే ప్రేమలే..
వసంతాల ఈ గాలిలో గులాబీ గుబాళింపులు
సరాగాల ఈ సంధ్యలో పరాగాల తబ్బిబ్బులు
ప్రేమించిన కళ్లకు నిదరన్నదే రాదులే
ప్రేమించిన వాళ్లకు ఏ ఆకలికి లేదులే
ఊహల్లో విహారింపులు ఉయ్యాల పవళింపులు
వెన్నెల్ల వేధింపులు వెచ్చందే లాలింపులు
అభియోగమో అనురాగమో పురివిప్పె ఈ ప్రేమలో...
వసంతాల ఈ గాలిలో గులాబీ గుబాళింపులు
సరాగాల ఈ సంధ్యలో పరాగాల తబ్బిబ్బులు
ఈవేనాటి క్రీ నీడలో హుషారాల నీరెండలు
కుహుమన్నా ఈ గొంతులో ధ్వనించాయిలే ప్రేమలు



రచన: రాజశ్రీ (1) గానం: సురేష్ పీటర్, షాహుల్ హమీద్, కుంజారామ్మ

మండపేట మలక్‌పేట నాయుడుపేట బేటరాప్ ॥4॥
నేడేంటి రేపేంటి దినచర్య అదే రాత్రేంటి పగలేంటి మార్పులేదులే
మర్చిపోదామే బాధలు మర్చిపోదామే కోపం వస్తే కొంచం ఆపుకొందామే
అరే గెట్ అప్ అండ్ డాన్స్ ఇక నీదే ఛాన్స్ నీ చేతిలో అన్ని ఉన్నవిరా
తాక్ చిక్ టపాట పాడుదాం
ముందు ఎవరు ముందు ఎవరు ముందు ముందు ముందు ముందు బేటరాప్ ॥4॥
అచ్చంపేట బుచ్చంపేట కొత్త పేట కొబ్బరి మట్ట ॥2॥
హే డబ్బులేంటి గిబ్బులేంటి ఉన్నది ఒక లైఫ్ చాలయ్య దేవుడా నాకు ఒక వైఫ్
తెరిచి వుంచుదాం మనసు తెరిచి వుంచుదాం వచ్చేది ఎవరో వేచిచూద్దాం
అరే నీ కోసం పుట్టింది నీదేరా దొరికింది అందుకోర అంతేరా
జరిగింది జరిగేది అంటే తెల్లవారె తెల్లవారె తెల్ల తెల్ల తెల్లవారే బేటరాప్ ॥4॥
వాటర్ కరెంట్ కళ్ళాపి ప్యాకెట్ పాలు పిల్లలు స్కూలు ఫీజు చెక్కర చమురు రవ్వ రేషన్
పామాయిల్ పచ్చి బియ్యం గోధుమ చాలక చాలక ఉన్న డబ్బులన్నీ చాలక
ఒక్క అణా రెండు అణా హుండి పగల గొట్టీ పావలా అర్ధ అప్పు సొప్పు చేసె ॥ఒక్క అణా॥
చెంబు చాట తాకట్టు పెట్టి ఐదు పది అడుక్కున్న అవసరాలు తీరలేదే ఆళక్కళదే......
మండపేట.....బేటరాప్ అచ్చంపేట.....కొబ్బరిమట్ట
సారాయి ఎండు చిప్ప బీడి ముక్క పండు కప్ప గుడిసె
కుప్పతొట్టి పక్కనే టీ కొట్టు రిక్షా గాలిపటం గాజుపెంకు మాంజా
గూటిబిళ్ళ గోళికాయ గాలిపాట పాడుదాం అగడం జగడం నెమలికి దంతం
సుబ్బరాయుడు సుబ్బలక్ష్మి నర్రా నాగమణి ఎన్.టి.ఆర్. ఏ.ఎన్.ఆర్. చిరంజీవి బాలయ్య
పగలు గిగలు రాత్రి గిత్రి ఆల్ షోస్ హౌస్ ఫుల్లే బేటరాప్.....

రచన: రాజశ్రీ (2) గానం: బాలు, ఉదిత్‌నారాయణ్, పల్లవి, బృందం

అ1: అందమైన ప్రేమరాణి చెయ్యితగిలితే
అ2: సత్తురేకు కూడ స్వర్ణమేలే
అ1: అందమైన ప్రేమరాణి లేత బుగ్గపై
అ2: చిన్న మొటిమ కూడ ముత్యమేలే
అ1: చెమట నీరే మంచిగంధం ఓర చూపే మోక్షమార్గం వయసులా సంగీతమే
అ2: ఊహుఁ... భూమికే భూపాలమే ॥వయసులా॥
అ: అందమైన ప్రేమరాణి ఉత్తరాలలో పిచ్చిరాతలైన కవితలౌనులే
ఆ: ప్రేమ ఎపుడు మనసులోన భేదముండదే ఎంగిలైన అమృతమ్ములే
అ: బొండుమల్లి ఒక్కరూపాయ్ నీ కొప్పులోన చేరితే కోటి రూపాయిలు



స్వచ్ఛయే నీకు లేనప్పుడు స్వర్గమే ఉన్నా ఏం లాభం
ఫిగరుల సందడి లేకుండా క్లాసుకి వెళ్లి ఏం లాభం
ఇరవైలో చెయ్యని అల్లరులు అరవైలో చేస్తే ఏం లాభం

రచన: రాజశ్రీ (6) గానం: బాలు, జానకి

అ: హే ఎరాని కుర్రదాన్ని గోపాల అహ చుర్రుమంది నీ చూపు నాకేలా
కోడి కోసం వచ్చావా గోపాలా దాని బుట్ట కింద దాచాను గోపాలా
పుట్ట తేనే కావాలా గోపాలా దాని ముంతలోన వుంచాను గోపాలా
కో : గోపాల గోపాల రేపల్లె గోపాల
ఆ: కొండంత సింగారమ్మందిస్తా నీయాల రేపల్లే గోపాల ॥కోడి॥
అ: ఈ ఊరి పువ్వు కోసం అమ్మడు ఏరు దాటి వచ్చానే
ఆ: పిల్లవాడి రాకకోసం కళ్ళతో వేచి వేచి చూశానే
అ: ఆయాసం వచ్చేలా ఐదారు కిలోమీటర్లు నడిచానే హాయి హాయి హాయి భలే హాయి హాయిలే
ఆ: ఈ జోరు నీకేలా సందెపొద్దు దాకనువ్వాగలేవా
అ: ఆగలేను నేను గుండెలో ఆగడాలు రగిలే
ఆ: చీకటి పడితే పంచుకో చెంగుచాటు సిరులే
అ: చెలియా నీ దేహం తళ తళ మెరిసే బంగారం
ఆ: అరెరే ఏ నీనోటా కవితలు పలికెను ఎన్నో ॥కోడి॥
ఆ: ఎర్రాని కుర్రదాన్ని గోపాలా అహ చుర్రుమంది నీ చూపు నాకేలా
చక్కాని చుక్కనేను గోపాలా నీకు చిక్కుతాను సై అంటే ఈ యాల
ఆ: బుగ్గమీద ముద్దుపెడితే ఎక్కడో కలిగెను గిలిగింత
అ: చెవిలోన ముద్దుపెడితే అమ్మమ్మ కళ్ళలోన కవ్వింత
ఆ: మావయ్యో మావయ్య సిగ్గుమొగ్గలేసెను లేవయ్యా
కో : లే లే లే లే లే లే సన్నాయి లే లే లే
అ: అయ్యయ్యో అయ్యయ్యో సిత్తరాలు చూసాను నీలోన
ఆ: చికుబుకు రైలే జోరుగా వదిలెను పొగలే
అ: ఎత్తుపల్లమొస్తే నడకలో ఇక తికమకలే
ఆ: అహ హో ఈ పూట కనివిని ఎరుగని యోగం
అ: దొరికే ఈ చోట ఎవ్వరికి అందని స్వర్గం ॥కోడి॥ ॥ఎర్రాని॥

రచన: రాజశ్రీ (7)

ముట్టుకుంటే కందిపోయే ముత్యాల ముద్దుగుమ్మ
రాకుమారిలా నువ్వు కలిమిలో పెరిగావే
మావికొమ్మ వుయ్యాలలో మామ పాడు ఈ పాటతో
మేడ దిగి నాకై వచ్చిన నీలవేణి నిద్దురపో ॥మావి॥

నీ కోసం ననన‌న నా కోసం
అల్లరి చేసే ఆశలైనా అందాలైనీ అందిరాకున్న ఇ॥చలిచలిగా॥
ఇ: మాటలే పొదుపులు మనసుకే అదుపులు
పట్టులో విడుపులు పడుచు ముస్తాబులు
కదలడు సూరీడు కదలికలు రానీడు
ఈ ధ్యానం తొలివలపు ఆహ్వానం
వేసవిగాలి వేణువూది
ఊపిరి కూడా జలదరించేలే ఇ॥చలిచలిగా॥

రచన: వేటూరి **4** గానం:అభిజిత్, సాధనా సర్గమ్

ఆ: సీతాకోక చిలుకల ఇది తొలకరి దాహాలా
మల్లి జాజి మకరందాలే హోయిూ హోయిూ...హోయిూ...
నీతో నాకే వలపుల సిరిసొగసరి మోహాల
చుమ్మాకోరే సుమగంధాలే హోయ్...హోయ్ హోయ్..
వచ్చే వాన జల్లు నన్ను గిచ్చే రమ్మని
నచ్చే నిన్ను నాకే యిచ్చే జోడీ కమ్మని
పూసే పూలనడిగా గుమ్మతేనే తెమ్మని
వాలే తుమ్మెదల్లే వచ్చిపోవా ఝుమ్మని ॥సీతాకోక॥
ఆ: కంటికి నిదురే రాక ముందే తుంటరి పనులు చూసుకుంటా నిన్నే...
అ: వంటిగా నదులే వయసులోన జంటను వెదికే కౌగిలింత నేనే...
ఆ: పరువాన రేగిన జడివాన ఆగిన
అ: గొడుగేల లాలనా ఒడిలోకి చేరనా
ఆ: అహా...అహా... ॥సీతాకోక॥
ఆ: ఈదురుగాలి ఈడుకొస్తే వెన్నెల కాస్త ఏడిపిస్తే వానా
అ: కిన్నెరసాని కినుకుమంటే కన్నెల రాశి కులుకుతుంటే మీనా....
ఆ: విరజాజి సందులో విరివాన చిందులో
అ: పొరపాటు పొందులో తెరచాటు విందులో ఆ:అహా...అహా...
అ: నీతో నాకే వలపుల సిరిసొగసరి మోహాల
చుమ్మాకోరే సుమగంధాలే హోయ్...హోయ్ హోయ్..
ఆ: సీతాకోక చిలుకల ఇది తొలకరి దాహాలా



ఆ: ఓ ప్రియా అ: నీ దయా
ఇ: దిల్ దేదియా

రచన: వేటూరి **2** గానం : కె.కె

మళ్ళీజన్మిస్తా మళ్ళీజన్మిస్తా
నువ్వు నేను ఏకం అయ్యేదాకా.. మళ్ళీజన్మిస్తా
మళ్ళీప్రేమిస్తా మళ్ళీప్రేమిస్తా
నీకై పుట్టి నిన్నే చేరేవరకు నిన్నే ప్రేమిస్తా
ఓహో ప్రియా ఈ మధు ఉదయంలో ఇదేలే నా బాస
ప్రియా ప్రియా నీ సమాజమందు ఇదేలే నా ఆశ ॥మళ్ళీజన్మిస్తా॥
నీ శ్వాసలో ఊపిరాడాలి నాకు పొత్తిళ్లలో పాపలా
నీ పాపలా ఊయలూగాలి నేను కౌగిళ్లలో ప్రేమలా
స్నేహమల్లే సాగిపోయే దాహమేదో రేగేనాలో
చిన్ని చిన్ని ఆశలు నావే ప్రియా ...ప్రియా...ప్రియా
ఓ మైలవ్.. హో మైలవ్... ॥మళ్ళీజన్మిస్తా॥
మా అమ్మవై రూపమివ్వాలి నాకు నాకంటికే చూపుగా
ఏజన్మకు తోడు కావాలి నువ్వు చుక్కా నా చుక్కానిలా
బంధమేదో పెరిగేవేళ బ్రతుకు తరిగే ఈ వేళ
నా నేప్రేమవు నీవేప్రియా...ప్రియా...పియా... ॥మళ్ళీజన్మిస్తా॥
నువ్వు నేను ఏకం అయ్యేదాకా.. మళ్ళీజన్మిస్తా ...మళ్ళీజన్మిస్తా..మళ్ళీజన్మిస్తా...

రచన: వేటూరి **3** గానం:కె.కె. ,సౌమ్య

ఒహో లాలల ఒహోలాలల...
అ: చలి చలిగా ముసిరేందేదో అనుభవం
తొలకరిగా నీతో జరిగే పరిచయం
కనులలో జాబులు చదివిన చూపులు
తొలిప్రేమో ఏమో...ఏమో... ఇ: ॥చలిచలిగా॥
ఇ: మనసులో గానము మనకిలా మౌనము
కలుసుకోవాలని కలలపోరాటము
గుసగుసలెన్నెన్నో తనువులిక నోనోనో



ఈ పూట చెలి నా మాట ఇక కరువై పోయెనులే
అధరము ఉదరము నడుమను ఏదో అలజడి రేగెనులే
వీక్షణలో నిరీక్షణలో మరుక్షణమొక యుగమేలే
చూపులన్ని వెంటాడినట్టు మది కలవర మాయెనులే
ఇది స్వర్గమా నరకమా ఏవిటొ తెలియదులే
ఈ జీవికి జీవన మరణము నీ చేతిలో ఉన్నదిలే ॥ఓ చెలి॥
కోకిలమ్మా నువు సైయ్యంటే నే పాడెను సరిగమలే
గోపురమా నిను చేరుకొని సవరించేను నీ కురులే
వెన్నెలమ్మా నీకు జోలపాడి కాలి మెటికలు విరిచేనే
వీచేటి చలి గాలులకు తెరచాపై నిలిచేనే
నా ఆశల ఊసులే చెవిలోన చెబుతానే
నీ అడుగుల చెరగని గురుతులే ప్రేమ చరితలు అంటానే ॥ఓ చెలి॥

రచన: రాజశ్రీ **5** గానం: షాహుల్ హమీద్, ఎ.ఆర్.రెహమాన్, సురేష్ పీటర్

ఊర్వశీ ఊర్వశీ టేకిటీజీ ఊర్వశీ
పూసలాగ ఒళ్ళు ఉంటే ఎందుకంటా ఫార్మసీ ॥ఊర్వశీ॥
గెలుపుకీ సూత్రమె టేకిటీజీ పాలసీ
నింగిలో మెరుపులా యవ్వనం ఒక ఫాంటసీ ॥ఊర్వశీ॥
ఓ చెలీ తెలుసా తెలుసా తెలుగు మాటలు పదివేలు
అందులో ఒకటో రెండో పలుకు నాతో అది చాలు ॥గెలుపుకీ॥
చిత్రలహరిలో కరెంటుపోతే టేకిటీజీ పాలసీ బాగ చదివి ఫెయిలయిపోతే టేకిటీజీ పాలసీ
తిండి దండగని నాన్న అంటే టేకిటీజీ పాలసీ
బట్టతలతో తిరుపతి వెళితే టేకిటీజీ పాలసీ ॥ఊర్వశీ॥
ఓ చెలి తెలుసా తెలుసా జీవనాదులు ఎన్నెన్నో
తెలుపవే చిలకా చిలకా ప్రేమనాడి ఎక్కడుందో ॥గెలుపుకీ॥
చూపుతో ప్రేమే పలకదులే కళ్ళతో శీలం చెడిపోదే
మాంసమే తినని పిల్లుందా పురుషులలో రాముడు ఉన్నాడా
విప్లవం సాధించకపోతే వనితకు మేలే జరగదులే
రుద్రమకు విగ్రహమే వుంది సీతకు విగ్రహమే లేదే
స్కాచ్‌కొట్టి కూడా పడలేదంటే టేకిటీజీ పాలసీ పక్కసీటులో అవ్వే వుంటే టేకిటీజీ పాలసీ
సండే రోజు పండగ వస్తే టేకిటీజీ పాలసీ
నచ్చిన చిన్నది అన్నా అంటే టేకిటీజీ పాలసీ ॥ఊర్వశీ॥
పగలు నిన్ను చూడని కన్నెలకు రాత్రిలో కన్నుకొట్టి ఏం లాభం



ఆ: పీచు మిఠాయి అర్ధరూపాయ్
నువ్వు కొరికి యిస్తే దాని విలువ లక్షరూపాయ్‌లు ॥అంద॥
ఆ: ప్రేమ ఎపుడు ముహూర్తాలు చూసుకోదులే రాహుకాలం కూడా కలిసి వచ్చులే
అ: ప్రేమ కొరకు హంసరాయబారమేలనే కాకి చేత కూడ కబురు చాలులే
ఆ: ప్రేమజ్యోతి ఆరిపోదే ప్రేమబంధం ఎన్నడూ వీడిపోదె
అ: ఇది నమ్మరానిది కానె కాదె ఈ సత్యం ఊరికి తెలియలేదె
ఆ: ఆకసం భూమి మారినా మారులే కానీ ప్రేమ నిత్యమే
ఆదిజంటా పాడినా పాటలే ఇంకా వినిపించులే
ప్రేమా తప్పు మాటని ఎవ్వరైన చెప్పినా నువ్వు బదులు చెప్పు మనసుతో
ప్రేమా ముళ్ళ బాటకాదు వెళ్ళవచ్చు అందరూ నువ్వు వెళ్ళు నిర్భయమ్ముగా

రచన: రాజశ్రీ **3** గానం: మనో, స్వర్ణలత

అ: ముక్కాలా ముక్కాబులా లైలా ఓ లైలా ముక్కాబులా చుక్కానిలా లైలా ఓ లైలా
ఆ: లవ్వుకి కాపలా పరువాల తుపాకులా
శృంగార వీరుల సింధూర పువ్వులా
మత్తుజల్లే మంచు వెన్నెలా ఓలేలో ॥ముక్కాలా॥
ఆ: జురాసిక్ పార్కులోన సరదాగ జోడిలే క్లాస్ మ్యూజిక్ నేడే పాడేను
అ: పికాసో చిత్రం నన్ను వెంటాడే చిత్రంగ టెక్సాస్‌లో నాతో ఆడేను
ఆ: కౌబాయి కన్ను కొడితే ఫ్లే బాయి చెయ్యే పడితే ఒళ్లంతా సెక్సయ్యింది గుండెల్లో ఫిక్సయ్యింది
అ: పాప్ మ్యూజిక్ థ్రిల్లయ్యేను స్టార్ బేబి కళ్ళయ్యేను లవ్‌స్టారై ఊరించేను పిచ్చెక్కి ఊగించేను
ఆ: మన ప్రేమ గీతమే ప్రతినోట పలకాలా ॥ముక్కాలా॥
తుపాకి లోడుచేసి గురిపెట్టికాల్చిన హృదయాలు గాయపడునా
అ: తిమింగలాలు పట్టే వలతెచ్చివేసిన ఆ నింగి చుక్కలు చిక్కేనా
ఆ: భూకంపం వస్తే ఏంటి భూగోళం పోతే ఏంటి
ఆకాశం విడిపోతుందా ఏవైనా రెండవుతుందా
అ: రావే నా రాజహంస రతనాల మణిపూస జింకల్లే చిందులెయ్యి సందేల విందుచెయ్యి
ఆ: సంతోష మెన్నడూ సాగరమై సాగదా ॥ముక్కాలా॥

రచన: రాజశ్రీ **4** గానం: ఉన్నికృష్ణన్, బృందం

ఓ చెలియా నా ప్రియసఖియా చెయి జారెను నా మనసే
ఏ చోట అది జారినదో ఆ జాడే మరచితినే
నీ అందెలలో చిక్కుకుంది అనీ నీ పదముల చేరితినే
ప్రేమంటే ఎన్ని అగచాట్లో మన కలయిక తెలిపినదే
నా గుండెలలో ప్రేమ పరవశమై ఇరు కన్నులు సోలెనులే ॥ఓ చెలి॥

NIMBUS MOTION PICTURES presents

# ఇది... మా అశోగ్గాడి లవ్ స్టోరీ

A SURESH KRISSNA FILM

హరీష్ తవాని  ఆకాష్ ఖురానా  ఆనంద్-మిలింద్  వేటూరి  ప్రవేష్ సిప్పి  జి.వి.జి.రాజు

## తారాగణం

శివబాలాజీ, మనోజ్, కాంచికౌల్, శ్వేత, చంద్రమోహన్, సుబ్బరాయశర్మ, అనంత్, ఉత్తేజ్, శివారెడ్డి, చిట్టిబాబు, జూనియర్ రేలంగి, ముక్కురాజు, జెన్ని, సదాబ్, వైజాగ్ ప్రసాద్, తిలక్, సుధ, సన, హిందు ఆనంద్, శిరీష, స్వేత

వేటూరి  ఆనంద్- మిలింద్  సురేష్‌కృష్ణ

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మూలకథ | : ప్రవేశ్ సిప్పి, ఠాగూర్ |
| స్క్రీన్‌ప్లే | : గోపీబాబు, పోసాని కృష్ణమురళి, సురేష్ కృష్ణ |
| మాటలు | : పోసాని కృష్ణమురళి |
| పాటలు | : వేటూరి |
| సంగీతం | : ఆనంద్ - మిలింద్ |
| కెమెరా | : ప్రతాప్ |
| ఆర్ట్ | : ఆనంద్ సాయి |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె.వెంకటేష్ |
| నృత్యం | : బృంద |
| పబ్లిసిటీ | : ధని ఏలె |
| పి.ఆర్.ఓ. | : వేణుగోపాల్ |
| ఫైట్స్ | : శ్రీను |
| కాస్ట్యూమ్స్ | : సాయి |
| మేకప్ | : సుధాకర్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : ప్రవేశ్ సిప్పి, జి.వి.జి.రాజు |
| నిర్మాతలు | : ఆకాశ్ ఖురానా, హరీష్ తవాని |
| దర్శకత్వం | : సురేష్ కృష్ణ |



## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| కలర్స్ | : ప్రసాద్ ఫిల్మ్ లేబరేటరీస్ |
| సాంగ్ రికార్డింగ్ థియేటర్ | : పంచతన్ రికార్డ్ ఇన్ |
| డబ్బింగ్ థియేటర్ | : పల్లవి ఆర్ట్స్ |
| పబ్లిసిటీ డిజైన్స్ | : లంక భాస్కర్ |
| ప్రెస్ పబ్లిసిటీ ఇన్‌చార్జ్ | : జగన్ |
| ఆఫీస్ అకౌంటెంట్ | : జి.యస్.ఆచారి |
| మేనేజర్స్ | : కె.రాఘవ, పి.రాము |
| నిర్వాహకులు | : జె.రామచంద్రరావు, ఎస్.శ్రీనివాసరావు |
| నిర్మాణ నిర్వాహణ | : రఘురామ్.ఎ. |

గానం: ఎస్.పి.బాలు, మనో, ఉదిత్‌నారాయణ్, సురేష్ పీటర్స్, ఉన్నికృష్ణన్, ఎ.ఆర్.రెహమాన్, జయచంద్రిక, యస్.జానకి, సుజాత, స్వర్ణలత, మినిమిని, నశంద, యస్.పి.బి.పల్లవి.

| | |
|---|---|
| పాటలు-మాటలు | : రాజశ్రీ |
| డాన్స్ | : రాజా-సుందరం |
| ఫైట్స్ | : విక్రమధర్మా |
| ఎడిటింగ్ | : బి.లెనిన్, వి.టి.విజయన్ |
| డైరెక్టర్స్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : జీవా |
| సంగీతం | : ఎ.ఆర్.రెహమాన్ |
| నిర్మాత | : సూర్యామూవీస్ |
| కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం | : శంకర్ |

పాఠక పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.

# ప్రేమికుడు

TAKE IT EASY

## తారాగణం

ప్రభుదేవా, నగ్మా, అల్లురామలింగయ్య, ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం, రఘువరన్, గిరీష్ కర్నాడ్, అజయ్‌రత్నం, వడివేలు, పద్మప్రియ, చిత్ర, కవిత , మనోరమ

ఎ.ఎం.రత్నం  ఎ.ఆర్.రహమాన్  శంకర్  రాజశ్రీ




పుట్టినరోజు అనగానే శుభాకాంక్షలు, ఇంటర్వ్యూలు ఇవన్నీ సినీ కళాకారుల విషయంలో చాలా రెగ్యులర్‌గా జరిగేవే...

ఒక హాస్య నటుడి పుట్టిన రోజున అతణ్ణి తక్కిన హాస్య నటులు కొన్ని ప్రశ్నలు వేస్తే, వాటికి ఆయన సమాధానమిస్తే ఎలా వుంటుంది...!?

ప్రతిరోజూ షూటింగుల్లో కలుసుకుంటూ మాట్లాడుకుంటూనే వున్నా పత్రికాముఖంగా వచ్చే ప్రశ్నలనేసరికి వాళ్ళేరకమైన ప్రశ్నలు అడుగుతారు-వాటికీయన ఏరకంగా సమాధానమిస్తారు..!?

ఈ ఆలోచనలకు రూపకల్పనే పక్క పేజీలలోని ప్రశ్నలు, సమాధానాలు...

ఫిబ్రవరి 1 శ్రీ బ్రహ్మానందం పుట్టినరోజు సందర్భంగా-(సమయాభావం వలన అందుబాటులో ఉన్న కొంతమంది హాస్యనటులను (మాత్రమే) కలిసి ఈ రూపకల్పనకు సహకరించమని 'హాసం' అడిగింది.

హాసం తరపున ప్రశ్నించిన హాస్య నటులకు, కలవలేకపోయినా ఏమీ అనుకోకుండా అభినందించిన హాస్య కుటుంబంలోని తక్కిన నటీనటులకు కృతజ్ఞతలు.

## ఎల్.బి.శ్రీరామ్ ప్రశ్నలకి బ్రహ్మానందం జవాబులు



**ప్ర:** అన్నగారూ.. ఇరవై ఏళ్ళ అలుపెరుగని మీ హాస్యం వెనుక రహస్యం ఏమిటి?

**జ:** కష్టపడి పని చెయ్యడమే! ఇచ్చిన క్యారెక్టర్ మంచిదా చెడ్డదా అని ఆలోచించడం కంటే దానికి న్యాయం చేకూర్చడమే నాకు తెలిసిన పద్ధతి... ఇది నేనెప్పుడూ రహస్యంగా వుంచలేదు. అందరికీ తెలుసు.

**ప్ర:** మొన్నామధ్య ఓ షూటింగ్‌లో ఎనభై ఏళ్ళ పెద్దాయన 'నువ్వు తెనాలి రామలింగడి వంటివాడవయ్యా' అని అభినందించినప్పుడు మీ అనుభవం ఏమిటి?

**జ:** ఎం.ఎ. తెలుగు లిటరేచర్ చదివి లెక్చరర్‌గా పనిచేసిన నాకు ఆ మాట వినగానే గుండెల్లో చక్కిలిగిలి పెట్టినట్టనిపించింది.

**ప్ర:** కాస్తవృద్ధిలోకొస్తున్న వారెవరిని చూసినా భుజం తట్టి 'ముందు ఇల్లు కట్టుకో తమ్ముడు' అని మీరంటుంటారు. ఈ జీవిత సత్యం వెనుక నున్న మీ అనుభవం ఏమిటి?



**జ:** బ్రతుకంతా నవ్వించేవాడు రోడ్డున పడకూడదు. ఆర్టిస్టులుగా ఒక వెలుగు వెలిగి చివరి రోజుల్లో ఎంతో దయనీయంగా బ్రతికిన వాళ్ళు ఘోరంగా చనిపోయిన వాళ్ళు ఎంతోమంది మనకు తెలుసు. 'సొంతిల్లంటూ ఒకటుంటే-మనం పంచభక్ష్య పరమాన్నాలు తింటున్నామో పస్తులుంటూ మంచినీళ్ళు తాగి పడుకుంటున్నామో ప్రపంచానికి తెలీదు' అని మా నాన్నగారు అనేవారు. బహుశా ఇవన్నీ కలిసిన అనుభవమే అయి వుంటుంది.

## ఎమ్.ఎస్.నారాయణ ప్రశ్నలకు బ్రహ్మానందం జవాబులు

**ప్ర:** ఉదయం నుండి రాత్రి వరకు ఎప్పుడు చూసినా మీరు ఏవో జోకులు వేస్తూ, సూక్తులు చెబుతూ, అందర్నీ అలరిస్తూ నాన్‌స్టాప్‌గా గొంతుకి విశ్రాంతి లేకుండా మాట్లాడుతూనే వుంటారు. ఇన్నేళ్ళ నా పరిశీలనలో ఒక్కరోజు కూడా మీకు వాయిస్ ట్రబులిచ్చిందనిగాని, డబ్బింగ్ మీ కారణంగా పోస్ట్‌పోన్ అయిందని గాని నేను వినలేదు. ఈ విజయ రహస్యం ఏమిటి?



**జ:** ఇది నన్నడిగితే నేనేం చెప్తాను? గొంతు నాది కానీ ట్రబులివ్వడం ఇవ్వకపోవటం నా చేతిలో ఏం వుంది!? నన్ను ఏ డాక్టర్ దగ్గరికైనా తీసుకెళ్ళి టెస్ట్ చేయిస్తే ఆయనైనా ఏమైనా చేప్తాడేమో!? సరదాగా... మనలో మాటగా చెప్పుకోవాలంటే నాకు గొంతెమ్మ కోరికలేవీ లేవుగా.... అంచేతై ఉండొచ్చు.

**ప్ర:** ఎవరిలో ఏ మంచి కనిపించినా అతగాడు భవిష్యత్తులో మనకి పోటీ అయిపోతాడేమోనన్న భయం కూడా లేకుండా అతని గురించి నాలిక భుజానేసుకుని తెగ ప్రచారం చేస్తూంటారు! ఈ సంస్కారం మీకెలా అబ్బింది?



**జ:** మంచి విషయాలకి స్పందించటం మానవుడికి సహజంగా వచ్చే లక్షణం. ఆ లక్షణాన్ని అణుచుకొని లెక్కలేసుకుంటూ బతికితే ఎలా? జీవితం ఎక్కాల పుస్తకం కాకూడదు, పెద్ద బాలశిక్ష కావాలి. 'ఇతను బాగా చేస్తున్నాడు' అని జంధ్యాల గారు అనుకోకపోతే-'ఇతను బాగా చేస్తాడు' అని చిరంజీవి గారు పరిశ్రమలోని ప్రతివారికీ చెప్పకపోతే ఇవాళ ఈ బ్రహ్మానందం ఎక్కడ వుండేవాడు!?

## ధర్మవరపు సుబ్రహ్మణ్యం ప్రశ్నకు బ్రహ్మానందం జవాబు

**ప్ర:** బ్రహ్మన్నా... ఎప్పుడు చూసినా పెద్ద ఆడంబరంగా కనిపించవు. ఇంట్లో కూడా చాలా సింపుల్‌గా ఉంటావు. ఒక్కొక్కసారి పిల్లలతో మాట్లాడుతూ నేల మీదే అలా పడుకుండిపోతావు. ఇంత సింపుల్ లైఫ్ నీకెలా అలవాటయింది. కారణం ఏమిటి?

**జ:** పుట్టుకతో శ్రీమంతుణ్ణి కాదు. ఇదంతా మధ్యలో వచ్చిందే! ఇదిగో... ఇలా మాట్లాడితే ఫిలాసఫర్ అంటారు. ఫిలాసఫీ ఈజ్ నాట్ సెపరేట్ ఫ్రమ్ ట్రూత్. భార్యా పిల్లలతో, బంధువుల్తో, మనవలు, మనవరాళ్ళతో హాయిగా గృహ ప్రవేశం చెయ్యడానికి వెళ్ళిన కన్నడ కంఠీరవ రాజ్‌కుమార్ గృహప్రవేశం చెయ్యకుండా అరణ్యవాసం చేశాడు. ఈజిట్ ఫిలాసఫీ ఆర్ ట్రూత్...!?



## భరణి ప్రశ్నలకు బ్రహ్మానందం జవాబులు

**ప్ర:** మళ్ళీజన్మలో పక్షిగా పుట్టాల్సివస్తే ఏ పక్షిగా పుడదామనుకుంటున్నారు? ఎందుకు?

**జ:** ఏ పక్షికైనా సరే గూడు కట్టుకునే స్వభావం వుంటుంది. జన హృదయంలో శాంతికి నిర్వచనంగా శాశ్వతమైన గూడును కట్టుకున్న పావురాయి జన్మంటే నాకిష్టం. (మనలో మన మాట.... అక్కుపక్షి, దిక్కుమాలిన పక్షి, శకునపక్షి లాంటి జన్మలు అసలొద్దు బాబోయ్)

ప్ర: జంతువుగా అయితే ఏ జంతువుగా... ఎందుకు?



జ: ఇక జంతువు జన్మ అయితే... కుక్కగానే పుట్టాలని కోరుకుంటాను. కృతజ్ఞతలేని శవాన్ని కుక్కయినా ముట్టదని తిక్కన కవి మహాభారతంలో రాశాడు. కృతజ్ఞత, విశ్వాసాలకు పరాకాష్ట శునకం.

ప్ర: మనిషిగా అయితే ఎవరిగా...ఎందుకు?

జ: ఇక మనిషి జన్మంటూ ఉంటే... 'ఏ కళ్ళలో దయాగుణం కనిపిస్తుందో ఆ కళ్ళు కలిగిన ప్రతిజీవి అందమైనదే' అని చెప్పిన-మదర్‌థెరిసాగా పుట్టాలన్నది నా ఆశ.

## ఏ.వి.యస్. ప్రశ్నలకు బ్రహ్మానందం జవాబులు

ప్ర: ఏ పుణ్యమా అని కమేడియన్స్‌కి స్టార్ ఇమేజ్ వచ్చింది. ఆ ఇమేజ్‌ని కాపాడుకోవటంలో నేటి కమేడియన్స్ ఎంత వరకు కృతకృత్యులౌతున్నారు? తెలుగులో కమేడియన్ల స్టార్ ఇమేజ్‌కి పరిశ్రమ ఎంత వరకు ప్రాధాన్యతనిస్తోంది?



జ: అందరూ కృతకృత్యులౌతున్నట్టే...! పరిశ్రమ మనకి ప్రాధాన్యత ఇవ్వబట్టేగా ఇమేజ్ అన్న పదం వచ్చింది. ఇంకొక మాట ఏమిటంటే కమెడియన్స్ లేకుండా సినిమా తియ్యొచ్చు కానీ కామెడీ లేకుండా సినిమా తియ్యలేరు. కామెడీకి ప్రాధాన్యత ఇస్తే మనకి ఇచ్చినట్టే . ఎలా చూసినా మనకి ప్రాధాన్యత ఇచ్చినట్టే లెక్క.

ప్ర: తెలుగులో వున్నంత మంది కమేడియన్స్ ఇంకెక్కడా లేరంటారు. ఇది అడ్వాంటేజా? డిస్ అడ్వాంటేజా?

జ: తెలుగు, హిందీ, తమిళం, మలయాళం అనే కాకుండా అన్ని భాషల్లోనూ ఎంత ఎక్కువమంది కమెడియన్స్ ఉంటే అంత మంచిది. దాని రిజల్టు కూడా అంత బావుంటుంది. ఎవరికి తోచిన రీతిలో వారు నవ్విస్తారు. టోటల్‌గా ప్రేక్షకులంతా నవ్వుతారు. ప్రేక్షకులంతా నవ్వుతూ ఉండాలనే ఏ కమెడియనైనా సరే కోరుకోవాలి. కనుక ఎక్కువమంది ఉండడం అడ్వాంటేజే!

## ఆలీ ప్రశ్నకు బ్రహ్మానందం జవాబు

ప్ర: లైఫ్‌లో ఎదురయ్యే అప్స్ అండ్ డౌన్స్‌ని తట్టుకుంటూ ఇంత బాలన్స్ ఆఫ్ మైండ్‌తో ఉండటం మీకెలా వచ్చింది?



జ: లైఫ్ అంటేనే అప్స్ అండ్ డౌన్స్... జీవితాన్ని జీవిస్తూ 'ఈ అప్స్ అండ్ డౌన్స్ ఏంటి' అని అనుకుంటే ఎలా!? అంచేత సుఖమైనా కష్టమైనా ఒకేలా స్వీకరించగల సాధనను మనసుకి అలవాటు చెయ్యాలి. ఆ అలవాటు బాలెన్స్ ఆఫ్ మైండ్ రావడానికి తోడ్పడుతుంది. "లైఫ్‌ని ఈజీగా తీసుకుంటేనే ఇంత డిఫికల్ట్‌గా ఉందే... సీరియస్‌గా తీసుకుంటే ఇంకెంత దారుణంగా వుంటుందో" అని దర్శకులు రాఘవేంద్రరావు గారు ఓసారన్నారు. ఆ మాటల్లో ఎంత డెప్త్ ఉంది!? ఇవన్నీ మెంటల్ బాలెన్స్ రావటానికి ఉపయోగపడతాయి.

## సునీల్ ప్రశ్నకు బ్రహ్మానందం జవాబు

ప్ర: ఇరవై సంవత్సరాలుగా టెస్ట్‌మ్యాచ్, వన్‌డే మ్యాచ్ అనే తేడా లేకుండా సునీల్ గవాస్కర్‌లాగ తెగ ఆడేస్తున్నారు. ఇంత ఎనర్జీ మీకెక్కణ్ణించి వచ్చింది!?



జ: ఆ ఎనర్జీకి కారణం బెనర్జీ!

బి+ఎనర్జీ=బెనర్జీ.... బి అంటే బ్రహ్మానందం అన్నమాట. ఆ ఎనర్జీ ముఖ్య లక్షణం ఏంటంటే ఏ పాత్రయినా సరే ఎలర్జీలా ఫీలవకుండా న్యాయం చేసెయ్యడమే! అసలు రహస్యం అదీ! ఇక వన్డే మ్యాచ్, టెస్ట్ మ్యాచ్ అంటారా... ఆ మ్యాచ్ ఫిక్సింగ్‌లన్నీ పైన దేవుడెప్పుడో చేసేసాడు... అంతా ఆడించే ఆ భగవంతుని దయ.... అంతే!

## కోట ప్రశ్నకు బ్రహ్మానందం జవాబు

ప్ర: బ్రహ్మయ్యా!
నీకు ఏండు నూరేళ్ళయ్యా...
హాస్యానికే బాపికం కట్టేశావయ్యా!
ఇలాగే కంటిన్యూ అయిపో అయ్యా...
గాడ్‌బ్లెస్‌యూ అయ్యా...
మరి నా గురించేంటయ్యా...
కొంచెం చెప్పయ్యా...



జ: కోటయ్యా...
నీది ఎవరూ అనుసరించలేని రూటయ్యా
నీకు నువ్వే సూటయ్యా
అందుకే నువ్వెప్పుడూ గ్రేటయ్యా.





"నాకు ఓ పది వేలు అప్పు కావాలోయ్" అన్నాడు అప్పారావు.

"ఏం? అంతవసరం ఏమి వచ్చింది?" అడిగాడు పాపారావు.

"ఊహు! అవసరం అంత పెద్దది కాదు... చిన్నదే. కానీ... నాకు అవసరం వచ్చిన ప్రతీసారి అప్పుకు వెళ్లలేం కదా!" చెప్పాడు అప్పారావు.



"ఏమయ్యా! నువ్వు ప్రతీరోజూ ఆఫీసుకు ఆలస్యంగా రావడమేనా...?"

"ఏం చేయను సార్! రోజూ పెందళాడే వద్దామను కుంటున్నాను. కానీ... బయలుదేరుదామంటే ఎవరో ఒకరు తుమ్ముతూనే ఉంటారు" అని చెప్పాడు నొచ్చు కుంటూ ఆ గుమస్తా.



తండ్రి మంచాన పడ్డాడు. కొడుకుల్లో ఓ కొడుకు వచ్చి

"డాడీ! ఆస్తిని మాకు పంపకాలు చేయకూడదా...!" అన్నాడు.

"అంత అవసరం ఏం వచ్చింది?"

"ఏం లేదు. మాకు ఏమీ మిగలకుండా ఆస్తి మొత్తం నీ వైద్యానికే అయిపోతుందేమోనని భయం" అన్నాడు ఆ కొడుకు.



ఓ ఆరేళ్ల బాబు

"మన మనుషుల కంటే రైళ్లకు మహా తెలివి గలవి కదూ!" అని అడిగాడు.

"అదేమిటి?" ఆశ్చర్యపోయాడు చింటూ.

"అవును. మనం ఏదైనా తెలియని ప్రదేశానికి వెళ్తితే తప్పిపోతాం. కానీ... అవి తిరిగి అదే స్టేషన్‌కు వచ్చేస్తాయి" అంటూ ప్రకటించాడు.



కోర్టులో జడ్జి గారు ఫిర్యాదిని ప్రశ్నిస్తున్నారు.

"నీ మీద హత్యా ప్రయత్నం జరిగిన సమయంలో అక్కడ నీవు గాక ఇంకా ఎవరైనా ఉన్నారా...?"

"ఓ ఉన్నారు సార్!"

"ఎవరు?"

"నా మీద హత్యా ప్రయత్నం చేసిన వ్యక్తి."

"నేను ఆఫీసు పని మీద ఓ నెల రోజులు ఏదైనా క్యాంపు వెళ్లినపుడు మా ఆవిడ నేను ఉత్తరాలు రాసుకోం... ఫోన్లోనే మాట్లాడు కుంటాం." అన్నాడు హరి.

"ఏం? అంతప్రేమా...?" అడిగాడు కిషన్

"అదేం గాదు"

"మరి..?"

"మా ఆవిడ రచయిత్రిలే. ఆ ఉత్తరాల ఖర్చుకంటే ఫోన్ ఖర్చు తక్కువగా ఉంటుందని..." చెప్పాడు హరి.








మిత్రుడి ఇంటికి వెళ్లి ఆ ఇంటి ముందు ఆడుకుంటున్న పిల్లల గుంపును చూసి తన మిత్రుడిని అడిగాడు ఓ వ్యక్తి.
"నువ్వు నీ ఇంటిని పిల్లలున్న దంపతులకు అద్దెకు ఇవ్వనన్నావుగా.. ఎందుకు ఇచ్చావు?"
"కరెక్టే... కానీ.. నేను అద్దెకు ఇచ్చేప్పుడు ఆ దంపతులకు పిల్లలు లేరు"

ఓ బస్‌స్టాప్‌లో "ఏమోయ్! ఇందాకట్నుండి ఆ ముగ్గురు ఆడవాళ్ళు నీ వంక గుర్రుగా చూస్తున్నారు. ఏమైనా కారణం ఉందా...?
"ఓ... ఉంది"
"ఏమిటది?"
"ఒకామెను ప్రేమించి వదిలేసానని...
ఒకామెను సఖ్యత కుదరక విడాకులిచ్చానని...
నమ్మి వచ్చిన ఒకామెను అన్యాయం చేసానని... చెప్పాన్లే"






ఒకామె తన భర్తను ఓ డాక్టర్ దగ్గరకు తీసుకు వెళ్లింది. డాక్టర్ పరీక్షించి అన్నాడు.
"మీ ఆయన ఓ ఆర్నెల్ల పాటు ఈ మందులు వాడితే తప్ప మనిషిగా మారడు"
"సారీ డాక్టర్! నేను అసలు ఆయన్నెప్పుడూ మనిషిగా అనుకోలేదు"

"నాలో నీరసం పాళ్ళు ఒకప్పటి కంటే ఇప్పుడు చాలా వరకు తగ్గాయి" అంది లిఖిత.
"ఏం? ఎలా చెప్పగలవు?" అడిగింది సుజిత.
"సింపుల్. ఒకప్పుడు ఒక కథ ఫెయిర్ చేసే సరికి డీలాపడిపోయేదాన్ని. కానీ.. ఇప్పుడు ఏకంగా ఒక నవలనే ఫెయిర్ చేయగలుగుతున్నా..."



"మా అమ్మాయి పెళ్లికి అందిన చోటల్లా అప్పుచేసానోయ్" అన్నాడు రామం.
"ఊఁ ఆ తర్వాత...?" అడిగాడు సోమం.
"ఏముంది. ఆ అందని చోట తిరిగి ప్రయత్నించి అప్పుచేసి అందినచోట అప్పులు తీర్చా..." చెప్పాడు రామం.



"మా అబ్బాయి ఎప్పుడూ ఊహల్లో తేలిపోతుంటాడోయ్" అన్నాడు రామారావు.
"అయితే ఎందుకైనా మంచిది పైలెట్ ట్రైనింగ్ ఇప్పించు"





కోర్టులో...
"నువ్వు హత్య జరిగిన ప్రదేశంలో ఎందుకు ఉన్నావు?" అడిగారు జడ్జి.
"మరేం లేద్సార్. నాకు హంతకుడికి మధ్య బద్ధ శత్రుత్వం ఉంది. ఈ హత్య కేసులో ఎట్టి పరిస్థితిలోను శిక్ష నుండి తప్పించుకోకుండా ఉండాలంటే తగిన సాక్ష్యాధారాలు ఉండాలిగా. అందుకని..." అన్నాడు సాక్షి నింపాదిగా.

ఈ జోక్సను పంపినవారు: బి.వి.యస్.బాబు, తెనాలి.

# సద్దాం ఆంటీ ఇంటి కథ

సీరియల్ 25

- మల్లాది వెంకట కృష్ణమూర్తి



## జరిగిన కథ

అనన్య బామ్మ గారికి, గ్రామం అనే ఆయనకు ఆమె ఇల్లు గురించి కుదిరిన ఒప్పందం ప్రకారం బామ్మ బతికున్నంతకాలం ప్రతీనెలా గ్రామం డబ్బివ్వాలి. బామ్మపోయాక ఇల్లు అతని స్వంతం అవుతుంది. కాలక్రమేణా గ్రామం, అతని కొడుకులు పోతారు కానీ బామ్మ ఆరోగ్యంగా ఉంటుంది. బామ్మ చస్తే ఇల్లు తన స్వంతమవుతుందని గ్రామం మనుమలలో ఒకడైన లింగమయ్య , రియల్ ఎస్టేట్ వ్యాపారం చేసే సుబ్బారావు హరికేశం అనే కిరాయి హంతకుడిద్వారా బామ్మను చంపడానికి ప్లాను వేస్తారు. హరికేశం బామ్మను పాముకాటుతో చంపే ప్రయత్నంలో రెండు రాత్రులు ప్రయత్నించి విఫలమవుతాడు. అతన్ని పోలీసులు పట్టుకోగా లింగమయ్య విడిపిస్తాడు. అనన్య, ఆమె కొలీగ్ విరుపమ్ ప్రేమించుకుంటారు. విరుపమ్ అనన్య బామ్మను కలిసి తనకు త్వరలో ఆస్తి కలిసి వస్తుందని చెప్తాడు. ఎందుకంటే అతను లింగమయ్య తమ్ముడే. మూడో రోజైనా పని పూర్తి చేయాలని లింగమయ్య హరికేశాన్ని హెచ్చరిస్తాడు. (ఇక చదవండి)

హాశకేశం బావమరిది రాంబంటు హాస్య ప్రియుడు. తెలంగాణా భాషలో అందర్నీ 'బనాయి స్తాడు'. అవకాశం ఉన్నప్పుడల్లా అందర్నీ ఆటపట్టి స్తుంటాడు. హరకేశం తమింటికి వచ్చినప్పుడు ఓసారి ఇంట్లోని అరలీటర్ పెట్రోల్ అతని బండి కింద వలకపోసి హరకేశాన్ని పిలిచి 'బావా నీ టేంకు లీకవుతోంది' అని ఆ పెట్రోల్‌ని చూపించాడు. అది నమ్మి మెకానిక్ దగ్గరికి తీసుకెళ్తే అలాంటిదేంలేదని తేలింది. తర్వాత రాంబంటు తననలా 'బనాయించాడని' తెలిసింది.

మరోసారి అర్ధరాత్రి తన పళ్లకి నల్లని రంగు పూసుకుని చీకట్లో టార్చిలైటుని గడ్డం కింద ఆనించి లైట్ నొక్కాడు. అతన్నిచూసి దయ్యం అనుకుని కెవ్వున అరిచాడు హరకేశం (చేసి చూడకండి. అద్దంలో మిమ్మల్ని మీరు చూసు కున్నా భయంకరంగా వుంటారు సుమా)

అలాంటి రాంబంటు తమ పల్లె నుంచి హర కేశం ఇంటికి వస్తూ ఉత్తచేతులతో వస్తాడా? బావని బనాయించడానికీసారి ఓ స్పెషల్ ట్రీట్‌ని వెంటతెచ్చాడు.

అతనొచ్చేసరికి అప్పుడే నిద్రలేస్తున్నాడు హర కేశం. రాంబంటుతో కబుర్లు చెప్తూ కాఫీ తాగాడు. తర్వాత ఇద్దరూ కలిసి కాసేపు టి.వి. చూసారు. రాత్రి పన్నెండున్నరకి బావ పని మీద బయటికి వెళ్తాడని తెలిసిన రాంబంటు తన అక్కయ్యని అడిగాడు ఏం పని మీదని.

“ఇంకేం వుంటుంది నాయనా? పేకాట ఒకటే పని''

“బావ ఇంకా తగ్గించలేదా పేకాట?''

“ఆయన చేతుల్లో ఎక్కడుంటుంది? మూడు రోజులుగా ప్రతి రాత్రి చెప్పుకుంటే సిగ్గుచేటు''

సిగ్గుచేటు అయినా తన తమ్ముడితో, గత మూడు రాత్రులుగా భర్త దిగంబరిగా అయి, రోడ్డున దొరికిన మాసిపోయిన లుంగీ, బనీన్లతో ఎలా ఇంటికి చేరాడో వివరించింది.

“డబ్బు దక్కనివ్వడం లేదు నేను. దాంతో ఏదో ఓ పనుందని చెప్పివెళ్లి ఒంటి మీద బట్టల్ని పేకాట ఆడి పోగొట్టుకుని వస్తున్నాడు దరిద్రుడు'' కన్నీళ్లతో చెప్పిందావిడ.

రాంబంటుకి తను తెచ్చిన స్పెషల్ ట్రీట్‌ని ఏం చెయ్యాలో అక్క చెప్పింది విన్నాక స్ఫురించింది. వెంటనే తన కుడిచేతిని పాలిథిన్ బేగ్‌ని తొడుక్కుని సంచీలోంచి, తనతో తెచ్చిన దురద గుంటాకు తీసి శుభ్రంగా హరకేశం అండర్‌వేర్, ప్యాంటు, చొక్కాల్లో రహస్యంగా రుద్దాడు.

రాత్రి మజ్జిగ తాగి బట్టలు వేసుకుని సైకిల్‌కి పామున్న గోనె సంచీని తగిలించుకుని బయలు దేరాడు హరకేశం. దురదగుంటాకులో ఓ ప్రత్యేకత వుంది. అది చర్మానికి తగిలాక రసాయినిక చర్య ఆరంభ మవడానికి కొంత వ్యవధి పడుతుంది. ఇండైరెక్టుగా బట్టనించి తాకితే ఇంకాస్త ఎక్కువ వ్యవధి పడుతుంది.

హరకేశం సైకిల్ ఎప్పటిలా స్కూలు బయట ఆగింది. బుద్ధి మార్చుకోనందుకు దాన్ని నాలుగంటించి మళ్ళీ ముందుకు సాగమన్నాడు హరకేశం. ఆరోజు ఎలాగైనా పనిపూర్తి చేయాలన్న పట్టుదలతో ఉన్నాడతను.

ఒకటిన్నర ప్రాంతంలో అతను సైకిలు తొక్కుతూ దాదాపు బామ్మ ఇంటి ప్రాంతానికి చేరుకుంటూండగా మొదలైంది రసాయనిక చర్య. కొంచెం కొంచెంగా మొదలైన అది నిముషంలో

**“తాతగార్ని హాస్పిటల్‌లో చేర్పించారటగా?”**

**“అవును మరో నెల దాకా రాడు”**

**“డాక్టర్ ఉండాలని చెప్పారా?”**

**“కాదు నర్సు పిల్లని చూసాక ఆయనే చెప్పాడు”**

**అంతటి అదృష్టం లేని హరకేశం హాస్పిటల్ పాలైన కొద్ది గంటల్లో బయటికి వచ్చిన ఉదంతం ఈ నవల్లో చదవండి.**

తన ప్రభావం చూపించ సాగింది. హరకేశం సైకిలాపి స్టాండేసి గోక్కో సాగాడు. ఎంత గోకినా తనివి తీరదు. కాళ్లని గోకుతుంటే, వీపు దురద. వీపును గోకుతుంటే, పొట్ట దురద. పొట్టను గోకు తుంటే, చేతులు, వాట్‌నాట్... శరీరం మొత్తం అరిపాదాలు, మాడు తప్ప అంతా దురదే. అంత అకస్మాత్తుగా దురద వ్యాధి ఎలా సంక్రమించిందో హరకేశానికి అర్థంకాలేదు. ఆ దురద తాకిడికి తట్టుకోలేక ముందు చొక్కా విప్పాడు...తర్వాత పేంటు విప్పాడు. ఆ తర్వాత సందేహించకుండా అండర్‌వేర్ కూడా విప్పి ఓ ఇంటి మెట్లమీద కూర్చుని గోక్కోసాగాడు. గోకుతున్న కొద్దీ దురద అధికం కాసాగింది. పల్లెటూళ్ళో పుట్టిపెరిగిన అతనికి దురదగుంటాకు గురించి ఏటూ జడ్ తెలుసుకాబట్టి అది దురదగుంటాకు దురద అని గ్రహించాడు. తనవంటి మీది దుస్తులకి ఆ ఆకుని రుద్దారని గ్రహించాడు. ఆ రుద్దింది ఎవరో కూడా ఇట్టే పట్టేసాడు. రాంబంటు తనతో దురదగుంటాకు తెచ్చుంటాడని గ్రహించిన హరకేశానికి అతనిమీద యమకోపం వచ్చింది. ఇంటికెళ్ళాక అతన్ని వీపు వంచి, పిడిగుద్దులు గుద్దాలని, చచ్చినా ఫర్వాలేదని కోపంగా నిర్ణయించుకున్నాడు.

ఆ దుస్తులని సైకిల్‌కి తగిలించి రోడ్డుమీద చూసాడు. అది సిమెంట్ రోడ్డు. సందు మలుపులో కొద్ది దూరంలోని ఇంకోరోడ్డు మీదకి వెళ్ళి వంగి ఆ తారు రోడ్డు పక్కనే ఓ ఇంటి ముందు పోసిన ఇసుక కుప్పమీద పడి అటుఇటు దొర్లాడు. రెండు అరచేతుల్లోకి ఇసుక తీసుకుని వంటిమీద దాన్ని రుద్దుకోసాగాడు.

కొంత ఉపశమనం కనిపించింది. అలా పావుగంట రుద్దుకున్నాక బాగా ఉపశమించింది.

తిరిగి ఆ దుస్తులు వేసుకుందామంటే ఇదే బాధ మొదలవుతుంది. వేరే దుస్తులు లేవు. ఎలా? పని పూర్తి చేయకుండా వెనక్కి తిరగడం ఇష్టం లేదు. సెకండ్ షో సినిమా కూడా విడిచేసారు కాబట్టి ఇక జనం తిరగరన్న ధైర్యం వున్నా ఇన్‌స్పెక్టర్ జీప్‌లో పహారా తిరుగుతూంటాడు కాబట్టి కొద్దిగా జంకుగా వుంది.

ఏదైనా వంటి మీదికి చిరిగిన టవల్ లాంటిది దొరుకుతుందేమోనని చుట్టూ చూసాడు. దూరంగా ఓ చెత్త డబ్బా కనిపించింది. దానివైపు నడిచాడు. ఒంగి అందులో పాత బట్టలేమైనా దొరుకుతాయేమోనని వెదుకుతుండగా అకస్మాత్తుగా అతని మీద ముందు ఓ టార్చివెలుగు, తర్వాత ఇంకోటి, పడ్డాయి.

వెనక్కి తిరిగి చూసాడు హరకేశం. ఎదురుగా ఇద్దరు బీట్‌కానిస్టేబుల్స్. వెంటనే పరిగెత్త



బోయాడు కాని ఒకడు విసిరిన లాఠీ కాళ్ళకి అడ్డుపడడంతో కింద పడ్డాడు. రెండో వాడు పోలీస్ విజిల్ వేయడం ఏమిటి కొద్దిక్షణాల్లో ఆ సందులోకి పోలీస్‌జీప్ రావడం ఏమిటి అంతా వెంటవెంటనే జరిగి పోయాయి. అతన్ని కదలకుండా పట్టు కున్నారు ఆ ఇద్దరు కానిస్టేబుల్స్.

ఇన్‌స్పెక్టర్ ఆశ్యర్యంగా చూస్తుంటే చెప్పాడు హరకేశం.

"మళ్ళీ నేనే"

* * *

లింగమయ్యకి కొద్దిగా ఆదుర్దాగా ఉంది. మెటర్నిటి హాస్పటల్‌లో భార్య నొప్పులు పడు తూంటే గది బయట కాలుకాలిన పిల్లిలా తిరిగే భర్తలా, వెటర్నరి హాస్పటల్‌లో, తమ పెంపుడుకుక్కకి ఆపరేషన్ చేస్తూంటే, అటు ఇటు ఆదుర్దాగా తిరిగే దాని యజమానిలా తిరుగుతున్నాడు.

కొద్దిసేపట్లో ఓ వాహనం వచ్చి అతని, 'పోలీస్‌స్టేషన్' బోర్డు పక్కన ఆగింది. అది పోలీస్‌జీప్. అందులోంచి ఇన్‌స్పెక్టర్ దిగాడు. లింగమయ్య అనుమానం నిజమైంది. అందు లోంచి బట్టలు లేకుండా వున్న హరకేశాన్ని దింపు తున్న కానిస్టేబుల్స్‌ని చూసాడు. వెంటనే కోపంగా దగ్గరకి వెళ్ళి హరకేశాన్ని ఈడ్చి ఓటి చ్చుకున్నాడు. తన చేతిలోని తన పాతపేంటు, షర్టులని ఇచ్చి చెప్పాడు.

"నాకు తెలుసు, నీ సంగతి. అఘోరించు"

తర్వాత ఇన్‌స్పెక్టర్‌తో చెప్పాడు-

"పదండి సార్ మనం లోపలకి వెళ్ళి మాట్లా డుకుందాం"

"మాట్లాడేదేం లేదు. రెండు వేలు"





దారులు కాని దారులు ?

చందాదారులు

**పెన్షన్ ఆఫీస్‌కి ఓ భార్య ఉత్తరంలో ఏం రాసింది?**

**-తప్పిపోయాడనుకున్న నా భర్త మరణించాడని తెలియచేయడానికి సంతోషిస్తున్నాను.**

**తన భర్త బ్రతికే వున్నందుకు సంతోషించిన ఓ భార్య కథ ఇది.**

"నిన్న పదిహేను వందలేగా"

"ఊహు కుదరదు. ఈ రకం నేరం ఈ వారంలో ఇది నాలుగో సారి. రెండువేలు"

బేరం ఆడాలని ఆడాడు కాని లింగమయ్య అప్పటి మనస్థితికి అయిదువేలన్నా ఇవ్వడానికి సిద్ధపడే వచ్చాడు. రెండు వేలు ఇన్‌స్పెక్టర్ కిచ్చి, బట్టలు తొడుక్కోకుండా నిలబడ్డ హర కేశంతో చెప్పాడు.

"ఏం ఇంకా అఘోరించలేదు?"

"డ్రాయర్ తేలేదా?"

"కొట్టానంటేనా?...మొహానికి డ్రాయిర్ ఒక్కటే తక్కువ ఈ అర్థరాత్రి"

దుస్తులు వేసుకుంటూ చెప్పాడు హర కేశం.

"పేంటు టైటు, చొక్కా లూజు"

"అదైనా దొరికినందుకు సంతోషించి నడు"

ఇద్దరూ స్కూటర్ ఎక్కాక పోనిస్తూ అడిగాడు లింగమయ్య.

"నాకు తెలుసు. ఈ రాత్రీ పేకాటకి వెళ్ళి ఇక్కడ తేలతావని. పనికాలేదుకదా?"

"లేదు అసలేం జరిగిందంటే..."

"ఆపాపు నీ కథలు వినే ఓపిక లేదు నాకు. సైకిలు, పొట్లకాయ ఎక్కడవదిలావు?"

"పొట్లకాయ?"

"అదే పాము" ఉరిమాడు లింగమయ్య.

"చెప్తా పోనీ"

ఇద్దరూ హరకేశం డైరెక్షన్స్ ప్రకారం రామ్ నగర్‌లోకి వచ్చాక రోడ్డు వార స్టాండు వేసి వున్న సైకిల్, దాని హేండిల్‌కి వేలాడే, బట్టలు, గోనె సంచి కనబడ్డాయి.

"అమ్మయ్య... ఎవరూ ఎత్తుకెళ్ళలేదు" చెప్పాడు హరకేశం ఆనందంగా.

ఊపిరి పీల్చుకున్నాడు లింగమయ్య.

"ఆ సంచీ తీసుకుని నా స్కూటరెక్కు"

"మళ్ళీ నీకు శ్రమదేనికన్నా. దగ్గరేగా నేనొక్క డ్నే వెళ్ళొస్తాను"

"మర్యాదలు, మొహమాటాలు కట్టిపెట్టి స్కూటర్ ఎక్కు. ఈ రాత్రికి పనికాకపోతే నాకుంటుంది సుబ్బారావు చేతిలో"

ఇద్దరూ మళ్ళీ స్కూటర్ మీద నిముషంలో బామ్మ ఇంటిదగ్గరికి చేరుకున్నారు. కాంపౌండ్ వాల్‌ని ఎలా ఎక్కాలా అని హర కేశం చూస్తూంటే, లింగమయ్య అసహనంగా చెప్పాడు.

"గేటు తోసాను తెరుచుకుంది ఇటు తగలడు"

"తాళం మరవలేదు. గొళ్ళెం మరిచినట్లుంది" చెప్పాడు హరకేశం.

"లోపలకెళ్ళి పని చూడు. ఆ తర్వాత ఎవరి దారి వాళ్ళది."

హరకేశం గేటులోంచి లోపలకి వెళ్ళాక లింగమయ్య స్కూటర్ మీద ఇంటి దారి పట్టాడు.

హరకేశం బామ్మ పడుకునే గది కిటికీ దగ్గరకి వెళ్ళి చూసాడు. ఆవిడ మంచం మీద గుర్రుపెట్టి నిద్రపోతూ కనిపించింది.

చకచక ఇంటి వెనకవున్న కాకర పాదు దగ్గరకి వెళ్ళి దానికున్న ఓ పెద్ద వాసాన్ని విప్పాడు. వీధి లైటుకాంతి పడేచోటుకి నడిచి గోనెసంచి మూతికి కట్టిన తాడుని విప్పి మూటను తెరిచాడు. ఎంతకీ పాము పైకి రాకపోవడంతో సంచీని చిన్నగా



తట్టాడు. తక్షణం అందులోంచి పాము తల బయటకి వచ్చింది. తయారుగా ఉన్న హరకేశం మెరుపులా దాని మెడ కింద చెయ్యివేసి పట్టుకున్నాడు. దాన్ని బయటకి తీసి వాసం చివర దాని మెడని వుంచి నొక్కిపట్టుకుని, దాని శరీర భాగాన్ని వాసానికి ఆనించి, నాలుగు చోట్ల గట్టిగా తాడుతో దాన్ని కట్టాడు. దాని తోకకి పొడుగాటి ప్లాస్టిక్ తాడు కట్టాడు. రెండో కొస వాసానికి ఈ చివరికి వచ్చింది.

హరకేశం మళ్ళీ కిటికీ దగ్గరకి నడిచాడు. కిటికీకి అడ్డంగా వున్న రెండు ఇనుప ఊచల మధ్యనించి ఆ వాసాన్ని లోపలకి పోనించాడు. పాము తల ఉన్న భాగం బామ్మవైపు పోనిచ్చి బామ్మ కాళ్ళ దగ్గరకి దాన్ని తీసుకెళ్ళాడు. ఆ పాము అప్పటికే పడగ విప్పి, తలని అటు ఇటు తిప్పుతూ ఉగ్రంగా చూస్తోంది. నాలుగైదు సార్లు అదికొట్టిన బుస బామ్మ గురక శబ్దంలో కలిసిపోయింది.

హరకేశం ప్లాస్టిక్‌తాడు కొసని లాగితే దాని తోక లాగబడుతుంది. తక్షణం అది కాటేస్తుంది. ఆ పని చేయబోయేముందు హర కేశానికి కుడిపాదం పైన మడమమీద ఏదో చురుక్కుమంది. తను చేసేపని ఆపి దృష్టిని కిందకి పోనించాడు.

తనకాలు పక్కన నేల మీద వున్న ఓ గోధుమ రంగు తాచుపాము తన పడగ విప్పి తల రెండడుగులు పైకెత్తి మరోసారి హరకేశం మడమమీద కాటేసింది. వెంటనే వెనక్కి తిరిగి జరజర పాక్కుంటూ వెళ్ళసాగింది.

హరకేశానికి ఆక్షణంలో తట్టిన ఆలోచన, వాసానికి తను కట్టిన పాము ఎలా తప్పించుకుంది అని. దాన్ని కిటికీలోంచి బయటకి లాగిచూస్తే కట్టిన తాచుపాము అలాగేవుంది. తనని కాటేసింది అదికాదు ఇంకొకటి అని తట్టింది హరకేశానికి. అప్పుడు గుర్తొచ్చింది, బామ్మ ఇంట్లో పెద్దపుట్ట ఉందని, అందులో ఓ గోధుమ రంగు తాచు ఉందని, దాని నాన్నమ్మని పూర్వం బామ్మ పెంచేదని.

విషం పైకి ఎక్కడం ఇట్టే తెలిసిపోతోంది. బామ్మ ప్రాణాలని తీయాలని వచ్చిన హరకేశంకి ముందు తన ప్రాణరక్షణ ముఖ్యంగా తోచడం సహజం.

ఆ వాసాన్ని కింద పడేసి గబగబ గేటు లోంచి బయటకి వచ్చి తన సైకిల్ దగ్గరికి పరిగెత్తాడు. దాన్నెక్కి హాస్పటల్ వైపు సైకిల్ తొక్కసాగాడు. అతని అదృష్టం కొద్ది మధ్యలో ఓ ఖాళీ ఆటో కనపడడంతో అదెక్కి చెప్పాడు.

"అర్జెంటుగా ఉస్మానియా హాస్పటల్‌కి పోనీ, అర్జెంట్. పామొకటి కాటేసింది నన్నిప్పుడు"

దగ్గరకి వచ్చి హరకేశం నోటి దగ్గర తన ముక్కు పెట్టి వాసన చూసాడు డ్రైవర్.

"వాసనబట్టి తెలుస్తుందా నీకేదైనా? నీకు పాముకాటు వైద్యం తెలుసా?" ఆశగా అడిగాడు హరకేశం.

"తాగిన కేసను కున్నాను. కాదు. డ్రగ్స్ వాడావా?" ప్రశ్నించాడు డ్రైవర్.

"నిజమయ్యా బాబూ, ఇక్కడి దాకా ఎక్కింది విషం. నీకెందుకు, నన్ను నమ్మి ముందు హాస్పటల్‌కి పోనీ" ఏడుపు గొంతుతో మోకాలు చూపిస్తూ చెప్పాడు హరకేశం.

"హైద్రాబాద్‌లో పాములెక్కడనించి వస్తాయి?"

"నిజం. దారిలో చెప్తా ఆ వివరాలు. ముందు పోనీ"

అతనిలోని భయాందోళనలు గమనిం చాక ఆటోడ్రైవర్ మీటర్ వేసి బండిని స్టార్ట్ చేసాడు.

* * *

మర్నాడు ఉదయం నిద్రలేచాక లింగమయ్యకి ఉత్కంఠగా, ఆందోళనగా వుంది, రాత్రి హరకేశం పనిపూర్తి చేసాడా లేదా అని.

అది అయ్యేదాకా తను అక్కడుంటే హరకేశం ఏ కారణంగానైనా పట్టుబడితే, తన మీదకి వస్తుందన్న భయంతో వచ్చేసాడు.

ఆరుంపావుకల్లా వెలుగురేఖలు వస్తుండగా వచ్చాడు నిరుపమ్.

"నిన్నరాత్రి పనయిందా అన్నయ్యా" అడిగాడు ఆశగా అన్నా వదినలకేసి చూస్తూ.

"తెలీదు. హరకేశం నుంచి ఏ కబురు ఇంకా తెలియలేదు. ఫోను చేసి మీ ఇంట్లో ఫలానా ఆవిడ పాముతో రాత్రి మరణించిందా అని అడిగే విషయం కాదుగా. రా. కాఫీ తాగుదువుగాని"

"ఆ బిల్డింగ్ అమ్మి కేష్‌ని పంచుకోగానే, నేను పెళ్లి చేసుకోదలుచుకున్నాను వదినా."

"మంచి మాట చెప్పావు. నిన్ను పట్టించు కోవడంలేదని చుట్టాలంతా మమ్మల్ని ఆడి పోసుకుంటున్నారు. ప్రేమ వివాహమా?"

"అవును వదినా"

"ఏంచేస్తోందామ్మాయి?"

"నా బేంక్‌లోనే కొలీగ్"

"పేరు?" అడిగాడు లింగమయ్య.

"అనన్య"

"అనన్య సరే వాళ్ళ వివరాలు... అనన్యా!?"

"అవును"

"రాంనగర్‌లో వుండే అనన్యేనా?"

**కమాల్ ప్రశ్న - ధమాల్ కార్టూన్**



**ఎవరికీ నచ్చని రసం ?**
**నీరసం**

**భోజనం నిత్యం ఫ్రీగా దొరకాలంటే ఏం చెయ్యాలి?**

**- జైలుకెళ్ళాలి.**

**జైలు కెళ్తేనేమోనని భయపడ్డ పాత్రని ఈ సంచికలో 'సద్దాం ఆంటీ ఇంటి కథ'లో కలుసుకోండి.**

లైసెన్స్ లేకుండా డ్రైవ్ చేసిందికాక, యాక్సిడెంట్ చేసి ఒకర్ని చంపావ్.. ఏం నువ్వేమన్నా హిందీ హీరో అనుకున్నావా...?



కళ రాంమోహన్

"అవునన్నయ్యా"

అదిరిపడ్డాడు లింగమయ్య. "ఏదీ ఆ భూత్ బంగ్లాలో బామ్మతో వుండే అనన్య గురించేనా నువ్వు చెప్పేది?"

"అవునన్నయ్యా"

"చంపావుపో"

"ఎవర్ని?"

"ఆ అనన్య ఎవరనుకుంటున్నావు? మన బిల్డింగ్‌ని ఆక్యుపై చేసుకుని చావనేదే లేకుండా బ్రతికే బామ్మకి స్వయంగా మనవరాలు". ఈసారి లింగమయ్య మొహంలోని ఫీలింగ్స్‌కి నిరుపమ్ మొహం కార్బన్ కాపీ అయ్యింది.

"నిజంగా?"

"అవును"

"అంటే ఆ బామ్మ నేనా మనం చంపాల్సింది?"

"అవును"

"ఛ. ఆ బిల్డింగ్ మనదని నాకు తెలీదు... మరి ఆ బామ్మగారు మా పెళ్ళి తర్వాత ఆ బిల్డింగ్ మాకే వస్తుందన్నారే?"

"నువ్వు చచ్చేదాకా తను బ్రతికే వుంటానన్న ధీమాతో చెప్పివుంటుంది."

"ఓ! అదేనా మన బిల్డింగ్...ఓ...దాన్ని అమ్మ డానికేనా...ఓ... అరెరె? పాపం...బామ్మగారు చచ్చుంటుందా ఈ పాటికి?"

"నా లెక్క ప్రకారం చావాలి"

"పాపం"

"దేనికి పాపం? కాబోయే పెళ్లాం బంధువు మీద అకస్మాత్తుగా ప్రేమ ముంచుకొచ్చిందా?" ఈసడించాడు లింగమయ్య.

వెంటనే అనన్య నంబర్ డయల్ చేసాడు నిరుపమ్. అనన్యే ఫోన్ ఎత్తింది. నిద్రమత్తులో 'హలో' అంది.

"గుడ్‌మార్నింగ్ నేను నిరుపమ్‌ని"

"ఇంకా నవమి రాలేదు... రాత్రికి కాని రాదు." నిద్రమత్తులో చెప్పింది.

"అందుకు కాదు నేను ఫోన్ చేసింది. మీ బామ్మ ఎలావుంది?"

"బామ్మకేం? బానేవుంది. ఇంకా నేను నిద్ర పోతాను కాస్సేపాగి చెయ్యి."

"సరే" ఫోన్ పెట్టేసి చెప్పాడు.

"బామ్మ ఎలావుందిట?" అడిగాడు లింగమయ్య.

"బానేవుందిట. నేను అనన్య ఇంటికెళ్తాను. రాత్రి ఏంకాకుండా బామ్మ బ్రతికే వుంటే మొత్తం బామ్మకి చెప్పి ఆ బిల్డింగ్‌ని వెంటనే సుబ్బారావుకి అమ్మేయమని చెప్తాను. షి విల్ అగ్రీ..."

"ఆగాగు. ఆవిడ పోలీసులకి రిపోర్టిస్తే నన్ను బొక్కలోకి తోస్తారు తెలుసా?" కస్సుమన్నాడు లింగమయ్య.

"నోటిమాటే కదా? దేనికీ రుజువులు లేవుగా?"

"ఎందుకు లేదు? వరసగా నాలుగు రాత్రులు నేను ఆ హరికేశాన్ని పోలీసు స్టేషన్ నించి లంచం ఇచ్చి విడిపించుకు వచ్చాను."

"దేనికి? వాడా మర్డర్ చేయకుండానే పోలీసులు వాడ్ని ఎలా అరెస్టు చేసారు?"

"ఆ నేరం మీదకాదు. వేరే నేరం! రాత్రిళ్లు వాడు ఆ స్పాట్‌కి ఎందుకు వస్తున్నాడో కొన్నాళ్ళకి తెలుస్తుంది. అది వేరేకథ. తొందరపడి ఈ ప్లాన్ గురించి వాళ్ళకి చెప్పక. నేను ఖచ్చితంగా ఇరుక్కుంటాను. ఆ ఇన్‌స్పెక్టర్ నన్ను వదలడానికి లక్షో, పది లక్షలో అడుగుతాడు. ఊరికే మొండి మొల కేసుకే రెండు వేలు గుంజాడు."

"సర్లే. నెమ్మది మీదట చెప్తాను."

"ప్రేమ పిచ్చిలో రెచ్చిపోయి తెలీక ఏం వాగుతావో అక్కడ... ఏదీ నామీద ఒట్టువేయి"

"అలాగే అన్నయ్యా"

"నా మీద కాదు నువ్వు ఒట్టుమీరితే అదే నన్ను ఉరితీయిస్తుంది. మీ వదిన మీద వెయ్యి."

తర్వాత తన పిల్లల మీద కూడా ఒట్టు వేయించుకుని కాని లింగమయ్య నిరుపమ్‌ని పంపలేదు.

* * *

వాసవి నిద్ర లేవగానే భయంగా భర్త ముక్కు దగ్గర వేలిని వుంచి చూసింది. శ్వాస ఆడుతూండడంతో సంతృప్తి చెందింది.

రాజుకి కలలో చెప్పిన ఇరవై ఎనిమిది గంటలు ఇంకో గంటలో దాటి పోతాయి. మొదటిసారిగా రాజు కల అబద్దం అయితే బావుండును అనుకుంది వాసవి.

(ఇంకా వుంది)

## కృతజ్ఞతలు

గత నెల జనవరి 11, 18 తారీకులలో 'మాటీవీ' లో జరిగిన 'పాడాలని ఉంది' కార్యక్రమాలకు జడ్జిగా 'హాసం' ఎడిటర్ శ్రీ రాజా వ్యవహరించడం జరిగింది. ఆ సందర్భంగా ఆయనను పరిచయం చేస్తూ, మధ్యమధ్యలో వ్యాఖ్యానిస్తూ ఆ కార్యక్రమాన్ని నిర్వహించే శ్రీ ఎస్.పి. బాలసుబ్రహ్మణ్యం 'హాసం'పై ఎన్నో ప్రశంసలు కురిపించారు. 'ఈ రోజుల్లో హాసం పత్రిక చేతిలో ఉంటే గర్వకారణంగా భావిస్తున్నారు' అనేది వాటిలో ముఖ్యమైనది.శ్రీ బాలసుబ్రహ్మణ్యం 'హాసం' పై బహిరంగంగా వెల్లడించిన అభిప్రాయాలకు కృతజ్ఞులము. ఆయన మాపై చూపిన నమ్మకానికి తగిన విధంగానే పత్రికను కొనసాగిస్తామనే విశ్వాసంతో ఉన్నామని తెలియబరుచుకుంటున్నాం.



-'హాసం' యాజమాన్యం, సిబ్బంది


బుడుప్పలావు


? ?


ఏమిటి బామ్మా! ఇదంతా పాత కాలపు పద్ధతి. అమెరికాలో ఇలా బట్టలమీద అప్పడాలు ఆరబెట్టరు...


ఉండు నీకు చూపిస్తా
అంటూ దణ్ణెం తాడు మీద బట్టలారేసుకునే క్లిప్పులకి అప్పడాలు తగిలిస్తాడు




ఒరేయ్ అబ్బిగా... అమెరికాలో వడియాలు ఎలా ఆరబెడ్తారో చూపించు


...అమెరికాలో వడియాలు అస్సస్సలు తినరు

# సరిగమలు-గలగలలు

## మాధవపెద్ది సురేష్

(సినీ సంగీత దర్శకులు)



శ్రీ రావి కొండలరావుగారూ, నేనూ కలసి, టి.వి.కె.శాస్త్రిగారి ప్రోగ్రాంకి (1990)లో విశాఖపట్నం వెళ్తున్నాము. అంతకుముందు ఆయనకి నేను తెలిసినా, నాకు ఆయన తెలిసినా మొదటిసారి సంగీతం గురించి చాలా విషయాలు మాట్లాడుకున్నాం. అది ఒక విధంగా నా బంగారు భవిష్యత్‌కి నాంది. ఆయనకి మంచి సంగీతం అంటే ప్రాణం. ఆయన గాయకుడు కూడా. మాధవపెద్ది సత్యంబాబాయి చేసిన ఒకే ఒక సినిమాలో (ఆ సినిమా రికార్డింగ్‌లోనే ఆగి పోయింది) ఘంటసాలగారి సంగీత దర్శకత్వంలో ఒక సినిమాలో కోరస్‌లో పాడారు. మేమిద్దరం మాట్లాడు కుంటున్నప్పుడు నాలో ఉన్న 'తపన' ఆయన కనిపెట్టారు. అప్పటికే నేను 3,4 సినిమాలకి సంగీత దర్శకత్వం వహించాను. ఆయనకి మా కుటుంబాలతో మంచి పరిచయం ఉంది.

మేము తిరిగి వచ్చిన తరువాత "చందమామ విజయా కంబైన్స్ వారు 'భేతాళకథలు', 'పరోపకారి పాపన్న' టి.వి.సీరియల్స్‌గా తీస్తున్నారు, మీరు ఒకసారి విజయావారి ఆఫీస్‌కి రండి" అని రావికొండలరావుగారు కబురు పెట్టించారు. అక్కడ శ్రీ విశ్వనాధరెడ్డిగారిని పరిచయం చేశారు. ఎంతో 'థ్రిల్' ఫీలయ్యాను. ఆయన కూడా చాలా సంతోషించారు. మా ఫ్యామిలి బ్యాక్ గ్రౌండ్ విని! 'చందమామ'లో మా తాతగారు శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారు ఎన్నో సంవత్సరాలు పనిచేశారు. విజయా సంస్థ మొదటి సినిమా 'షావుకారు' నుండి గోఖలేగారు, సత్యంగారూ పనిచేశారు. అందుకే ఆ సంస్థ అంటే నాకు దైవంతో సమానం.

నాతోపాటు శ్రీ సిరివెన్నెల సీతారామశాస్త్రి గారూ, ఆర్ట్ డైరెక్టర్ శ్రీ బి.చలంగారూ ఆ టి.వి.సీరియల్స్‌కి సైన్ చేశాం. కానీ అనుకోకుండా ఆ ప్రపోజల్ పోస్ట్‌పోన్ అయింది. అప్పుడు సినిమాలు తీద్దామని నిర్ణయించుకొన్నారు. నాగిరెడ్డిగారి కుమారులు శ్రీ వేణుగోపాలరెడ్డిగారు, శ్రీ విశ్వనాధరెడ్డిగారు, శ్రీ వెంకటరామరెడ్డిగారు కలసి 'బృందావనం' నిర్మించారు. 17 సంవత్సరాల విరామం తరువాత తెలుగులో మళ్లీ విజయావారు సినిమాలని నిర్మించటం ఎంతో ఆనందించదగ్గ విషయం.

'బృందావనం' సినిమా తీయటానికి అన్నివిధాలా ఒక మంచి 'టీమ్'ని ఏర్పాటు చేసింది శ్రీ రావి కొండలరావుగారు. సింగీతం శ్రీనివాసరావు గారినీ, నన్ను, ఆర్ట్ డైరెక్టర్ చలం గారిని, మిగతా టెక్నీషియన్స్ అందర్నీ ఆయనే కలిపారు.

'బృందావనం', 'భైరవద్వీపం', 'శ్రీకృష్ణార్జున విజయం' సినిమాలకి జరిగిన 'మ్యూజిక్ సిట్టింగ్స్' నేను మరచిపోలేని మధురానుభూతులు. ముందు 'బృందావనం'కి శ్రీ వెన్నెలకంటి గారిని పిలిపించాం (ఒక పాట రాయటానికి) 'ఓహో ఓహో ఓహో బుజ్జి పావురమా' పాట మొదట కంపోజ్ చేశాను. ఆ పాట అందరికీ నచ్చి వెన్నెలకంటిగారి చేతే అన్ని పాటలూ రాయించారు. 'బృందావనం'లో 3 రికార్డులు ఉన్నాయి. ఒకటి మొదటిసారి నేను విజయా సంస్థకు పనిచేయటం, వెన్నెలకంటిగారు అన్ని పాటలూ రాయటం, శ్రీ ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యంగారూ, శ్రీమతి ఎస్.జానకిగారు కలసి అన్ని పాటలు పాడటం. ఇంతటి మహత్తరమైన అవకాశం రావటానికి ముఖ్య కారకుడు శ్రీ రావికొండలరావుగారు. ఎప్పుడూ ఆయన చేసిన మేలు మరవలేను. మా కంపోజింగ్‌లో ఎప్పుడూ దర్శకుడితో పాటు, రావి కొండలరావుగారు కూడా పాల్గొనేవారు. ఆయనకి సంగీతం అంటే అంత ఇష్టం. 3 వారాలపాటు 'బృందావనం' మ్యూజిక్ సిట్టింగ్స్ జరిగాయి. అన్నయ్య రమేష్, సీనియర్ గాయని శ్రీమతి రమణగారు అన్ని పాటలూ ట్రాక్ పాడారు. మా అన్నయ్య సంతోషానికి అవధులు లేవు. 'ఆ రోజు నారాణి' అనే పాట రికార్డింగ్‌కి శ్రీ రామానాయుడుగారు కూడా



'భైరవద్వీపం' క్యాసెట్ రిలీజింగ్ ఫంక్షన్



1994 భైరవద్వీపానికి నాకు మొట్ట మొదటి సారిగా 'వంశీ బర్కిలీ అవార్డ్' ఇచ్చిన సందర్భంలో విశాఖపట్నంలో, శ్రీ టి.సుబ్బరామిరెడ్డి గారి ఆధ్వర్యంలో 'సకల గాయక సంగీతోత్సవం' నిర్వహించిన సందర్భంలో శ్రీ రావికొండలరావుగారు కంపీరింగ్



'భైరవద్వీపం' హిందీ వెర్షన్ కోసం శ్రీమతి ఆశాభోన్స్లే మద్రాసు వచ్చి, విజయాగార్డెన్ డీలక్స్ రికార్డింగ్ థియేటర్‌లో 'నరుడా ఓ నరుడా', 'విరిసినదీ వసంతగానం' అనేరెండు పాటలు హిందీలో పాడినప్పటి ఫోటో. ఎడమనుండి-కొల్లి రామకృష్ణ (సౌండ్ ఇంజనీర్), కవి, రావికొండలరావుగారు, భారతి గారు (నిర్మాత భార్య), శ్రీమతి ఆశాభోన్స్లే, అనువాద కవి, శ్రీ వెంకటరామిరెడ్డి, నేనూ.

వచ్చారు. ఆయన ఎంతో ఇష్టపడ్డారు. 'బృందావనం' 100 రోజుల ఫంక్షన్‌లో శ్రీ రామానాయుడుగారి అమృత హస్తాలతో షీల్డు తీసుకున్నాను. అదే నా మొదటి షీల్డు. ఆ రోజు నాయుడుగారు 'సురేష్ సంస్థలో కూడా నువ్వు పనిచేద్దువుగాని' అని అన్నారు. తరువాత ఆయనే పిలిచి 'తాత మనవడు' సినిమాకి అవకాశం ఇచ్చారు. 'బృందావనం' కేసెట్ రిలీజ్ ఫంక్షన్ 1992 దీపావళి ముందు రోజు చేశారు. నేనూ, సింగీతంగారూ, రావికొండలరావు గారూ కలసి శ్రీ ఎస్.రాజేశ్వరరావుగారి ఇంటికి వెళ్లి చీఫ్‌గెస్ట్‌గా ఆయన్ని పిలిచాము. ఎంతో సంతోషించి, ఆయన వచ్చారు. పాటలు ఆయనకి ఎంతో నచ్చాయి. ఆ మధురానుభూతిని ఎన్నడూ మరువలేను.

తరువాత 'భైరవద్వీపం' సినిమా మ్యూజిక్ సిట్టింగ్స్ నేనెప్పుడూ గుర్తుపెట్టుకొనేవి. అదే నేను పెద్ద హీరోతో చేసిన మొదటి సినిమా. ఆ సినిమాకి నన్ను కన్‌ఫర్మ్ చేసిన తరువాత నేను హీరో బాలకృష్ణగారింటికి మా అన్నయ్యతో వెళ్లాను. అన్నయ్య బాలకృష్ణగారికి మొదటి నాలుగైదు సినిమాలకి అన్ని పాటలూ పాడాడు. అన్నయ్యంటే బాలయ్యబాబుకి చాలా అభిమానం. ఆయన 'విజయా సంస్థ, సింగీతంగారు చేస్తున్న చిత్రం, పైగా 'బృందావనం' పాటలు విన్నాను బాగా చెయ్యండి' అన్నారు. నేనూ అన్నయ్యా ఎంతో సంతోషం పొందాము.

'భైరవద్వీపం' మ్యూజిక్ సిట్టింగ్స్ సుమారు రెండున్నర నెలలు జరిగాయి. 'శ్రీ తుంబుర నారద నాదామృతం' పాటకే సుమారు నెల రోజులు పట్టింది. నాకు దొరికిన అపురూపమైన అవకాశం 'భైరవద్వీపం'. 'విరిసినది వసంతగానం' పాట శ్రీ సింగీతంగారు రాశారు. 'ఎంత ఎంత వింత మోహమో' పాటని సిరివెన్నెలగారు, 'ఘాటైన ప్రేమ నటన' కూడా సిరివెన్నెలగారు రాశారు. 'నరుడా ఓ నరుడా', 'శ్రీ తుంబుర నారద నాదామృతం' పాటలను శ్రీ వేటూరిగారు రాశారు. 'అంబా శాంభవి' పాటని శ్రీ వడ్డేపల్లి కృష్ణగారు రాశారు. అన్ని పాటలకూ సన్నివేశాలు అద్భుతంగా కుదిరాయి. ముఖ్యంగా రీ-రికార్డింగ్ కూడా నాకు చాలా మంచి పేరు తీసుకువచ్చింది. 'భైరవద్వీపం' కేసెట్ రిలీజ్ ఫంక్షన్ అద్భుతంగా జరిగింది. కమలహాసన్‌గారు ముఖ్యఅతిథి. హీరో బాలకృష్ణగారు,రోజా, రంభ, డైరెక్టర్ సింగీతం గారు, వెంకటరామిరెడ్డిగారు, ఎస్.పి.బి.గారు, నేనూ వేదికపైన ఆసీనులవగా అన్ని పాటలూ ప్రెస్‌కి వేసి వినిపించారు. అందరూ ఎంతో బాగా మెచ్చుకున్నారు.

'భైరవద్వీపం'లో 'నరుడా ఓ నరుడా', 'ఎంత ఎంత వింత మోహమో' (ఈ రెండు పాటలకి అన్నయ్య ట్రాక్ పాడాడు), పాటల రికార్డింగ్ తరువాత 'శ్రీ తుంబుర నారద నాదామృతం' పాట రికార్డింగ్‌కి ముందు అన్నయ్య మరణించాడు. అన్నయ్య, నేను లవకుశులుగా బ్రతికాము. అన్నయ్య పోవటం నాకు జీవితంలో కోలుకోలేని దెబ్బ! భైరవద్వీపం 125 రోజులు ఫంక్షన్‌లో బాలకృష్ణగారు నన్ను ఎంతో పొగిడారు. మరచిపోలేని ఫంక్షన్ అది!

తరువాత 'శ్రీకృష్ణార్జున విజయం' మ్యూజిక్ సిట్టింగ్స్ కూడా సుమారు 2 నెలలుపైన జరిగింది. నాకు మొట్ట మొదటిసారిగా 'నంది' అవార్డు వచ్చింది. (1996) సి.నారాయణరెడ్డిగారు (ఈ నీటి ఉయ్యాల, (ప్రియా పిలుపు అందెరా దొరా) వేటూరిగారు (సాహో-మహావీరుడా) వెన్నెలకంటి గారు 2 పాటలూ (పిల్లవాడి పాట, భళీభళీ ఏమి భాగ్యమో) సిరివెన్నెలగారు 'స్వరం చరణం కలవనీ' పాటని రాశారు. పద్యాలను షణ్ముఖశర్మగారు రాశారు. నాకు చాలా తృప్తి కలిగించిన చిత్రం అది.

'భైరవద్వీపం'లో శ్రీమతి సుశీలగారి మేనకోడలు సంధ్యని (చందమామ వచ్చినా) 'శ్రీకృష్ణార్జున విజయం'లో శ్రీ బి.ఎ.నారాయణగారినీ (నారదుడి పద్యాలు, భళీ భళీ అనేపాట) పరిచయం చేశాను. ఇద్దరూ మంచి గాయకులు.

ఎందుకిదంతా రాశానంటే నాకు జీవితంలో మరచిపోలేని ఈ ముచ్చటైన మూడురకాల సినిమాలు రావటానికి ముఖ్యకారకులు శ్రీ రావి కొండలరావుగారు. ఆయన్నిగురించి రాస్తుంటే మనసు ఉప్పొంగి పోతోంది.

శ్రీ రావికొండలరావుగారు మంచిరచయిత, మంచి నటుడు మాత్రమే కాకుండా సంగీతం పట్ల మంచి అభిరుచి, అవగాహన ఉన్న వ్యక్తి. మంచి సహృదయుడు. ఆయన సోదరులందరూ, ప్రఖ్యాతి చెందినవారు కావటం విశేషం. ఆయన సతీమణి రాధాకుమారిగారు సహజనటి. రావి కొండలరావుగారు జీవితంలో తృప్తి ఉన్న వ్యక్తి. ఎక్కువగా ఏ విషయంలోనూ ఆరాటపడరు. పరుగెత్తి పాలు తాగటం కన్నా నిలబడి నీళ్లు తాగాలనే మనస్తత్వం ఆయనది. టైం పంక్చువాలిటీ ఉన్నవారు. 'విజయచిత్ర'ని విజయపథంలో నడిపారు. 'బృందావనం'లో ఆయనా, రాధాకుమారిగార్ల నటనలో ఎంతో సహజత్వం ఉంది.

ఇటీవల ఆయన దర్శకత్వంలో 'కన్యాశుల్కం' టి.వి.సీరియల్‌కి (26 భాగాలు) టైటిల్ సాంగ్ (శ్రీ ఎస్.పి.బి. పాడారు) విశాఖపట్నంలో లుక్స్ రికార్డింగ్ థియేటర్‌లో రికార్డు చేశాము. లోకల్ ఆర్కెస్ట్రాతో చాలా అద్భుతంగా కుదిరింది పాట. బాలుగారు ఎంతోబాగా మెచ్చుకున్నారు. శ్రీ రాంభట్ల నృశింహశర్మ చక్కని రచన చేశారు. రీ-రికార్డింగ్ హైదరాబాద్‌లో చేశాము. నాకు కూడా చాలా తృప్తినిచ్చిన పాట అది. 'తెలుగు కథకు శ్రీకారం' అన్నది పల్లవి. శ్రీ రావికొండలరావు గారికి చిరకాల కోరిక. విశాఖపట్నంలో ప్రముఖ పారిశ్రామికవేత్త, కేబుల్ విజన్ అధినేత శ్రీ వెంకటరావుగారు నిర్మాత. 'కన్యాశుల్కం'లో ఒక అక్షరం తీసెయ్యకుండా, ఒక అక్షరం కలపకుండా ఎంతో అద్భుతంగా తీశారు. త్వరలో ప్రసారం అవుతుంది.

శ్రీ రావికొండలరావుగారికి ఒకే ఒక అబ్బాయి. పెళ్లి అయ్యింది, ఇద్దరు మగపిల్లలు. మంచి కుటుంబం. ఇన్నేళ్లుగా సినీ పరిశ్రమలో ఉంటూ అందరి దగ్గరా మంచిపేరు, ఉన్నతమైన భావాలూ, డిసిప్లిన్, ఉన్న వ్యక్తి. సాయి భక్తుడాయన, వారి కుటుంబం అంతా సాయి భక్తులు. రావికొండలరావుగారూ, రాధాకుమారిగారూ మేడ్ ఫర్ ఈచ్ అదర్. ఇటీవల వారి సోదరులు ధర్మారావుగారితో, కె.వి.రామంగారితో కలసి 'యాడ్స్ ఫర్ యు' అనే పక్షపత్రికను విజయపథంలో నడుపుతున్నారు.

'తెలుగు మాస్టారు' అనే క్యారెక్టర్ శ్రీ రావి కొండలరావుగారి కోసమే పుట్టింది. ఎన్నోసార్లు సినిమాల్లో, స్టేజీపైనా బ్రహ్మాండంగా యాక్టు చేశారు, చేస్తున్నారు. ఎప్పుడూ జోక్స్ వేస్తుంటారు. ఆయనకి

మద్రాసులో, విశాఖపట్నంలో, విజయ నగరంలో ఎంతో మంది ఫాన్స్, సన్నిహితులు ఉన్నారు. విశాఖపట్నంలో Humour Club (హ్యూమర్ క్లబ్ )స్థాపించి ఎంతోమందిని మనసారా నవ్విస్తున్నారు. మద్రాసులో నేనూ, ఆర్ట్‌డైరెక్టర్ బి.చలంగారూ, రావి కొండలరావుగారూ, కలసి అప్పుడప్పుడు Woodlands Drive -in Hotel కి వెళ్ళి ఎన్నో మంచి విషయాలు మాట్లాడుకుంటూ ఉంటాము. శ్రీ రావికొండలరావుగారి తమ్ముడు శ్రీ రావి ధర్మారావుగారు నాకు ఎంతో ఆప్తులు. ఆయన దగ్గర చాలా మంచి Music Library వుంది. 'Vizag VAK' అని పిలుచుకుంటూ ఉంటాం. శ్రీ నాగరాజారావుగారు, టి.వి.కె.శాస్త్రిగారు, వి.ఎ.కె.రంగారావుగారు, శ్రీ సాయికృష్ణ యాచేంద్రగారు, బాపు-రమణగార్లు, ఇలా ఎంతో మంది మహానుభావులతో ఆయన సన్నిహితంగా ఉంటారు. ఆయనకి వయస్సు 70 సంవత్సరాలు వచ్చినా ఆరోగ్యంగా, ఆనందంగా, తృప్తిగా లైఫ్‌ని ఎంజాయ్ చేస్తున్నారు.

'ఘంటసాల' గారంటే ఆయనకీ, ధర్మారావు గారికి ప్రత్యేకమైన అభిమానం. ఆయన గురించి రోజుల తరబడి మాట్లాడతారు. ఘంటసాల గారు ఫిబ్రవరి 11న కన్నుమూశారు (1974). అప్పటి నుండి, శ్రీ రావికొండలరావుగారు తన పుట్టిన రోజు పండుగ జరుపుకోవటం మానేశారు. ఎందుకంటే ఆయన పుట్టింది కూడా ఫిబ్రవరి 11న అవటం వలన. ఆ సాయిదేవుడు ఆయనకీ, రాధాకుమారిగారికీ, వారి కుటుంబ సభ్యులు అందరికీ ఆయురారోగ్య ఐశ్వర్య ప్రాప్తి కలిగించు గాక! ■

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలు

**1951**

ఈ సంవత్సరం విడుదలై ఘన విజయం సాధించిన వాటిలో ప్రముఖంగా చెప్పుకోవల్సిన చిత్రం కమెడియన్ భగవాన్ నిర్మించిన 'అల్‌బేలా'. హిందీ సినీ సంగీత చరిత్రలో అత్యంత ప్రజాదరణ పొందిన మొదటిగీతాలలో ఒకటిగా ఇప్పటికీ చెప్పుకుంటున్న 'షోలా జో భడ్కే...' రూపుదిద్దుకున్నది ఇప్పుడే. సి.రామచంద్ర, రాజేంద్రకిషన్‌ల కాంబినేషన్‌కు మంచిపేరు తీసుకువచ్చిందీ పాట. 'భోలీ సూరత్', 'షామ్ ఢలే', 'ధీరేసే ఆనా', 'మేరే దిల్ కి ఘడీ', 'కిస్మత్ కి హవా' మరికొన్ని హిట్ గీతాలు.


'అల్‌బేలా' లో గీతాబాలి, భగవాన్

శంకర్ -జైకిషన్‌లతో రాజ్ కపూర్ రెండో చిత్రం 'ఆవారా' మ్యూజికల్‌గా మంచిహిట్ సాధించిన చిత్రం (టైటిల్ సాంగ్ ట్యూన్ విదేశాల్లో కూడా హిట్ అయింది). చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొందటం ఓ విశేషమైతే, మొదటిసారిగా ఓ హిందీ చిత్రానికి అంతర్జాతీయ సహకారం లభించటం ఇదే ప్రథమం. రష్యా సహకారంతో నిర్మితమైన ఈ చిత్రంలో భారతీయ చలనచిత్ర చరిత్రలోనే మొట్టమొదటి సారిగా డ్రీమ్‌సాంగ్స్(తేరే బినా ఆగ్ యే చాందినీ...., ఘర్ ఆజా మేరే పరదేశి....) రూపొందించటం జరిగింది. ఇప్పుడు ఇంచుమించు ప్రతీపాటా డ్రీమ్‌సాంగే! 'ధమ్ భర్ కో ఉధర్ ముహ్‌ఫేరే' అనే శృంగార గీతం కూడా (రాజ్‌కపూర్, నర్గీస్‌లపై చిత్రీకరించారు) ఈ చిత్రంలో వుంది.


'ఆవారా'చిత్రంలో రాజ్‌కపూర్, నర్గీస్

శంకర్ -జైకిషన్‌లకు 'నగీనా', 'కాలీ ఘటా', 'బాదల్' చిత్రాలు కూడా మంచి పేరు తీసుకురాగా, 'దీదార్'(హుయే హమ్ జిన్కేలియే బర్‌బాద్...., బచ్‌పన్ కే దిన్ భులా న దేనా...), 'జాదూ' చిత్రాలు నౌషాద్ కు మంచి హిట్స్.

'తరానా' చిత్రం కోసం లతా -తలత్ మొహమూద్‌లు కలిసి పాడిన 'సీనే మైఁ సులఘ్‌తే హైఁ అర్మాన్ ...' అనిల్‌బిశ్వాస్‌కు చివరి హిట్ గీతం.

'మల్హార్' చిత్రం రోషన్‌కు మరో చక్కటిబ్రేక్ నిచ్చింది. 'తారా టూటే దునియా దేఖే...', 'హోతా రహాయూఁ అగర్ అంజామ్ వఫా కా...', 'బడే అర్మానోఁసే రఖా', 'ఎక్ బార్ అగర్ తూ..' వంటి హిట్ పాటల ద్వారా అప్పటి వరకూ సరిగా గుర్తింపులేని ఇందీవర్‌కు చక్కటి గుర్తింపు లభించింది.


అనిల్‌బిశ్వాస్


'నౌజవాన్' చిత్రంలో నళిని జయవంత్,ప్రేమ్‌నాథ్

'అదా', 'మద్‌హోష్' చిత్రాల ద్వారా లతామంగేష్కర్‌తో మదన్‌మోహన్ అనుబంధం ప్రారంభమయింది.

'నౌజవాన్', ' బహార్', 'బాజి', 'సజ్జా','బుజ్‌దిల్' చిత్రాలతో దాదా బర్మన్ తన హవా కొనసాగించారు.

'నౌ జవాన్' చిత్రంలోని 'ఠండీ హవాయిఁ....' పాటను ఇన్‌స్పిరేషన్ గా తీసుకుని 15 సంవత్సరాల తర్వాత 'మమత' చిత్రం కోసం 'రహెన్ న రహెఁ హమ్...' పాటను రోషన్ మలిస్తే, దాదా సుపుత్రుడు ఆర్.డి.బర్మన్ అదే ట్యూన్ ఉపయోగించి 'సాగర్'(1985) చిత్రం కోసం 'సాగర్ కినారే....'పాటను రూపొందించారు. ప్రముఖంగా చెప్పుకోవలసిందేమిటంటే లతా మంగేష్కర్ ఈ వ యా డ ం పాటలను గానం చేయటం.


'సాగర్' చిత్రంలో భరత్ భూషణ్, నర్గీస్

'బహార్' చిత్రంతో ఎ.వి.యం ప్రొడక్షన్స్‌తో దాదా అను బంధం మరింత గట్టిపడింది.


'బాజీ' చిత్రంలో గీతాబాలి, దేవ్ ఆనంద్

ఓ.పి.నయ్యర్ 'ఆర్ పార్'తో గీతారాయ్(దత్) కు ఓ సెక్సీ గాయని ఇమేజ్ ఇచ్చాడనుకుంటారు. కానీ దానికి మూడు సంవత్సరాల మునుపే బర్మన్ 'తబ్‌దీర్ సే బిగడీ హుయీ' పాడించాడు. 'బాజీ' కోసం గీతా పాడిందీ పాట. లతా ' తుమ్ న జానే కిన్ జహాఁ మేఁ ఖోగయే...'పాట కూడా హిట్టే! బర్మన్-సాహిర్ టీమ్ స్థిరపడింది.

'బుజ్‌దిల్ 'కై శైలేంద్ర, కైఫీ అజ్మీ సంయుక్తంగా రచించిన 'రోతే రోతే గుజర్ గయీ రాత్ రే...' ద్వారా ఓ పాటకు ఇద్దరు రచయితలు పనిచేయటం జరిగింది. దర్శకుడు బి.ఆర్.చోప్రా తొలి చిత్రం 'అఫ్సానా'. హుస్నలాల్ - భగత్‌రామ్‌లు ఈ చిత్రానికి సంగీత దర్శకులు.


'అఫ్సానా' చిత్రంలో వీణ

# ఫిబ్రవరి 14 వాలంటెయిన్స్ డే సందర్భంగా ప్రేమను నిర్వచించే కొన్ని గీతాలు

## చిత్రం : కొడుకు - కోడలు

రచన : ఆత్రేయ | సంగీతం: కె.వి.మహదేవన్ | గానం: సుశీల, జానకి

ఇదేనన్నమాట - ఇది అదేనన్న మాట
మతి మతిలో లేకుంది - మనసేదోలాగుంది అంటే -
ఇదేనన్న మాట - ఇది అదేనన్నమాట
ప్రేమంటే అదోరకం పిచ్చన్నమాట
ఆ పిచ్చిలోనె వెచ్చదనం వున్నదన్నమాట
మనసిస్తే మతి పోయిందన్నమాట
మతిపోయే మత్తేదో కమ్మునన్నమాట... ॥ఇదే॥
కొత్త కొత్త సొగసులు మొగ్గ తొడుగుతున్నవి
అవి గుండెలో వుండుండి - గుబులు రేపుతున్నవి
కుర్రతనం చేష్టలు - ముద్దులొలుకుతున్నవి
అవి కునుకురాని కళ్ళకి ౦ -
కలలుగా వచ్చినవి- ॥ఇదే॥
ఆడదాని జీవితమే అరిటాకు అన్నారు
అన్నవాళ్ళందరూ అనురాగం కోరారు
తేటి ఎగిరిపోతుంది, పువ్వు మిగిలిపోతుంది
తేనె వున్న సంగతే తేటి గుర్తు చేస్తుంది ॥ఇదే॥
వలపే ఒక వేదన
అది గెలిచిందా తీయన
కన్నెబ్రతుకే ఒక శోధన
కలలు పండిస్తే సాధన
మనసు మెత్తపడుతుంది - కన్నీటిలోన
మమతల పంటకదే - తొలకరి వాన.. ॥ఇదే॥

## చిత్రం : నాలుగు స్తంభాలాట

రచన: వేటూరి | సంగీతం: రాజన్-నాగేంద్ర | గానం: బాలు, సుశీల

అ: చినుకులా రాలి నదులుగా సాగి
వరదలై పోయి కడలిలా పొంగు
నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
నదివి నీవు కడలి నేను
మరచిపోబోకుమా మమత నీవే సుమా ॥చినుకు॥
అ: ఆకులు రాలే వేసవిగాలీ నా ప్రేమ నిట్టూర్పులే
కుంకుమ పూసే వేకువ నీవై తేవాలి ఓదార్పులే
ఆ: ప్రేమలు కోరే జన్మలలోనే నే వేచి వుంటానులే
జన్మలు దాటే ప్రేమను నేనై నే వెల్లువౌతానులే
అ: ఆ చల్లనే చాలులే
ఆ: హిమము లా రాలి సుమములై పూచి
ఋతువులై నవ్వి మధువులై పొంగు
నీ ప్రేమ నా ప్రేమ నీ పేరే నా ప్రేమ
శిశిరమైనా శిథిలమైనా
విడిచి పోబోకుమా విరహమై పోకుమా
ఆ: తొలకరి కోసం తొడిమను నేనై అల్లాడుతున్నానులే
పులకరమూదే పూవుల కోసం వేసారుతున్నాను లే
అ: నింగికి నేల అంటిసలాడే ఆ పొద్దు రావాలిలే
నిన్నను నేనై రేపటి నీవై నా ముద్దు తీరాలిలే
ఆ: ఆ తీరాలు చేరాలిలే
అ: మౌనమై మెరిసి గానమై పిలిచి
కలలతో అలసి గగనమై ఎగసె
నీ ప్రేమ నా ప్రేమ తారాడే నా ప్రేమ
భువనమైన గగనమైన
ప్రేమ మయమే సుమా ప్రేమ మనమే సుమా ॥చినుకు॥

## చిత్రం : పెళ్ళిసందడి

రచన : సీతారామశాస్త్రి | సంగీతం: కీరవాణి | గానం: బాలు, చిత్ర

ప॥ హృదయమనే కోవెల తలుపులు తెరిచే తాళం!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
త్యాగమనే దేవత సన్నిధి వెలిగే దీపం
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
అణువణువును చెలిమికి అంకితమిచ్చును ప్రేమ!
తను నిలువున కరుగుతు కాంతి పంచునది ప్రేమ!
గగనానికి నేలకి వంతెన వేసిన వానవిల్లు ఈ ప్రేమ!!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
చ॥ ఇవ్వడమే నేర్పగల ఈ ప్రేమ
తన కొరకు ఏ సిరిని అడగదు కదా!
నవ్వడమే చూపగల ఈ ప్రేమ
మంటలనె వెన్నెలగ మార్చును కదా!
గాలికి గంధము పూయడమే
పూలకు తెలిసిన ప్రేమ సుధ!
రాలిన పూవుల జ్ఞాపకమే
కాలం చదివే ప్రేమ కథ!!
ప్రియమైన తనవారి సుఖశాంతులే
కోరి మురిసేటి గుణమే ప్రేమ
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ!
చ॥ ఏ జతనో ఎందుకో విడదీసి
వెంటాడి వేటాడు ఆటే ప్రేమ
మౌనముతో మనసునే శ్రుతిచేసి
రాగాలు పలికించు పాటే ప్రేమ
శాశ్వత చరితల ఈ ప్రేమ
మృత్యువు ఎరగని చిరునామా!
శ్వాసను మంగళహారతిగా వెలిగించేదే ఈ ప్రేమ!!
మరణాన్ని ఎదిరించి మరుజన్మగా వచ్చి
కరుణించు వరమే ప్రేమ!!
ప్రేమ! ప్రేమ! ప్రేమ! ప్రేమ! ॥హృదయమనే॥

## చిత్రం : ఈ అబ్బాయి చాలా మంచోడు

రచన: చంద్రబోస్ | సంగీతం: కీరవాణి | గానం: కీరవాణి, గంగ

అ: ఒక మనసుతో మనసుకి ముడి ఎట్టా వేస్తావు
ఆ ముడి ఒక కొంగుముడయ్యేదాకా వూరుకోవు....ప్రేమా.... ॥ఒక॥
అ: పసిపాపలో ముసినవ్వులా కపటాలు లేని ప్రేమ
ముని మాపులో మరుమల్లెలా మలినాలు లేని ప్రేమ
ఆ: అర చేతిలో నెలవంకలా తెరచాటు లేని ప్రేమ
నది గొంతులో అల పాటలా తడబాటు లేని ప్రేమ
ఇద్దరు: మనసుల కలిమిడి ఫలితం ప్రేమ
తనువుల తాకిడి కాదు సుమా
అనంత జీవ యాత్రలోన తోడు ప్రేమ...ప్రేమా... ॥ఒక॥
అ: అధరాలలో తడిమెరుపులా మెరిసేది కాదు ప్రేమ
హృదయాలలో ధృవతారలా అలరారుతుంది ప్రేమ
ఆ: పరువాలతో కరచాలనం చేసేది కాదు ప్రేమ
ప్రాణాలలో స్థిరబంధనం నెలకొల్పుతుంది ప్రేమ
ఇద్దరు: మమతల అమృత వర్షిణి ప్రేమ
కోర్కెల అలజడి కాదు సుమా
నిశీధిలోను విడిపోని నీడ ప్రేమ ప్రేమా.. ॥ఒక॥






నలభై ఏళ్లుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది

సంగీత దర్శకుడిగా ప్రఖ్యాతి గల పెండ్యాల నాగే 'స్వర'రావుగారు నవ్వుతూనే మాట్లాడేవారు. ఆయనకి ఆ నవ్వే ఆభరణం. ఇంకే ఆభరణాలూ వుండేవికావు. హార్మోనీ పెట్టె ముందు పెట్టుకుని కూచుంటే ఎన్నెన్ని రాగాలో, ఎన్నెన్ని వరసలో! సంగీత కార్యక్రమాల్లో డైరక్టరు, పాట రచయితలతో కూర్చుని, తన పనిలో తాను నిమగ్నమై వున్నా, వాళ్లువేసే జోకులు వింటూ ఆనందిస్తూ వుండేవారు. చమత్కార ప్రియుడు. 'ప్రచండభైరవి' అన్న సినిమాకి ఆరుద్రగారు పాట రాసి తీసుకొచ్చారు. "అంత్య ప్రాసలు బాగా పడ్డాయి. ట్యూన్ ఎలా ఇస్తారో" అన్నారారుద్ర. "ట్యూన్ కూడా అంత్య ప్రాసలాగానే వుంటుంది. అలాగే చేద్దాం" అన్నారు పెండ్యాల. ఆరుద్రగారు అదోలా చూస్తే- "అంత్య ప్రాస మీటరు ఒకేలా వుంటుంది గనక, ట్యూన్ కూడా అదే మీటర్లో అలాగే వుంటే అంత్యప్రాస అత్యంత ఆనందంగా కుదుర్తుంది. దాన్ని అంత్యస్వరం అందాం'' అని చమత్కరించి నవ్వారు నాగేశ్వర్రావు. చిరుగడ్డాన్ని చిటికెన వేల్తో సర్దుకుంటూ చిరునవ్వారు ఆరుద్ర.

పెండ్యాలగారికి 'ఉదయనడక' అలవాటు. చాలా ఫాస్ట్‌గా, క్లయిమాక్స్ సంగీతం బీటులా చకచకా నడిచేవారు. నిత్యం తప్పనిసరి కార్యక్రమం. అయితే, వాకింగ్ డ్రెస్ వేరే ఏదీ లేదు. ఎప్పుడూ వేసుకొనే తెల్లపంచె, జుబ్బాతోనే, చెప్పులతోనే చక చక నడక. పంచె కొంగు కుడిచేత్తో పట్టుకుని మరీ నడక. "ఇదేమి లాహిరి, ఇదేమి గారడి, ఎడారిలోన పూలుపూచి ఎంత సందడి" అన్న పాటలా సాగేదా నడక.

శ్రీకాకుళంలో సుకుమార్ ఆర్కెస్ట్రా రజతోత్సవానికి పెండ్యాలగారు ముఖ్య అతిథి. పెండ్యాలగారిని తీసుకొని నేనూ, (చెప్పకేం - సుకుమార్ ఆర్కెస్ట్రా స్థాపకుణ్ణి నేనే గదా) జి.ఆనంద్ హౌరా మెయిల్లో మద్రాసు నుంచి శ్రీకాకుళం బయల్దేరాం. దార్లో ఆయన "రేపు


పెండ్యాల

వాకింగ్ పోతుంది ఎల్లుండి అరసవెల్లి వెళతాం గనక, గుడిచుట్టూ ప్రదక్షిణాలు ఎక్కువ చేస్తే పుణ్యం, పురుషార్థం దక్కుతాయి. వాకింగ్ అయిపోతుంది'' అని ప్రకాశంగానే ఆలోచిస్తున్నారు. మెయిలు బండి బెజవాడ చేరేసరికి ఉదయం ఆరుగంటలు. బెజవాడ వచ్చిందని మేం లేచాం. పెండ్యాలగారు కనిపించలేదు.

"కాఫీ బండిలోకే తెప్పిస్తున్నాం గదా, ఈయన కాఫీకి దిగారా ఏమిటి?" అన్నాన్నేను. "పేపర్ కోసం దిగారేమో'' అన్నాడానంద్. సరిగ్గా బండి బయల్దేరే వేళకి పెండ్యాలగారు చెమట్లు కక్కుకుంటూ వచ్చి కోచ్‌లో పడ్డారు. "అమ్మయ్య వాకింగ్ అయిపోయింది" అన్నారు ఆనందంగా. "బండి ఎలాగూ ఇక్కడ అరగంట పై చిలుకు ఆగుతుంది. పొడుగాటి ప్లాటుఫారం వుంది. ఇంకేం ఈ చివరి నుంచి ఆ చివరి వరకూ రెండు సార్లు తిరిగేసరికి సరిపోయింది. కాకపోతే మధ్య మధ్యలో జనాన్ని తోసుకుంటూ వెళ్లవలసి వచ్చింది'' అన్నారు పెండ్యాల తృప్తిగా, ఆనందంగా నవ్వేస్తూ. అందులో జోక్‌లేక పోయినా మేమిద్దరమూ కూడా నవ్వాం గలగలా.

* * *

కె.వి.రెడ్డిగారు జనమెరిగిన, జగమెరిగిన డైరక్టరు. "డైరక్టరంటే డైరక్టరే" అంటారు తక్కిన డైరక్టర్లు. ఆ దర్శకుడు 'ఆదర్శ'కుడు. ఆయన అన్ని సినిమాల్లోనూ హాస్యం నేతి గారెలు తింటున్నట్టుంటుంది. బెల్లం పాకంలో దిబ్బరొట్టె ముంచుకునో, ఆవకాయ నంచుకునో తిన్నట్టుం టుంది. 'గుణసుందరి కథ' 'పాతాళభైరవి' 'మాయాబజార్' 'పెద్దమనుషులు' 'పెళ్లినాటి ప్రమాణాలు'' 'దొంగరాముడు' ఇలా ఏ సినిమా తీసుకున్నా కథలో, కాఫీలో డికాక్షను కలిసినట్టు హాస్యం కలిసిపోయి గొల్లుగొల్లున నవ్విస్తుంది. అమిత హాస్య ప్రియుడు, సీరియస్ గా కనబడ్డా! నవ్వుతారు, పగలబడి మన చేత నవ్విస్తారు. సాదాసీదా దుస్తులు, సింపుల్ పంచె, మోచేతుల


కె.వి.రెడ్డి

వరకూ చొక్కా, చొక్కాజేబులో పర్సు, కాయితాలు పెన్ను వగైరాలు అక్కడేదో 'పీఠభూమి' వున్నట్టనిపిస్తాయి. భుజం మీద కండువా, కాళ్లకి

చెప్పులూ. కె.వి.రెడ్డిగారిని చూడాలని తహతహలాడి పోతున్న ఓ మిత్రుడికి వాహిని స్టూడియోలో దూరంగా నిలబడివున్న రెడ్డి గారిని చూపిస్తే "ఆయనా! ఆయనా కె.వి.రెడ్డిగారు! జోక్ చెయ్యకు. పల్లెటూరి వాళకంలోవున్న ఆ డ్రెస్సూ ఆయనా- ఆయనా కె.వి.రెడ్డిగారు!" అని అరగంట పాటు ఆశ్చర్య పోయాడు. ఆయన్ని ఏదోలా ఊహించుకున్న ఆ సుమిత్రుడు.

ఆయన ఫోటోలు కనిపించేవికావు. ఫోటోలకీ, స్టేట్‌మెంట్లకీ ఆయన 'మద్రాసుకి ఢిల్లీకి' వున్నంత దూరం. పబ్లిసిటీ కిట్టదు. పత్రికల్లో ఇంటర్వ్యూలు అక్కర్లేదు. నేనోసారి పత్రికలో రాయడానికి ఇంటర్వ్యూ అడిగితే, "నాకెందుకూ పబ్లిసిటీ? నా సినిమా గురించి రాయండి. అదైనా ఇప్పుడు కాదు, రిలీజుముందు. రిలీజయిన తర్వాత ఎవరూ రాయక్కర్లేదు. బాగుంటే అదే పబ్లిసిటీ. బాగులేకపోతే ఏంరాసీ, ఏ ప్రయోజనం లేదు" అన్నారు. ఈ స్టేట్‌మెంటయినా రాసుకోవచ్చునేమో అనిపించింది 'మది'లో. 'రాసుకోవచ్చునా' అని అడిగితే? కలవరమాయె మదిలో, నా మదిలో!

'జగదేకవీరుని కథ' షూటింగులో వుంది. ఆయన షూటింగుకి విజిటర్లని రానివ్వరు. మరీ ఇన్‌ఫ్లుయన్సు మీద వస్తే ఒకరిద్దరు. సెట్లో చాలా డిసిప్లిన్డ్. స్ట్రిక్ట్ సైలెన్స్! షూటింగు చూడనివ్వరు, రషెస్ చూడనివ్వరు. తానూ ఎడిటరూ సహాయకులూ తప్ప ఇంకెవరూ రష్ చూడ్డానికి లేదు. ఎప్పుడైనా నిర్మాతలు.!

'శివశంకరి' పాట చిత్రీకరణ అయి, ఎడిటింగ్ అయింది. "హీరో అనేక స్థానాల్లో కూచుని, వాద్యాలు వాయించడం, పాడడం, ఆ ట్రిక్ షాట్స్ బాగా వచ్చాయట" అని అందరూ (చూడనివాళ్లే!) చెప్పుకుంటూ వుంటే హీరో రామారావుగారు కూడా విని, కె.వి.రెడ్డిగారిని అడిగారు. "బాగా వచ్చిందట పాట, చూడాలని వుంది" అని. ఎంత వినయం, ఎంత భయం! ఫక్కున నవ్వారు కె.వి. "బాగానే వస్తుందిలే. ఇంకా నేనే సరిగా చూడలేదు. చూద్దాం తర్వాత" అని దాటవేసి, "ఆఁ...ఇవాళ ఎవరిది షూటింగు? ఎక్కడ?" అంటూ మాట మార్చారు, ముందుకు అడుగులు వేస్తూ.

కె.వి.గారికి సన్మానాలు, సత్కారాలూ కూడా కిట్టవు, మరీ ప్రెషరుంటే తప్ప. అలాగే ఫంక్షన్లు, ఓపెనింగ్‌లూ. ఒక నిర్మాత, తాను కొత్త సినిమా ఆరంభిస్తూ షూటింగ్ మొదటినాడు కె.వి.గారిని కెమెరా స్విచ్ ఆన్ చెయ్యవలసిందిగా ఆహ్వానించాడు, ఆయన అందుకు అంగీకరించడం కష్టం అని తెలిసినా. ఓ క్షణం వూరుకుని, "చేస్తాను. కాని ఒకటి గుర్తుంచుకోండి. 'చివరికి మిగిలేది' సినిమాకి నేనే కెమెరా స్విచ్ ఆన్ చేశాను" అన్నారు కె.వి.రెడ్డి. ('చివరికి మిగిలేది' సినిమా బాగానడవలేదు. తన హస్తవాసి అలాంటిదేమో ఆలోచించుకోండి అని చమత్కరించారు) దాంతో ఆ నిర్మాత ఏం మాట్లాడలేక పోయాడు. "అయినా ఫర్వాలేదు. మీరే రావాలి" అనలేదు, "అయితే వొద్దులెండి" అననూ లేదు. ఏమాటా చెప్పకుండా 'మళ్ళీవస్తాను' అన్నమాట మిషమీద తప్పించుకున్నాడు. తన అస్త్రం పనిచేసినందుకు, ఘటోత్కచుడికి అభిమన్యుడి బాణం తగిలితే 'ఎంత దెబ్బ కొట్టినావురా' అని తలపట్టుకున్నప్పుడు అభిమన్యుడు సంతోషించినట్టు సంతోషించారు కె.వి.

* * *

'దొంగరాముడు' సినిమాలో కాంతమ్మ అనే ఆవిడ, రేలంగికి తల్లి. (ఈ కాంతమ్మే 'యోగి వేమన'లో వేమన ఉంపుడు కత్తెకి తల్లి, గుర్తుకు తెచ్చుకోడానికి) ఆ సినిమా షూటింగు తన దృశ్యం అయిపోయినా కాంతమ్మ కూచుంది, తనకేదైనా క్లోజప్ తీస్తారేమోనని. తియ్యలేదు. "ఎంత సేపూ జమునకి వాళ్ళకీ తీస్తారు క్లోజప్పులు! నాకెందుకు తీస్తారు?" అని ఆమె గొణుక్కుంది. ఆ గొణుగుడు సారాంశం ఎలాగో కె.వి.రెడ్డిగారు విన్నారు. కాంతమ్మని పిలిచారు. "ఏం కాంతమ్మా నీకు క్లోజప్ తియ్యాలా!.. క్లోజప్



'దొంగరాముడు'లో కాంతమ్మ

అంటే ఏమిటనుకున్నావు? తెరనిండా నీ ముఖమే కనిపిస్తుంది. ఆ ముఖాన్ని జనం భరించొద్దూ! జనం భరించగలిగితేనే క్లోజప్. ఏమంటావ్?" అని నచ్చజెప్పినట్టు చెప్పారుట. "నేనేమంటాను బాబూ.. ఏమీ అనను. అవును నాకెందుకు లెండి క్లోజప్పు..నిజమే" అంటూ కాంతమ్మ వెళ్లి పోయిందిట. తన 'చురక' బాగానే పనిచేసింది మళ్లీ ఎవరూ క్లోజప్ మాట ఎత్తరు అనుకున్నారు కె.వి.

ఈ కె.వి.రెడ్డిగారు అంతకు ముందు వాహిని సంస్థలో ప్రొడక్షన్ మేనేజరు. అంతకు ముందు క్యాషియరు, వాహిని 'వందేమాతరం' 'సుమంగళి' సినిమాలు తీస్తున్న రోజుల్లో కొందరు ఆ ఆఫీసులోనే మకాం. కమలాకర కామేశ్వరరావు, బి.ఎన్.రెడ్డి, నాగిరెడ్డి, కె.వి.రెడ్డి అందరూ కలిసి ఇంగ్లీషు సినిమాలు చూసివచ్చేవారు. కె.వి., కె.కె. ఇద్దరూ ఆఫీసులోనే బస. అంతా కలిసి, చూసి వచ్చిన సినిమా గురించి చర్చించుకునేవారు. బాగోగులు, ఒక్కొక్కరిది ఒక్కొక్క అభిప్రాయం. అంగీకార భేదాలు, అభిప్రాయ భేదాలు వచ్చేవి. ఒక్కోసారి అవి తీవ్రస్థాయికి వెళ్లి పోయేదిట. 'నీకేం తెలుసు?' అంటే 'నీకేం తెలుసు?' అని తెలుగులోనూ భమిటిపాటి కామేశ్వరరావుగారు చెప్పినట్టు 'యూ హౌమచ్ అంటే యూ హౌమచ్' అని



కమలాకర కామేశ్వరరావు

(నువ్వెంతంటే నువ్వెంత)ఇంగ్లీషులోనూ పోట్లాడుకునేవారుట. ఇంకా స్థాయి పెరిగి, 'నోర్మూయ్' 'జాగ్రత్త' అన్న పదాలు కూడా వినిపించేవిట. ఈ తీవ్రవాదం, దూషణ పదజాలం అన్నీ చూసి వచ్చిన ఓ సినిమా గురించి! 'తర్వాత కాస్సేపటికి అందరం శాంతింపబడే వాళ్ళం. పొద్దున్నే లేవగానే అందరం ఒకటే, మామూలే" అని నవ్వుతూ చెప్పేవారు కమలాకర కామేశ్వరరావుగారు నాటి వాహిని విషయాల ప్రసక్తి వచ్చినప్పుడు.

'నర్తనశాల' సినిమా షూటింగులో, సైరంధ్రిని, (సావిత్రి) బండిమీద నిలబెట్టి చేతులు కట్టి లాక్కెళ్లే లాంగ్ షాట్సులో 'డూప్'ని నిలబెట్టారు. సావిత్రికెందుకు శ్రమ కలిగించడం అని.



'నర్తనశాల'లో సావిత్రి

(డూప్ అంటే తెలుసనుకుంటాను. ఒకరి స్థానంలో ఇంకొకర్ని నిలబెట్టి, వారి ముఖం కనిపించకుండా తియ్యడం. ద్విపాత్రాభినయం'లో డూప్ తప్పనిసరి డూప్లికేట్ అన్న మాటనే 'డూప్' అని సూక్ష్మీకరించి వాడతారు) ఒకరోజు వచ్చిన సావిత్రి డూప్, రెండో రోజు రాలేదు. ఇంకొకరెవరో వచ్చారు. "అదేమిటి నిన్నటి అమ్మాయి రాలేదా?" అని అడిగారు దర్శకుడు కామేశ్వరరావు. ఆమెకేదో వేరే షూటింగులో కంటిన్యూటీట వెళ్లిందని సమాధానం వచ్చింది. "ఓహో... అంటే, ఈమె డూప్‌కి డూప్ అన్నమాట" అని చమత్కరించారు దర్శకుడు.

సీరియల్ 9

# హాస్యవల్లరి సంగీతలహరి
# కిశోర్ జీవనఝరి

**- ఎమ్మెస్ స్వాతి**



అరుణ్‌కుమార్ ముఖర్జీ కిశోర్ తల్లి వైపు కజిన్. అతను భాగల్పూర్‌లో ఉండేవాడు. తరచుగా ఖాండ్వా వచ్చి కిశోర్ ఇంట్లో ఉంటూండేవాడు. సంగీతంలో మంచి ప్రావీణ్యత ఉంది. 1945లో రిలీజయిన 'జ్వార్ భటా' సినిమా (దిలీప్‌కుమార్‌ను హీరో చేసినది ఈ సినిమానే) కై అనిల్ బిశ్వాస్ సంగీతదర్శకత్వంలో 'సాంఘ్ కీ బేలా పంఛీ అకేలా' అనే పాట పాడేడు కూడా. ఆయన తప్ప కిశోర్ కుమార్ గాయకుడు అవుతాడని ఎవరూ అనుకోలేదు. ఎవరూ నమ్మలేదు.

కిశోర్ పాడుతున్న ప్రతీసారీ అయన 'ఇదిగో వినండి వీడు ఎంత బాగా పాడుతున్నాడో' అనేవాడు. 'అలా కాదు, ఇలా పాడాలి' అని సజెషన్స్ ఇచ్చేవాడు. చివర్లో 'మంచి గాయకుడు అయ్యే లక్షణాలు నీలో పుష్కలంగా కనబడుతున్నాయి' అనేవాడు. అంతా నవ్వేసి 'సరేలే' అనేసేవారు. ఏదో కిశోర్ అదృష్టం కలిసివచ్చి గాయకుడు అయ్యాడు కానీ అరుణ్‌కుమార్‌దేముంది అని అనుకోకూడదు. అతనూ తర్వాతి రోజుల్లో మంచి సంగీత దర్శకుడయి 'షంషేర్' (1953), 'సమాజ్' (1954) సినిమాలకు సంగీతం అందించాడు. అందువల్ల గాయకుల ప్రతిభ గుర్తించే కౌశలం అతనికి ఉందని ఒప్పుకోవాలి.

**శాస్త్రీయ సంగీతం రాని కిశోర్ సినిమాలకు పనికివస్తాడా?**

ఇక్కడ సాధారణంగా వచ్చే సందేహమే వస్తుంది. శాస్త్రీయసంగీతం నేర్చుకోకుండా ఏదో గాలిపాటలు పాడితే సినిమాలలో పాడగలుగుతారా? సంగీతదర్శకుడు చెప్పిన బాణీలు పట్టుకుని భావయుక్తంగా పాడగలుగుతారా? అని. ఈ నాటికి కూడా ఈ సందేహం చాలామందిని వేధిస్తూంటే 55 ఏళ్ల క్రితం పరిస్థితి ఎలా వుంటుందంటారు? అందుకనే అరుణ్‌కుమార్ మాటలు ఎవరూ విశ్వసించలేదు. కిశోర్ గాయకుడు కాలేడని, యాక్టర్‌గా అయితే భుక్తి అయినా గడుస్తుందనీ అనుకున్నారు. కానీ అరుణ్ కుమార్ సినీరంగంతో పరిచయం వున్నవాడు కాబట్టి ఇంకోలా ఆలోచించగలిగేడు.

ఇక్కడ సినీసంగీతం గురించి కాస్త చెప్పుకోవాలి. అప్పుడే సంగీతం నేర్వని కిశోర్ వంటి యువకుడు గాయకుడిగా, తర్వాత సంగీతదర్శకుడిగా ఎలా పనిచేసి, కోట్లాది శ్రోతలను ఎలా మెప్పించగలిగాడో అర్థమవుతుంది.

**సామాన్యజనం మీడియం - సినిమా**

సినిమా మాధ్యమం సామాన్యజనాలను దృష్టిలో పెట్టుకుని తయారయ్యే కళారూపం. పొలాలలో పనిచేసే రైతులూ, బరువులెత్తుతూండే కూలీలు, పడవలు లాగుతూండే కళాసీలూ వీళ్లందరూ తీసే కూనిరాగాలలో శాస్త్రీయ సంగీతచ్ఛాయ లుండవచ్చు కానీ అవి అచ్చగా రాగాలపై ఆధారపడినవి కావు. శ్రావ్యత, భావస్ఫోరకత వాటి ప్రధాన లక్ష్యం, లక్షణం. నాటకాలకు, సినిమాలకు వచ్చేది కూడా వారే కాబట్టి శుద్ధ రాగాల కంటె అటువంటి కలగలుపు స్వరాల పాటలనే వారు ఆదరించారు.

మామూలు జీవితంలో పాటలు

**కిశోర్ ఆదర్శగాయకుడు - సైగల్**



కిశోర్ బొంబాయిలో అడుగుపెట్టిన కొన్నాళ్లకే 1947 జనవరి 18 న కుందన్‌లాల్ సైగల్ మరణించాడు. అప్పటి కాయన వయసు 42 సంవత్సరాలు మాత్రమే! అంత తక్కువ కాలంలోనే సినిమారంగానికి 'తాన్‌సేన్' వంటివాడనిపించుకున్నాడు. తమాషా ఏమిటంటే కిశోర్‌లాగే సైగల్ కూడా శాస్త్రీయసంగీతం నేర్చుకోలేదు. జమ్మూలో 1904 లో పుట్టిన సైగల్ రామలీలా ఉత్సవాలలో సీత వేషం వేసేవాడు. సంగీతం నేర్చుకున్నది సూఫీ వేదాంతి సల్మాన్ యూసుఫ్ వద్దనే! సంగీతం కంటె 'కోరా' పద్ధతిలో సాహిత్యానికే ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవాడు. గాలిబ్ కవిత్వం, గజళ్లు పాడడానికి సైగల్ మార్గమే అందరికీ ఆదర్శప్రాయమైంది. కలకత్తాలో టైప్‌రైటర్ కంపెనీకి సేల్స్‌మన్‌గా పనిచేస్తూండగా బి.ఎన్.సర్కార్ కంటబడడం జరిగింది. న్యూ థియేటర్స్ వారి ఆర్.సి.బోరల్, తిమిర్ బరన్, పంకజ్ మల్లిక్ సైగల్ గానకౌశలాన్ని తీర్చిదిద్దారు.

బెంగాలీ 'దేవదాస్' లో చిన్న పాత్రవేసి రెండుపాటలు పాడారు. దాని తమిళవెర్షన్ (1936)లో కూడా రెండుపాటలు పాడారు. తర్వాత దీదీ, దేశేర్ మాటీ వంటి బెంగాలీ సినిమాలలో పేరు తెచ్చుకున్నారు. నటుడుగా, గాయకుడుగా న్యూ థియేటర్స్ వారి సినిమాల (ప్రెసిడెంట్, జీబన్ మరణ్, స్ట్రీట్ సింగర్) ద్వారా చాలా ఖ్యాతి సంపాదించుకున్నారు. 1940లో బొంబాయికి మకాం మార్చిన తర్వాత భక్త సూరదాస్, తాన్‌సేన్, తద్‌బీర్, పర్వానా (ఆయన ఆఖరి చిత్రం) లో నటించారు. అప్పటికే ప్లేబ్యాక్ సిస్టమ్ వేళ్లూనుకుంది. హీరో, హీరోయిన్లకు పాడడం రాకపోయినా ఫర్వాలేదన్న పరిస్థితి రావడంతో అందానికి ప్రాధాన్యం పెరిగింది. సైగల్ స్థూలకాయం హీరోవేషాలకు నప్పదని తెలిసిపోయింది. పోనీ పాటలు పాడే అవకాశం ఉన్న కారెక్టర్ రోల్సు వేద్దామనుకుంటూండగానే జబ్బు చేసింది. చికిత్సకై జలంధర్ వెళ్లినా ప్రయోజనం లేకపోయింది.

పాడకపోయినా మరి స్టేజిపై పాటలు ఎందుకు వచ్చాయి? రెండు పాత్రలు మాటలలో వ్యక్తీకరించడానికి బిడియపడే భావాలను పాటలలో చెప్పడం అనేది మనకు ఆనవాయితీ అయిపోయింది. మనసులోని భావాలను వాచ్యా చెప్పడానికి కుదరని సందర్భాలలో నేపథ్యగీతం ద్వారా చెప్పడం సులభమయింది. భజనలు, కీర్తనలు మన జనజీవితంలో ఎలాగూ అలవాటే కాబట్టి మనసులోని ప్రణయభావాలను ఎదుటివారికి తెలుపడానికి రాధ మీదో, కృష్ణుడిమీదనో పెట్టి పాడడం అనువుగా ఉండింది. విదేశీయులకు ఇప్పటికీ మింగుడుపడనిదీ, మనకు మాత్రం ఏ మాత్రం ఎబ్బెట్టుగా ఉండనిదీ సినిమాలో పాటలు పాడడమే!

### సినిమా సంగీతం విలక్షణత

నాటకరంగం కంటె విస్తృతి ఎక్కువ కావడంతో సినిమారంగం సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చింది. ముఖ్యంగా హిందీ సినిమారంగం తక్కిన వారిని ప్రభావితం చేసింది కాబట్టి హిందీ సినీసంగీతాన్ని పరామర్శిస్తే సరిపోతుంది. పలుప్రాంతాలనుండి వచ్చిన సంగీత కళాకారులు హిందీ చిత్రసీమను వైవిధ్యంతో సుసంపన్నం చేశారు. తమ తమ ప్రాంతాలలో వారు వాడే వాయిద్యాలను హిందీ తెరకు పరిచయం చేశారు. క్రమేణా గాయకుడి గొంతుమీద, అతని శాస్త్రీయజ్ఞానం మీద పూర్తిగా ఆధారపడవలసిన అవసరం తప్పిపోయింది.

ముందులో క్లాసికల్ మ్యూజిక్ పై ఆధారపడిన సంగీతం గులామ్ హైదర్ (తెరకు ఢోలక్ తెచ్చినది ఈయనే) రాకతో ఫోక్ వైపు మళ్లింది. గ్రామీణ ప్రజలను త్వరగా ఆకట్టుకోగలిగింది. ఇదే దాని ప్రధాన లక్షణం అని చెప్పాలి. డైనమిక్‌గా, ఎప్పటికప్పుడు మార్చుకుంటూ, కాలానుగుణంగా రూపుదిద్దుకుంటూ ముందుకు సాగడం వల్లనే హిందీ సినిమా సంగీతం ఈనాడు పెద్ద పరిశ్రమగా నడుస్తోంది. '30లు, '40లలో సింపుల్‌గా ఉండే సంగీతం కిశోర్ అడుగుపెట్టేనాటికి ప్రయోగాల దశలో ఉంది. పాశ్చాత్యసంగీతం నుండి అరువు తెచ్చుకోవడమే కాక, క్లాసికల్ సంగీతంతో కూడా ప్రయోగాలు జరిగాయి ఆ కాలంలో. ఎన్నో వాయిద్యాలు రంగప్రవేశం చేశాయి.

### తొలినాటి సినీగీతాలు

సినిమాలు టాకీలుగా మారినది 1931లో. తొలినాటి కొన్నిపాటలను గమనించండి - 'యే తసరుఫ్' (న్యూ థియేటర్స్ వారి 'యహూదీ కీ లడ్కీ',(1933) పంకజ్ మల్లిక్ సంగీతం) పాటలో సైగల్ గొంతుకు సహకరించినవి రెండే వాయిద్యాలు - హార్మోనియం, తబలా. 'తేరీ గఠరీ మే లగా చోర్' (న్యూ థియేటర్స్ వారి 'ధూప్ ఛావ్' , సంగీతం - పంకజ్ మల్లిక్, ఆర్.సి.బోరల్) పాటలో కె.సి.దే కు సహకరించినవి కూడా ఆ రెండే! 1936 లో ప్రభాత్ వారి 'అమర్‌జ్యోతి' కై



'సునో సునో బాంకే ప్రాణీ' పాట శాంతా ఆప్టే పాడుతూండగా జలతరంగ్ కూడా వినబడుతుంది. 1939 నాటికి 'కపాల్‌కుండలా' కై 'పియా మిలన్ కో జానా' స్వీయ సంగీత దర్శకత్వంలో పాడేటప్పుడు పియానో, ఎస్‌రాజ్ ఉపయోగించారు పంకజ్ మల్లిక్. 1942 లో నూర్జహాన్ పాడిన 'తూ కౌన్ ఏ బద్లీ మై' లో ఆర్గన్, 1944 లో జోహ్రా బాయి అంబాలా పాడిన 'అఖియా మిలాకే' (రతన్) లో క్లారినెట్, 'ఆయేగా ఆనేవాలా' (మహల్)లో వయొలిన్ వినబడతాయి. ఇలా శ్రోతలకు అనేక రకాల సంగీతాలను వినిపించి ఆకట్టుకున్నారు తొలి సంగీతకారులు.

సినిమాసంగీతం రూపురేఖలు



నిర్ణయించడంలో అనిల్‌బిశ్వాస్ ప్రముఖపాత్ర వహించారు. సింపుల్‌గా ఉంటూ, శాస్త్రీయ సంగీతం కంటె లలిత సంగీతానికి దగ్గరగా మసలుతూ, పాటలోని మాటలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తూ (శాస్త్రీయసంగీతంలో సాహిత్యం పాత్ర తక్కువగా ఉంటుంది) ఏ సంగీతానికి పూర్తిగా కట్టుబడకుండా స్వేచ్ఛగా సినిమా పాట ఎదిగింది. 50, 60 లలో ఎస్.డి.బర్మన్, శంకర్‌జైకిషన్, సలిల్ చౌధురి మెలొడీలు సృష్టించడానికి వెస్టర్న్, క్లాసికల్, జానపద - దేనినైనా ఉపయోగించడానికి వెరవలేదు. ఈ వాతావరణం కిశోర్ కుమార్‌కు బాగా కలిసివచ్చింది.

### కిశోర్ తొలి అడుగులు

సినిమాలలో చేరడానికి కిశోర్ ఏకైక ఉద్దేశ్యం - సైగల్‌లా పాడాలనుకోవడమే! 'సైగల్ పాటలు అనుకరిస్తూ పాడితే గొప్ప గాయకుడివి అయిపోవు. చాలా కష్టపడాలి తెలుసా?' అని అన్నగారు హెచ్చరించినా కిశోర్ తన ఉత్సాహాన్ని చంపుకోలేదు. స్టూడియోల చుట్టూ తిరిగే టప్పుడు సైగల్ పాటలు పాడి విని పించేవాడు. 'అబ్బే, సైగల్‌కీ నీకూ పోలికెక్కడ' అని వాళ్లు తిరస్కరించే వారు. అలా అవస్థ పడుతూనే 'జిద్దీ' (1948) లో పాడే ఛాన్సు సంపాదిం చాడు. అచ్చు సైగల్‌ను కాపీకొడుతూ పాడేశాడు. ఆ తరువాత పాడిన మూడు, నాలుగు పాటల దాకా ఇదే వరస! ఎందుకంటే సైగల్ మరణించినా అతని శకం ఇంకా అంతరించలేదు. అతని వారసులకై వేట

### కొంటె చేష్టల కిశోర్



కిశోర్‌కి పాటలు పాడడం ఎంత ఇష్టమైనా ఎవరైనా తనను ఎక్స్‌ప్లాయిట్ చేద్దామని చూస్తే సహించేవాడు కాడు. సాటి కళాకారులతో మర్యాదగా ఉంటూనే, ప్రొడ్యూసర్లు గానీ, ప్రోగ్రాం ఆర్గనైజర్స్ కానీ మోసం చేయబోతే లొంగేవాడు కాడు. ఓ సారి ఢిల్లీ లో ఓ ప్రోగ్రాం నిర్వాహకులు అతని పేర టిక్కెట్లు అమ్మేసుకున్నారు. ప్రోగ్రాంకు ఆహ్వానించి స్టేజి ఎక్కబోయే ముందు డబ్బు ఇస్తామన్నారు. కిశోర్ సరేనన్నాడు. తీరా ప్రోగ్రాం స్టార్టవబోతూండగా నిర్వాహకులు డబ్బు ఇంకా రాలేదన్నారు. అక్కడిదాకా వచ్చాక అంతమంది జనం ఎదుట డబ్బు గురించి పేచీపెట్టి పాడకుండా వెళ్లడన్న ధీమా వాళ్లది. ఈ రకంగా చాలాసార్లు జరుగుతూంటుంది కూడా. కానీ కిశోర్ సంగతి వాళ్లకు తెలియదు.

హాల్లోకి వచ్చాక స్టేజి వెనక్కాలకు తీసుకెళ్లి 'డబ్బు ఇంకా అందలేదు. మీరు ప్రోగ్రాం మొదలెట్టేయండి' అని వాళ్లనడంతో కిశోర్‌కి వాళ్ల సంగతి అర్థమయింది. తెరతీయకుండానే మైకు పుచ్చుకుని కిశోర్ అప్పటికప్పుడు పాట కట్టి పాడనారంభించాడు. 'పైసే లావో, మేరా పైసా లావో, జల్దీ లావో, లావో, లావో..' అంటూ. ఆడిటోరియంలో ఉన్న జనాలకు సంగతి పూర్తిగా అర్థమయింది, నిర్వాహకులే ఏదో గోల్‌మాల్ చేస్తున్నారని. వాళ్లని తన్నడానికి సిద్ధమయ్యారు. ఇక లాభం లేదురా అని వాళ్లు అటూ, ఇటూ పరుగులు పెట్టి డబ్బు తెచ్చి కిశోర్ సెక్రటరీ అనూప్ శర్మ కిచ్చారు. శర్మ లెక్కపెట్టి అంతా కరక్టుగా ఉందని సిగ్నల్ ఇచ్చాకనే కిశోర్ స్టేజెక్కాడు.

సాగుతూనే ఉంది. అనిల్ బిశ్వాస్ ముకేష్ చేత పాడించిన 'దిల్ జల్‌తాహై జల్‌నే దో' (పహలీ నజర్), ఓపి నయ్యర్ సి.హెచ్. ఆత్మా చే పాడించిన 'ప్రీతమ్ ఆన్ మిలో' ఆత్మా చేతనే శంకర్-జైకిషన్‌లో 'నగీనా' లో పాడించిన 'రోహూ మై సాగర్ కే కినారే' - ఇవన్నీ ఆ ప్రయత్నంలో భాగాలే! కిశోర్‌కూడా ఆ ప్రభావంలో నుండి బయటపడి తన స్వంత శైలి అలవర్చుకోవడానికి ఏళ్లు పట్టింది.

గాయకుడుగా కిశోర్ ప్రవేశించేనాటికి హేమాహేమీలు రాజ్యం ఏలుతున్నారు. తలత్ మొహమద్, మహమ్మద్ రఫీ, ముకేశ్, మన్నా దే, హేమంత్ కుమార్. సహగాయకు లందరితోనూ కిశోర్ స్నేహంగానే ఉన్నాడు. అందరిపట్లా గౌరవాన్ని ప్రదర్శించాడు. గాయనీమణులైన లతా, ఆశా వంటివారితో కూడా కిశోర్ పేచీపడిన సందర్భాలు లేవు. ఆ మాటకొస్తే కిశోర్ నిర్మాతలను, కొంతమంది దర్శకులను ఏడిపించాడు కానీ సంగీతవర్గంలో అందరితోనూ సుహృద్భావంతో ఉన్నాడు. ఏ సంగీతదర్శకుడిని - సీనియర్ కానీ, జూనియర్ గానీ - తక్కువగా చూసినది లేదు.

**పరిమితులెరిగిన కిశోర్**

తనకు శాస్త్రీయసంగీతం రాదు కాబట్టి తన పరిమితులు బాగా తెలుసుకుని దానికి తగ్గట్టుగానే నడుచుకున్నాడు. దీనికి మంచి ఉదాహరణ - 'పడోసన్'లో 'ఏక్ చతురనార్' పాట.

ఈ పాటకు గురించిన కథ చెప్పుకునే ముందు సందర్భం గురించి చెప్పాలి. 'పాషేర్ బాడీ' (పక్క ఇల్లు) అనే బెంగాలీ చిత్రం ఆధారంగా "పక్కింటి అమ్మాయి" రేలంగి, అంజలితో తయారయింది. తర్వాత ఆ కథ ఆధారంగానే హిందీలో 'పడోసన్' తీశారు. (అసలు బిమల్‌రాయ్ తీద్దామనుకున్నాడు కానీ వీలుపడలేదు. చివరికి మెహమూద్ తీశాడు). పడోసన్ హిట్ అయ్యాక 'చంద్రమోహన్, జయసుధ, చక్రవర్తి, ఎస్.పి.బాలు' లతో ""పక్కింటి అమ్మాయి" సినిమాలో పునర్నిర్మించారు.

కథ ఇలా వుంటుంది - అమాయకుడైన ఒక అబ్బాయి పక్కింటి అమ్మాయిని ప్రేమిస్తాడు. ఆ అమ్మాయికి సంగీతం అంటే చాలా ఇష్టం. అది గమనించి ఆమెకు సంగీతం నేర్పించే మేష్టారు ఆమెను పెళ్లాడదామని చూస్తుంటాడు. అతన్ని ఎదుర్కోవాలని ఈ అబ్బాయి సంగీతం నేర్చుకోబోతాడు కానీ అతనికి పాటలు రావు. అందువల్ల ఒక ఫ్రెండ్ చేత ప్లేబ్యాక్ పాడించుకుని ఆ అమ్మాయిని ఆకర్షిస్తాడు. ఒక రోజు ఆ సంగీతం టీచరుకు, ఈ అబ్బాయికి ..అదే ప్లేబ్యాక్ పాడే మిత్రుడుకి పాటల పోటీ పడుతుంది. అంతా గోలగోలగా పాడి ఆ సంగీతం టీచరును

## కొంటె చేష్టల కిశోర్



ఒకదశలో కిశోర్ ప్రొడ్యూసర్లను, డైరక్టర్లను వేపుకుతిన్నాడు. ఒక డైరక్టరు 'ఇతను నా మాట వినాలి. యాక్టర్ డైరక్టర్ చెప్పిన మాట వినాలి. ఆ మేరకు మీరు ఆదేశం ఇవ్వండి' అని కోర్టు నాశ్రయించాడు. 'అవును, డైరక్టరు చెప్పినది తూచ తప్పకుండా చేయాలి.' అని కోర్టు కిశోర్‌కు ఆర్డరేసింది. 'సరే, అలాగే చేస్తా' అంటూ షూటింగ్‌కి వచ్చాడు కిశోర్.

కారు డ్రైవ్ చేసే సీను షూట్ చేస్తున్నారు. సీన్ అయిపోగానే 'కట్' చెప్పాలి డైరక్టర్. ఖర్మకాలి అతను మర్చిపోయాడు. 'కట్ చెప్పలేదు కాబట్టి నేను డ్రైవ్ చేస్తూనే ఉండాలన్నమాట' అని అర్థం తీసి కిశోర్ అలా డ్రైవ్ చేస్తూనే వెళ్లిపోయాడు. ఎంతదూరమో తెలుసా? బొంబాయి నుండి ఖండాలా దాకా!

ఓడిస్తారు. ఆ సందర్భంలోనిదే ఈ పాట.

**చతుర్‌నార్ పాటలో ఎవరు గెలవాలి?**

పడోసన్‌లో సంగీతం మేష్టారి పాత్ర వేసినది మెహమూద్. అతనికి ప్లేబ్యాక్ పాడినది మన్నాదే. హీరోకి ప్లేబ్యాక్ పాడే ఫ్రెండ్ పాత్ర వేసినది కిశోర్‌కుమార్. అంటే కిశోర్, మన్నాదేల మధ్య ఈ పాట సాగుతుందన్నమాట. ఈ సన్నివేశానికి గాను



రాహుల్‌దేవ్ బర్మన్ ఒక చక్కని క్లాసికల్ ట్యూన్ సమకూర్చాడు.

దాన్ని మెహమూద్ కిశోర్‌కు వినిపించగానే అతడు తల అడ్డంగా ఆడించాడు. "ఈ క్లాసికల్ స్టఫ్ నా వల్ల కాదు. మంచి కామెడీ పాట కదా నీకు కావలసినది. నేను ట్యూన్ చేసి ఇస్తాను. నువ్వు పంచమ్ (రాహుల్ ముద్దు పేరు)కి నచ్చచెప్పు." అన్నాడు.

అని, ట్యూన్ కోసం కిశోర్ గట్టిగా ఆలోచించాడు. అన్నివేళలా అతనికి అన్నగారే ఇన్‌స్పిరేషన్ కదా! 1936 నాటి అశోక్‌కుమార్ సినిమా "జీవన్ నయ్యా" గుర్తుకు తెచ్చుకున్నాడు. దానిలో "ఇక్ చతుర్‌నార్" అనే పాట ఉంది. ఆ పల్లవిని పట్టుకుని పట్టుకుని డెవలప్ చేశాడు. దానికి ట్యూన్ చేశాడు. రాహుల్ కూడా దానికి ఆమోదముద్ర వేశాడు.

అయితే అసలు గండం మన్నాదే రూపంలో వచ్చింది. క్లాసికల్ మ్యూజిక్ అంటే అత్యంత భక్తిప్రపత్తులు వున్న మన్నాదేకు ఈ పాట గురించి చెప్పగానే మండిపడ్డాడు. "నేను క్లాసికల్ పాడినా ఆ పోటీలో ఓడిపోవాలా? అదీ శాస్త్రీయసంగీతం అంటే ఓనమాలు తెలియని కిశోర్‌కుమార్ చేతిలోనా!? నాన్సెన్స్! నేను పాడనే పాడను." అనేశాడు.

మళ్లీ మెహమూద్ (పాపం నిర్మాత కదా) మన్నాదేను బతిమాలాడు." సినిమా స్క్రిప్టు అలా వుంది, మనమేం చేస్తాం? దాని వల్ల నీ శాస్త్రీయసంగీత ప్రతిభకు లోటు వచ్చినట్టు కాదు కదా! ఇది సరదా పాట." అని మన్నాదేను ఒప్పించాడు. ఫైనల్‌గా చక్కటి సరదాపాట తయారయింది.

అలా మన్నాదే మనసుకు కష్టం కలిగించకుండా, ప్రజల కందరికీ నచ్చేట్లు నేర్పుగా తనకు కావలసినది సాధించగలిగేడు కిశోర్! అన్నిటికంటె చెప్పుకోవలసినది మహమ్మద్ రఫీ పట్ల అతను చూపిన స్నేహగౌరవాలు!

**(ఇంకా ఉంది)**

## రీ మిక్స్‌యా? అపచారం!

రీమిక్స్‌ల యుగం ప్రారంభదశలోనే 1987 లో హెచ్.ఎమ్.వి. వారు ఓ మాస్టర్ ప్లాను వేశారు. అలనాటి గొప్పగాయకుడు సైగల్ పాటలు ఈనాటి ప్రఖ్యాత గాయకుడు కిశోర్ చేత పాడించి ఆల్బమ్ రిలీజ్ చేస్తే..? అన్న అయిడియా వచ్చింది వారికి. కిశోర్‌ను అడిగారు. ఆ మహాగాయకుడికి ఇంతకంటె గొప్ప నివాళి అర్పించగలమా? అని కిశోర్‌ను కన్విన్స్ చేశారు. కిశోర్ కూడా పొంగిపోయాడు. అవునవును అన్నాడు. ఏయే పాటలు పాడాలో నిర్ణయించబడింది. ఆర్కెస్ట్రా గురించి కూడా ఫైనలైజ్ చేయడం జరిగింది. కొందరు ఇది కిశోర్ గాయకజీవితంలో ఓ మైలురాయిగా నిలిచిపోతుందన్నారు.

రికార్డింగు కొద్దివారాలుండగా కిశోర్‌కు హఠాత్తుగా అనిపించింది - ఇది ఆ అమరగాయకుడికి ద్రోహం చేసినట్లవుతుందేమోనని. 'నేను అత్యున్నత స్థానంలో నిలుపుకునే గాయకుడి పాటలు నా నోటి వెంట పాడడమేమిటి? ఒకవేళ కొంపదీసి ఈనాటి యువత నాకు ప్రస్తుతం ఉన్న పాప్యులారిటీ కారణంగా సైగల్ ఒరిజినల్ పాట కంటె నా పాటే బాగుందని అనుకుంటే..? అంతకంటె అపచారం ఉంటుందా? నన్నూ ఆయన్ని పోల్చిచూడడం కూడా నాకు దుర్భరం, దుస్సహం.' అనుకుని హెచ్.ఎమ్.వి. వారికి 'నో' అని చెప్పేశాడు.

# దిసీజ్ ఖర్మ... దట్సాల్...!

సత్యమూర్తి BV


ఆ అమ్మాయికి మీరు ఎన్నో గిఫ్టులు ఇస్తూ, దస్తాల కొద్దీ ప్రేమలేఖలు రాస్తుంటారు. అయినా మిమ్మల్ని లవ్ చేయకుండా...


ఏమీ ఇవ్వని మీ క్లాస్‌మేట్ మోహన్ని ప్రేమిస్తుంది.


మీరెంతో కష్టపడి నేర్పి 'రేపు స్కూల్లో నీ ఇంటర్వ్యూలో నీకు తెలిసిన ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్ స్టార్‌ని గబగబా చెప్పేయాలి... ఏం' అని చాక్లెట్ లంచం ఇచ్చి బెల్లిస్తారు.


ఇంటర్వ్యూలో 'నాకు చాక్లెట్టిస్తేనే ట్వింకిల్ ట్వింకిల్ చెప్తా' అని మీవాడు, ఇంటర్వ్యూ చేసిన టీచర్‌తో అంటాడు.


మీరు ఆఫీసుకి 5 నిమిషాలు లేట్‌గా వెళ్తే, మీ వయసు, అనుభవం కూడా చూడకుండా మీ ఆఫీసరు మండి పడ్తాడు.


నిన్నగాక మొన్న జాయిన్ అయిన లల్లీ ఎంత లేట్‌గా వచ్చినా కిక్కురుమనడు...

# ఛత్రపతి బండూ

టప్..టప్..టప్

**బండూ పైకి చూశాడు. వర్షం చినుకులు. కోపంగా చేతిలోని గొడుగు కేసి చూశాడు. వద్దంటున్నా దాన్ని అంటగట్టిన భార్యపై కోపం వచ్చింది. కొత్త గొడుగు కొంటానంటే కాదు, కూడదని పనివాణ్ణి అటక మీద కెక్కించి పాత గొడుగు దింపించి చేతి కిచ్చింది. వర్షం ఎంత వచ్చినా గొడుగు తెరవకూడదనుకున్నాడు.**

**కానీ అతని నిర్ణయం ఎక్కువసేపు నిలవలేదు. వర్షం పెద్దదయ్యింది. ఇప్పక తప్పలేదు. చేతిలో గొడుగు లేని వాళ్ళు ఇటూ అటూ పరుగెత్తడం చిరునవ్వుతో చూస్తూ, కనీసం తనకా గతి పట్టలేదు కదాని సంతోషిస్తూ తన గొడుగు చటుక్కున విప్పుకున్నాడు. గొడుగు కూడా అతి త్వరగా తెరుచుకున్నందువల్ల కొన్న ఎలిక పెంటికలూ, చచ్చిన బొద్దింకలు - వగైరా మామూలు చెత్త అతని నెత్తిమీదా, నెత్తిమీంచి వంటిమీదా పడింది. భార్యని తిట్టుకుంటూ అవన్నీ దులిపేసుకుని, గొడుగు పూర్తిగా విప్పడానికి ప్రయత్నం చేశాడు.**

ఆ పాత గొడుగులో తెరచి వుంచడానికి వుండే చిన్న పీట తుప్పుపట్టి పూడిపోయింది. అంచేత ఆ గొడుగుని తెరచి ఉంచవలసి వస్తే కృష్ణుడు గోవర్ధన పర్వతం పట్టుకున్నట్టు పట్టుకోవలసి వచ్చింది. అలాగే పట్టుకుని వెళుతూంటే, ఇంకొంచెం సేపటికి వూచలని బిగించి వుండే తీగ విరిగిపోయింది. అంచేత 2, 4 వూచలు పొట్టలో గుచ్చిన బాకుల్లాగా గొడుగు గుడ్డలోంచి బయటికి పొడుచుకు వచ్చేశాయి. ఇంకో 3, 4 ఊచలు తురక పెళ్ళికొడుకు ముఖం ముందు వేళ్ళాడే పూలదండల్లాగా బండు ముఖం ముందు వేళ్ళాడాయి. గొడుగు తెరచి వుంచటానికి గోవర్ధన పర్వతంలా పట్టుకోవలసి రావటం వల్ల బాగా క్రిందికి పట్టుకున్నాడు. అంచేత ఎదురుగా ఎవరు వస్తున్నారో, ఏ వస్తువున్నదో సరీగా చూడటానికి వీలు లేకపోయింది.

ఆ కారణం వల్ల ఏదో మెట్ట ప్రదేశం ఎక్కుతున్నామనే భావంతోటే, బండూ రోడ్డు మీద నడుస్తూ ఎవరో అక్కడే వదిలేసిన ఒక చెత్త బండి మీదకు ఎక్కేసి నడిచాడు. కాని ఏటవాలుగా వున్న ఆ బండియొక్క రెండో చివరికి బండూ చేరగానే, అది అమాంతం క్రిందికి వాలిపోయి, బండూని, సైడు కాలువలో కూల వేసింది. ఏది ఏమయినా, అదృష్టం ఏమిటంటే గొడుగును దీక్షగా తెరచి వుండేలాగా పట్టుకోగలిగినందువల్ల, బండూ పైనుంచి పడే వర్షం వల్ల మాత్రం తడవలేదు!

అన్నిటికంటే బండూని ఆనంద పరచినదేమిటంటే ఇలాటి పిచ్చి గొడుగు ధరించినా తనను జనం ఎవరూ పట్టించుకోక పోవడం! కానీ రోడ్డు మీద నడుస్తున్న వాళ్ళందరూ ఎవరో ఒక "బఫూన్"ని గురించి మాత్రం వేళాకోళం చేసుకుంటున్నారు. ఈ "బఫూన్" ఎవరో తెలుసుకోవాలని బండూ కూడా రెండు మూడుసార్లు వెనక్కి తిరిగి చూడడానికి ప్రయత్నం చేశాడు. కాని ఎవరూ కనిపించలేదు. కాని అతగాడెవరో తన చుట్టు ప్రక్కలే వున్నట్టు మాత్రం అందాజుగా గ్రహించాడు. ప్రజలు చేసే కోలాహలాన్ని చూసి తనుకూడా ఒకటి రెండు సార్లు "ఏయ్ బఫూన్!" అని తనూ అరిచాడు. కాని ఆ తక్షణం అక్కడ వున్న వాళ్లంతా ఒక్కటేసారి పెద్దగోల చేయడంతో, బండూకి మనసులో ఒక దుష్ట సందేహం ఏర్పడింది. అంచేత గొడుగు మరింత కిందకు దించి గబగబా నడిచి ఆఫీసుకు చేరాడు.



బండూ గొడుగు తనంతట తాను తెరుచుకుని వుండటానికి ఏ విధంగా సమ్మతించ లేదో, అదే విధంగా ఆఫీసు చేరాక ముడుచు కోవటానికి కూడా సుతరామూ ఒప్పుకోలేదు. గాలిలో వున్న ఈత చెట్టు స్వరూపంలో స్థిరపడిపోయింది. అది ముడుచుకున్న గొడుగులా కనుపించేట్లు చెయ్యాలని బండూ బ్రహ్మ ప్రయత్నం చేస్తుంటే, బండూ వెనకనే ఆఫీసులోకి ప్రవేశిస్తున్న సత్యం పళ్ళికిలిస్తూ "బండూ, పాతకాలం హోల్డాలుని బిగించడానికి తోలు పట్టాలు వాడేవారు చూశావా అవి తీసుకు వుండు యిక మీదట. ఆ మాత్రమయినా లేకపోతే నీ గొడుగు ముడుచుకొని ఉండదు". అన్నాడు.

బండూ బిడియపడుతూ ఒక నవ్వు నవ్వి మెట్ల క్రింద తుక్కుదూగరా వేసే డబ్బాలో ఆ గొడుగు పడేసి, ఆఫీసులోకి వెళ్ళిపోయాడు. పూర్తిగా తడిసిపోయినందువల్ల వంటికి అతుక్కుపోయిన తన బుష్‌షర్టుని జాగ్రత్తగా ఒలుస్తూ, ఒకసారి సత్యం వేపు చూశాడు. చూసి ఆశ్చర్యంతో కొయ్యబారి పోయాడు. "యిదేమిటి మీరు తడవనే లేదే" అన్నాడు. "నేను వర్షాకాలంలో ఎన్నడూ ఈ గొడుగుల మీద ఆధారపడను, అంచేత తడవను" అన్నాడు సత్యం, తన పంట్లాం మడత



చెరగకుండా సరిచేసుకుంటూ.

ఆఫీసుపని చేస్తున్నాడన్న మాటేగాని, ఆ రోజు రోజంతా బండాకి ఏదో తుమ్ములొస్తున్నట్టుండ డం, తలకాయలో ఏమిటేమిటో ఆలోచనలు తిరుగుతూండటం సంభవించింది. మానేజరు గారు తొడుక్కున్న వూల ప్యాంటు లాగేసుకుని తను తొడుక్కోవాలని, అకౌంటెంటు వీపు మీద వున్న ఆ దళసరి కోటు ఆయన దగ్గరనుండి గుంజేసుకోవాలనీ, ఆఫీసు సింహద్వారం దగ్గర ఉన్న తివాసి సైజు కాళ్ళు తుడుచుకునే పీచు ఎత్తుకొచ్చి ముసుకెట్టుకోవాలనీ - అనేక విపరీతపు వాంఛలు.

పైగా తనకు తుమ్ము వచ్చినప్పుడు ముఖం పైకెత్తి, ముక్కు ముడతలు పడగానే - తనకెదురుగా కూచున్న మిస్ పంకజం చేతిలో వున్న కలం క్రింద పెట్టి, ఎంతో కుతూహలంగా తన వేపు చూడడం, తను తుమ్ము ముగించగానే ఆవిడ కూడా ఒక నిట్టూర్పు విడిచి, ఆ తర్వాత మళ్ళా కలం పడుతూండడంతో ఒళ్లు మండిపోయింది. తననో వినోదవస్తువుగా చూస్తున్న ఆ పంకజాన్ని ఏమేమి హింసలు పెడితే బాగుంటుందా అని ఆలోచనలు కూడా పై ఆలోచనలకు తోడయ్యాయి.

ఆఖరుకి ఆఫీసు టైం అయిపోగానే, టాక్సీ చేసుకుని, తిన్నగా యింటికి వెళ్ళాడు. రోజు పొడుగునా తాను వూహించుకుని తయారు చేసుకున్న పౌరుషవంతమయిన సంభాషణ యావత్తు భార్యామణి మీద ప్రయోగించడానికి ప్రారంభం చేశాడు, "అయితే లతా, 'ఆక్ఛీ' - నన్నేనుకుంటున్నావ్? ఆ... క్ఛీ క్ఛీ క్ఛీ క్ఛీ - కొత్త గొడుగు అడిగితే ముస్..ముస్టాడి.... ఆ...ఎవర్ననుకుంటున్నావ్ ఆ....చ్ఛ, అచ్ - నేను క్సి కీ, అంటే ఎవరు ఆ... ఏమిటి అసలు సంగతి ఆచ్..."

బండాకి ఆ విధంగా ఉద్రేకం ఎక్కువయిన కొద్దీ, లత నవ్వటమూ ఎక్కువయింది. ఆఖరికి నవ్వు ఎక్కువయి ఎక్కువయి నోటి వెంట రైలు కూతవేసినట్లు శబ్దం రావటం ఆరంభమయింది. పొట్ట చేత్తో పట్టుకుని సగం వంగిపోయి "అబ్బబ్బ ఊరుకుందురూ, నా మీద యింకాకోపం వస్తే నే నవ్వలేక చచ్చిపోతాను యింక". అంది. కాని బండా వినిపించుకోలేదు. చివరికి లత నవ్వుతూ క్రిందపడి దొర్లటం మొదలు పెట్టినప్పుడు మాత్రం ఎల్లాగో కోప్పడడం ఆపుకున్నాడు. తుమ్మటం మాత్రం ఎట్లాగూ ఆపుకోలేక పోయాడు.

ఆ తర్వాత, దృఢ నిశ్చితుడయిన బండా తుమ్ముతూనే, బీరువాలోంచి పైకం తీసుకున్నాడు. తుమ్ముతూ, తుమ్ముతూనే బజారుకి వెళ్లి గొడుగు కొన్నాడు. తుమ్ములతోనే యింటికి వచ్చాడు. తుమ్ముతూనే "టీ" తాగాడు. తుమ్ముతూనే మందు రాయించుకున్నాడు.




తుమ్ముతూనే శొంఠి పీల్చాడు. తుమ్మి, తుమ్మి మెడ నొప్పి పెట్టింది. అంచేత ఆ రాత్రి చాలాసేపు గడిచే వరకు నిద్రపోవడానికి బదులు తుమ్ముతూనే కాలం గడిపాడు.

ఆ మర్నాడంతా తుమ్ములతోనే పొద్దు పోయింది. మూడో నాడు అమిత ఉత్సాహంతో ఆఫీసుకి బయలు దేరినప్పుడు అతని చేతిలో షోకయిన ప్లాస్టిక్ హాండిల్ వున్న కొత్త గొడుగు వుంది. ఆ రోజున బండా చేసిన సంభాషణల్లో ప్రతి నిమిషమూ గొడుగు ప్రసక్తి వస్తూనే వుండేది. కాని, వర్షం మాత్రం ఒక్కచుక్క పడలేదు. రోజు రోజంతా ఫెల్లుమని ఎండే కాసింది. అక్కడికి బండా చాలా సేపు ఊరిమీద తిరుగుతూనే గడిపాడు. భార్య యిచ్చిన వెచ్చాల జాబితాలో వున్న వస్తువులు కొనడానికి, అవసరమయిన దానికంటే రెట్టింపు టైము తీసుకున్నాడు. అయినా వర్షం రాలేదు. అంచేత కొత్త గొడుగు చేతికి తగిలించుకుని కొన్న పొట్లాలన్నీ చేతులలో పదిలంగా పేర్చుకుని యింటి ముఖం పట్టి వస్తున్నప్పుడు ఆ పొట్లాలు పడిపోకుండానూ గొడుగు బండకొయ్యలా కాళ్ళలో పడకుండానూ, జాగ్రత్తగా నడవటంలో అతను నలుగురైదురు మనుషులను ఢీ కొనడమే కాకుండా, ఒక గుర్రపు బండిని సహితం ఢీకొని ఆ తర్వాత యిల్లు చేరగలిగాడు.

యింటికొచ్చేసరికి తన స్నేహితుడు రాజా వచ్చి కూచుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. పైగా తన యింటికి తీసుకుపోయేందుకు రెండు మాగజైన్లు ఏరి చంకలో పెట్టుకునే వున్నాడు. బండా కనిపించగానే, రాజా అతి వాత్సల్యంతో లేచి అతని చేతిలో వున్న పొట్లాలన్నీ క్రింద పెట్టడానికి సహాయం చేస్తూ "ఏమి(బ్రో)య్ బండా ! యివాళ చాలా సరుకులు కొన్నట్టున్నావే! ఆ యిదేమిటి కొత్త గొడుగా ఏమిటి? పిడి మట్టుకే వుందేం మరి? హో హో అంటే యీ రోజుల్లో గొడుగులు కూడా పార్ట్ బై పార్ట్ కొంటున్నారా ఏమిటి? నువ్వు వాడికి డబ్బు ఇన్‌స్టాల్‌మెంటులో ఇస్తే వాడు నీకు ఈ నెలలో పిడి, వచ్చే నెలలో గుడ్డా, అలాగ... ఇస్తాడన్నమాట.. అంతేనా? హోహోహో". అంటూ లతకు వినబడేలా నవ్వాడు.

"ఛా! యిదేమిటి, మిగతా గొడుగు ఏమయిపోయిందీ?" అన్న మాటలు బండా నోటి వెంట చాలా సేపటికిగాని వెలువడలేదు.

"అయిందీ! ఈయనగారు గొడుగులు పోగొట్టడం ఆరంభమయిందీ? అని అంటూనే ప్రవేశించింది లత. నడుమున చేయి పెట్టుకుని బండా వేపు కాస్సేపే చూసి "మీకు ఫాషనబుల్ గొడుగు కావాలి, కాదు మరీ! అనుభవించండి!" అంది వెక్కిరిస్తూ.

"కానీ...." అంటూ బండా ఏదో అనబోతూండగానే "సరె ఈ పిడి నేను పట్టుకు వెళతాలే. నా దగ్గర ఒక పిడి లేని గొడుగుంది. దానికి అమర్చవచ్చునేమో చూద్దాం" అంటూ ఆ





రెండు మాగజైన్లు చంకలో పెట్టుకుని, ఈ పిడి గాలిలో ఎగరేసుకుంటూ, రాజా చక్కాపోయాడు.

ఆ మర్నాటినుంచీ వర్షం జోరుగా పడటం మొదలెట్టింది. రెండు రోజులు ఎలాగో తంటాలు పడీ చివరికి విధిలేక మూడవ రోజున తల వంచుకుని గొడుగుల దుకాణంలోకి వెళ్ళాడు, బండా.

''ఎట్లాటి గొడుగు చూపించమన్నారు?'' అన్నాడు దుకాణదారు అతి ఉత్సాహంతో.

"ప్లాస్టిక్ పిడిది మట్టుకు వద్దు" అన్నాడు, బండా అతి చురుకుగా.

"అయితే స్టెయిన్‌లెస్ స్టీలుది తీసుకోండి" అని దుకాణదారు సలహా చెప్పాడు.

"మరీ ఖరీదయినది వద్దు"

"ఎంత ఖరీదులో కావాలి?"

"నలభై రూపాయలకి ఏదయినా ఉందా?"

''ఒరే, ఒక ఫ్యాన్ బ్రాండ్ గొడుగు యివ్వరా ఈయనకీ'', అని ఒక్క కేక పెట్టాడు దుకాణంలో వున్న జనాభా యావత్తుకి వినిపించేటట్లు. ఆ తర్వాత మిగిలిన బేరగాళ్ళకి స్వాగతం చెప్పడంలో నిమగ్నుడైపోయాడు.

బండా, ఆ కర్రపిడివున్న గొడుగు చేత్తో పట్టుకుని, ముఖం వేల వేసుకుని యింటి ముఖం పట్టాడు.

ఆ మరునటి రోజున ఆఫీసుకి వెళుతున్నప్పుడు తన గొడుగు రూపవతి కాకపోయినా, ఉపయోగపడేదేనని తృప్తిపడ్డాడు బండా. కాని ఆఫీసునుంచి తిరిగి వచ్చేటప్పుడు మాత్రం ఆ తృప్తి నిలవకుండా పోయింది.




ఎంచేతనంటే ఆఫీసు మెట్లు దిగి గొడుగు తెరవబోయేటప్పటికి, అది తెరుచుకోలేదు. వర్షపు నీటికి చెక్క ఉబ్బిపోయింది.

''హా హా హా మొత్తం మీద బండా ఎట్లాటిగొడుగు పట్టుకు వచ్చినా ఏదో గమ్మత్తు చేస్తూనే వుంటుందిరా బాబూ! అని వేళాకోళం చేస్తూ, ఇళ్ళచూరుల క్రిందనుంచీ గోడలనానుకుని తడవకుండా చకాచకా నడచి చక్కాపోయాడు సత్యం.

ఆ తర్వాత గొడుగు తెరవటానికి అనేకసార్లు ప్రయత్నం చేశాడు బండా. గురిపెట్టిన తుపాకి లాగు అది చంకలో పెట్టుకుని రెండు చేతుల్తోటి బలంగా తీసి తెరవాలని చూశాడు. ఆ తరువాత దాన్ని నేల మీద మోపి మోటారు టైరులో గాలి కొడుతూన్నట్లు వంగి దబాయించి చూశాడు. ఆఖరికి తను తీరికగా ఆఫీసు మెట్ల మీద కూలబడి, పాతకాలపు మంగలి చిన్న పిల్లాడి తలకాయని మోకాళ్ల మధ్య యిరికించుకున్నట్లు గొడుగుని మోకాళ్ళ మధ్య బిగించి పట్టుకుని, పళ్లుబిగించి, తోస్తూ అది తొంవటానికి ప్రయత్నించాడు. కాని అహ-..ఏం లాభం లేకపోయింది.

ఈ లోపుగా దోవనబోయే వాళ్లు కొంతమంది అతని చుట్టూ చేరి అతని వ్యాయామం అంతా చూస్తూ నుంచున్నారు. బండా తలెత్తి చూసి వాళ్లతో "మీలో ఎవరిదగ్గరయినా ఒక చాకు వుంటే యివ్వండి.' అన్నాడు. ఆ జనం అందరూ ఒకరి మొఖాలొకరు సాభిప్రాయంగా చూసుకుని, రెండడుగులు వెనక్కి తగ్గించుకున్నారు. "అరే అదేమిటయ్యా అంతా తమాషా చూడ్డానికి నుంచుంటారే గాని, కాస్త చాకు యిమ్మంటే ఒక్కడూ ఇవ్వడేం?" అని కొంచెం కోపంగానే విసుక్కున్నాడు. మళ్ళీ అక్కడి వాళ్ళందరూ ఒకరి వేపు ఒకరు చూసుకుని యింకో రెండడుగులు వెనక్కి తగ్గారు. అసలు ఈ వ్యవధిలో జనం రెట్టింపై, త్వరలోనే పాతికమంది అయ్యారు. అందులో ఒక కొత్తగా వచ్చిన ప్రేక్షకుడు, అంతకుముందు నుంచీ అక్కడ వున్న వాణ్ణి "ఏమిటసలు, ఏం జరిగింది?" అని అడిగాడు.

"పిచ్చివాడిలా వున్నాడు. ఇందాకటినుంచీ ఆ గొడుగుతో ఏదో నానా రకాల కసరత్తూ చేస్తున్నాడు. తుపాకిలాగా గురిపెడుతున్నాడు. ఇప్పుడేమో చాకు యిమ్మని అడుగుతున్నాడు" అన్నాడు ఆ ముసలాయన.

"అమ్మా నాయనోయి! పోలీసులని పిలిపించి ఒప్ప చెప్పరాదూ ఇప్పుడే. లేకపోతే ఏదయినా ఖూనీ గీని చేసేస్తాడేమో".

ఈ సంభాషణ విన్న తర్వాత బండా అక్కడ ఒక్క నిమిషం ఆలస్యం చేయలేదు. ముడుచుకు వున్న గొడుగుని చంకలో పెట్టుకుని వర్షంలో తడుస్తూనే చక్కాపోయాడు. కొత్త గొడుగు

ముడుచుకుని చంకలో పెట్టుకుని, వర్షంలో తడుసుకుంటూ నడిచిపోతున్న తనని గురించి వాళ్లు చేసే వ్యాఖ్యానాలు విన్నకొద్దీ బండూకి, ఆ గొడుగు అక్కడ పారేసి యింకెవరూ అది తన చేతికి అందివ్వక ముందే పరుగెత్తుకు పోదామనిపించింది. కాని 'ఛత్రపతి' శివాజీని స్మరించుకొని, మనో నిగ్రహం సాధించాడు బండూ. ఆ బలంతో గొడుగు చేతబట్టుకునే యిల్లు చేరుకున్నాడు.

ఆ మర్నాటినుంచీ బండూ ఒక చాకు జేబులో జాగ్రత్త చేసుకునే ఇల్లు కదిలేవాడు. వర్షం పడడం ఆరంభిస్తే అతను చాకు తీసుకుని, ఉబ్బి లావుగా అయిపోయిన గొడుగు కర్రని చెక్కి చెక్కి పల్చన చేసేవాడు. అట్లా చెక్కినంతవరకూ గొడుగు తెరుచుకున్న తర్వాత, మళ్ళీ మిగిలిన భాగం చెక్కుతూండేవాడు. రెండ్రోజులు ఇలా జరిగిన తర్వాత తన జేబులో చాకుతోపాటు, కొన్ని ప్లాస్టర్స్ కూడా జాగ్రత్త పెట్టడం నేర్చుకున్నాడు.

ఇట్లా వుండగా ఒక రోజున మామూలు ప్రకారం గొడుగు చెక్కుకుని తెరుచుకొని ఆఫీసునుంచి వస్తూవుంటే దోవలో ఒకచోట ఒక దుకాణం చూరుక్రింద నిలబడ్డ యిద్దరు "వెన్నెల విసన కర్రల్లాటి" అమ్మాయిలు కనిపించారు. వాళ్ళిద్దరూ తను పనిచేసే ఆఫీసుకి ఎదురుగా వున్న ఆఫీసులో పని చేస్తున్న వాళ్లని అతనికి తెలుసు. కాని ఆ అందమయిన అమ్మాయిలతో పరిచయభాగ్యం మాత్రం ఏర్పడలేదు. అంచేత, ఈ రోజున వాళ్ళిద్దరూ అక్కడ నుంచుని తనవేపు చూసి చిరునవ్వులు నవ్వటం కనిపించేటప్పటికి, బండూ వెనక్కి తిరిగి చూశాడు. కాని తన వెనుక ఎవరూ లేరు. అంచేత మళ్లా వాళ్ళవేపు చూసాడు. ఈసారి వాళ్ళు నవ్వటమే కాకుండా చేతులు జాపి పిలవడం కూడా మొదలుపెట్టారు. బండూకి ఆశ్చర్యం, ఆనందం, వేసింది. వాళ్ళ ఎదటికి వెళ్ళి వెర్రివాడిలా నుంచున్నాడు. అంతట్లో వాళ్ళిద్దరూ పిల్లుల్లా అడుగులేసుకుంటూ తనకి చెరో వేపున గొడుగు క్రింద నుంచున్నారు. బండూ పొంగిపోయాడు. వాళ్లు అనవలసినది తనే అన్నాడు -

"థాంక్యూ"

వాళ్లు ముసిముసి నవ్వులు నవ్వుతూ "ఇట్ ఈజ్ ఆవుల్లీ నైస్ ఆఫ్ యూ" అంటూ లిపిస్టిక్ వేసిన పెదవులు తిప్పుకుంటూ తన నడుము చుట్టూ చెరోపక్కా చేతులువేసి నడిపించి తీసుకెళ్ళి పోయారు. బండూకి గాలిలో కెరటాల మీద నడుస్తున్నట్టనిపించింది. ఎంతో ఆహ్లాదకరమయిన కిచకిచలు ఏర్పడి నందువల్ల ముఖం మీద ఒక నవ్వు వికసించింది.

"యిదేనా మీ బస్ స్టాపు?" అని అడిగింది ఒక అమ్మాయి కాస్సేపయాక బండూ నిలిచిపోబట్టి.




"మరే" అన్నాడు బండూ ముఖం మీది నవ్వుని స్వాధీనంలోకి తెచ్చుకుంటూ.

"అయితే యిప్పుడు చిక్కేవచ్చింది. ఏం చేద్దామే మరి?"

"పోనీ మేం - మేం మీ గొడుగు పట్టుకుని వెళ్ళమా? మీకిబ్బంది లేదుగా ఆ?" అంది మరొకామె.

"ఛిక్...... నాటెటాల్... ఏమీలేదు" అన్నాడు బండూ ఎంతో ఆనందంగా.

"ఓ! యు ఆర్ సచ్ ఏ డియర్!"

చూస్తుండగానే, బండూ గొడుగు ఆ అమ్మాయిలతో చక్కాపోయింది. తను వర్షంలో తడుస్తూ ఒంటరిగా నుంచున్నట్టు బండూకి కొన్ని క్షణాలయినాక గాని స్ఫురించలేదు.

ఆ తర్వాత బండూ, అతని గొడుగూ మళ్ళా కలుసుకోవటం పడలేదు. అప్పుడప్పుడు ఆ ఆడపిల్లలు కనుపిస్తూనే వుండేవారు. అతడ్ని చూసి చిరునవ్వు నవ్వుతూండేవారు. ఆ సమయాల్లో తనకెవరో ఛత్రచామరలు పడుతూన్నట్లు అనిపించి గొడుగు కోసం అడిగేవాడు కాదు. కాని వర్షం పడుతున్నప్పుడు అట్లా అనిపించనందువల్ల కొంత యిబ్బందిగానే వుండేది. భార్యకు అసలు సంగతి తెలిస్తే మండిపడుతుందన్న భయమూ ఉంది.

ఇంకో గొడుగు కొనకుండా సత్యం అడుగుజాడల్లో నడుద్దామనుకున్నాడు. అతనికి వచ్చిన విద్య తనకు రాదా అనుకున్నాడు.

అతను అలా నిశ్చయించేనుకున్న నాటినుంచీ ఎనిమిది రోజులు తెరిపి లేకుండా ముసురు పట్టింది. టాక్సీలకి మూడువందలు ఖర్చయింది. పైగా బండూ బట్టలన్నీ చాకలాడి దగ్గరికి చేరిపోయాయి. అంచేత చివరికి ఓ రోజున అతిబిగువుగా వున్న పాతపంట్లాం వేసుకుని ఆఫీసుకి వెళ్ళాలసి వచ్చింది.

బండూకి ఒక విధమైన వైరాగ్యం ఏర్పడింది. తక్షణం ఒక స్నేహితుడి దగ్గర (లత నడిగితే తంతుందని భయం కొద్దీ), పైకం అప్పుతీసుకుని గొడుగుల దుకాణంలోకి ప్రవేశించాడు.

"సెలవియ్యండి - ఎట్లాటి గొడుగు కావాలి మీకు" అన్నాడు దుకాణదారు అతి మర్యాదగా.

"కర్రది మాత్రం వద్దు" అన్నాడు బండూ నిర్ధారణగా.

"ఈయనకి ఒక స్టెయిన్‌లెస్‌స్టీలు గొడుగు యివ్వరా'' అని హుకుంజారీ చేశాడు దుకాణదారు. ఆ కేక విని యితర బేరగాళ్ళు అందరూ తన వేపు గౌరవంగా చూడటం చూసిన బండూకి చవక రకం గొడుగు యిమ్మని అడగటానికి ధైర్యం చాలలేదు. అంచేత కిక్కురు మనకుండా ఆ ఖరీదయిన గొడుగు చంకలో పెట్టుకుని, యింటికి చేరుకుని, లతచేత సోలెడు అక్షింతలు వేయించుకున్నాడు.

బండూ మళ్ళా ఒక కొత్తగొడుగు కొనుక్కున్న వార్త పొట్ట చేతితో పట్టుకుని, ఒక పెద్ద మేఘం యింకో పెద్ద మేఘానికి చెప్పింది. రెండో మేఘం మూడో మేఘానికి చెప్పింది. కాస్సేపటిలో బంగాళాఖాతం మీద వున్న చిన్నా, పెద్దా మేఘాలన్నిటికీ ఈ కబురందిపోయింది. ఆ క్షణం నుంచీ పెద్దపెద్ద మేఘాలు వాళ్ల ఊరి వేపు రావడం మానుకున్నాయి. చిన్నా చితకవీ వచ్చినా అవి సమయం చూసుకుని పని చాలించుకుని పోయేవి. ఏ రాత్రిపూటనో, లేకపోతే, బండూ ఆఫీసులో పని చూసుకుంటూ కూర్చున్నప్పుడో నాలుగు చినుకులు పడేసి మళ్ళా ఐపుండేవి కావు. బండూ మాత్రం ప్రతిరోజూ గొడుగు మోసుకుంటూ తిరిగేవాడు. దాన్ని బహు జాగ్రత్తగా కాపాడుకునే వాడు. కాని వర్షం మాత్రం ఆ గొడుగుని వుపయోగించుకునే అవకాశం యివ్వలేదు .

పోనుపోను బండూకి కూడా గొడుగు మీద కొంత అశ్రద్ధ ఏర్పడింది. అంచేత ఓ రోజున ఎక్కడికో వెళ్ళినప్పుడు తన స్టెయిన్‌లెస్ స్టీల్ గొడుగు ఒక చోట పెట్టి, మళ్ళీ వచ్చేటప్పుడు వరధ్యానంగా ఇంకో గొడుగు చేతికి తగిలించుకుని వచ్చేశాడు. ఇదంతా అయ్యేటప్పటికి వర్షాకాలం కూడా పూర్తిగా అయిపోయింది. అంచేత ఆ గొడుగుకి ఒక గుడ్డ చుట్టబెట్టి అటకమీద కెక్కించేసింది. వచ్చే సంవత్సరం వర్షాకాలం ఆరంభమయినప్పుడు మళ్ళీ అది బండూకి యివ్వవచ్చునని ఆవిడ సంకల్పం.

**(మరాఠీ మూలరచన : గంగాధర్ గాడ్గీళ్**
**తెలుగు అనువాదం: ఎన్. జగన్నాథ్)**



# పద్ధతి మార్చుకోని భర్త

## బాబీ బ్రౌన్ విట్నీ హౌస్టన్ జంట

# సహనానికి ప్రతిరూపమైన భార్య






కుటుంబ సభ్యులు, సన్నిహితులు, హితైషులు ఎందరు చెప్పినా రౌడీ భర్త బాబీ బ్రౌన్‌ను విడిచిపెట్టనంటోంది విట్నీ హౌస్టన్.

బ్రౌన్ కు మంచిపేరు ఎప్పుడూ లేదు కానీ ఈ మధ్య తన రికార్డు తనే బద్దలు కొట్టుకున్నాడు. ఒకేరోజు రెండు సార్లు పోలీసులకు పట్టుబడ్డాడు. ఆ సందర్భంగా గతపక్షం జనవరి 21 న కోర్టుకు హాజరయ్యాడు!

కారు గుద్దేయడాలు, తాగి గోలచేయడాలు, డ్రగ్స్ ఉపయోగిస్తూ పోలీసులకు దొరికిపోవడాలు - ఇలా ఎన్నోసార్లు బ్రౌన్, విట్నీకి న్యూసెన్సు తెచ్చి పెట్టాడు. మే, 2000 లో జైలుపాలయ్యాడు కూడా. అయినా ఆమె ఓర్చుకుంది. ప్రతిసారి ఆమె కిమ్మనకుండా అతన్ని సపోర్టు చేస్తూనే ఉంది.

విట్నీకి సన్నిహితులయినవారు వాపోయారు -విట్నీ కుటుంబసభ్యులు ఎప్పటినుండో చెబుతున్నారు 'నీ మొగుణ్ని వదిలేస్తేనే గాని నువ్వు బాగుపడవు' అని. ఈ మధ్య రికార్డు కంపెనీవాళ్లు కూడా మొదలుపెట్టారు - ఎరిస్టా రికార్డు కంపెనీవాళ్లు అతను దగ్గర్లో వుండడానికి వీల్లేదని గట్టిగా చెబుతున్నారు. విట్నీ తండ్రి జాన్ హౌస్టన్‌కి అల్లుడంటే ఎంత కోపమంటే - - 'నువ్వు విడాకులు ఇచ్చేస్తే నేను మీమీద వేసిన వంద డాలర్ల కేసు విత్‌డ్రా చేసుకుంటాను' అని కూతురుకు ఆఫర్ ఇచ్చాడు కూడా.

ఈ గొడవలు ఇలా నడుస్తూండగానే బ్రౌన్ కొత్త గొడవలో చిక్కుకున్న విధం ఏమిటంటే - 2002 నవంబరు 7 న తెల్లవారుఝామున 3 గంటలకు అట్లాంటాలో ఓ కారు ఓవరు స్పీడుగా వెళ్లిపోతూంటే పోలీసులు ఆపారు. లోపల ఎవరాని చూస్తే బాబీ బ్రౌన్. కారు చెక్ చేస్తే ఓ చిన్న సంచీలో మార్జివానా కనబడింది. డ్రైవింగు లైసెన్సు లేదు, వెహికల్ ఇన్సూరెన్సు లేదు. కేసు బుక్ చేసి దగ్గరున్న డేకాబ్ కంట్రీ పోలీసు స్టేషనుకు తీసుకెళ్లారు. అక్కడవాళ్లు అయ్యవారిని చూడగానే అనుమానం వచ్చి రికార్డులు తణిఖీ చేస్తే పాతకేసు బయటపడింది.

> **విట్నీ వైవాహిక జీవితం**
>
> 1992 జూలై 18 న బాబీ బ్రౌన్‌తో వివాహమయింది. 1993 మార్చిలో క్రిస్టినా అనే కూతురు పుట్టింది. బ్రౌన్‌కు పాత సంబంధాల వల్ల ముగ్గురు పిల్లలున్నారు. నలుగుర్నీ వీళ్లే పెంచుతున్నారు.
>
> కూతురు కూడా కూనిరాగాలు తీస్తుంది మైలవ్ ఈజ్ యువర్ లవ్' టైటిల్ ట్రాక్‌లో ఆమె గొంతు కూడా వినవచ్చు

అంతకుముందు తాగి డ్రైవ్ చేస్తున్నాడని పోలీసులు కేసు పెట్టి వారంటు తీసుకుని వస్తే బ్రౌన్ తప్పించుకు తిరుగుతున్నాడు. అది అలాగే పెండింగులో ఉండిపోయింది. పనిలో పని అని పోలీసులు ఆ కేసు ఉదయం 10 గంటలకు రిజిస్టరు చేసేశారు. పదేళ్ల వైవాహిక జీవితంలో బ్రౌన్ ఇలాటి చేష్టల వల్ల భార్యను రకరకాలుగా ఏడిపించుకుతిన్నాడు కానీ ఒకే రోజులో రెండు సార్లు అరెస్టయ్యి ఇంత ఇదిగా పరువు తీయలేదు. ఈ దెబ్బతో విట్నీ గుడ్‌బై చెప్పేస్తుందని కొంతమంది ఆశిస్తున్నారు.

ఎందుకంటే నాలుగేళ్ల తర్వాత లేటెస్టుగా 'జస్ట్ విట్నీ' అనే పేరు మీద విట్నీ సిడి ఆల్బమ్ రిలీజు చేస్తున్న ఈ సమయంలోనే ఈ సంఘటన జరిగింది. ఇక ఆమె మనసు ఎలా గాయపడివుంటుందో ఊహించవచ్చు.

బాబీ బ్రౌన్ కూడా తక్కువ వాడు కాడు. అతనూ గాయకుడే. 1969 లో బోస్టన్‌లో పుట్టిన బ్రౌన్‌కి రాల్ఫ్ ట్రెస్‌వంట్‌తో స్నేహం కలిసింది. ఇంకో ముగ్గురితో కలిసి ఒక గ్రూపుగా ఏర్పడ్డారు. 1985లో బ్రౌన్‌కు స్టార్‌డమ్ వచ్చింది. ఆ గ్రూపునుండి బయటకు వచ్చేశాడు. 1985 నుండి 1995 లోపున బ్రౌన్ రెండే సినిమాలలో నటించాడు. 'ఘోస్ట్‌బస్టర్స్ - 2' లో నటించడమే కాక పాట పాడాడు కూడా.

## గాయనిగా విట్నీ

- విట్నీ తల్లి సిస్సీ హౌస్టన్ కూడా పాటలు పాడేది. డియోన్ వార్‌విక్ ఆమె కజిన్.
- 11 సంవత్సరాలకే నెవార్క్, (న్యూ జెర్సీ) చర్చిలో సోలోయిస్టుగా పాడేది.
- టీన్స్‌లో తల్లితో బాటు న్యూయార్క్ క్లబ్‌లలో పాడడంతో బాటు, చాకా ఖాన్ వంటి

వారికి బాక్అప్ సింగర్‌గా పాడేది.

- మోడలింగ్ (గ్లేమర్ వంటి పత్రికలకు కవర్‌గర్ల్ గా ఉంది)
- డెబ్యూ ఆల్బమ్ 'విట్నీ హౌస్టన్" 1985 లో రిలీజయింది. 2 కోట్ల కాపీలు అమ్ముడుపోయింది.
- సోలో ఆర్టిస్ట్ డెబ్యూ ఆల్బమ్ అమ్మకాలలో ఆ ఆల్బమ్ రికార్డు సృష్టించింది
- రెండో ఆల్బమ్ "విట్నీ" (1987) ద్వారా మరో రికార్డు సృష్టించింది.
- మూడో ఆల్బమ్ "ఐ యామ్ యువర్ బేబీ టునైట్" (1990) విట్నీ వైవిధ్యానికి అద్దం పట్టింది
- 1991 లో విట్నీ ఆలపించిన అమెరికన్ జాతీయగీతం "ది స్టార్ స్పాంగిల్డ్ బానర్" పదిలక్షల కాపీలు అమ్ముడుపోయింది
- దానిపై లాభాలను విట్నీ గల్ఫ్ వార్‌లలో పనిచేసిన అమెరికన్ సైనికుల సంక్షేమానికి విరాళమిచ్చింది
- తరువాత "ది బాడీగార్డు" అనే సినిమాలో యాక్టర్- డైరక్టర్ కెవిన్ కోస్టనర్ సరసన నటించింది
- సినిమా సూపర్‌హిట్. ఆరు పాటలున్న సినిమా సౌండ్‌ట్రాక్ 3.30 కోట్ల కాపీలు అమ్ముడుపోయింది
- విట్నీ రెండో సినిమా 'వెయిటింగ్ టు ఎక్సేల్' (1997) బాక్స్ ఆఫీసు వద్ద 7 కోట్ల డాలర్లు ఆర్జించింది
- దీని సౌండ్‌ట్రాక్‌లో విట్నీవి మూడు సింగిల్స్ ఉన్నాయి. ఆ ఆల్బమూ హిట్టే
- ఆమె మూడో సినిమా 'ది ప్రీచర్స్ వైఫ్' (1996). దాని ఆల్బమ్ బిగ్గెస్ట్ సెల్లింగ్ గాస్పెల్ ఆల్బమ్‌గా పేరు తెచ్చుకుంది
- ఆ తరువాత అనేక విదేశీ పర్యటనల తర్వాత, 8 సంవత్సరాల తర్వాత నాన్-సౌండ్‌ట్రాక్ ఆల్బమ్ విడుదలయింది
- అదే కోటి కాపీలు అమ్ముడుపోయిన 'మై లవ్ ఈజ్ ఈజ్ యువర్ లవ్'
- ఇది విట్నీకి ఆరవ గ్రామీ తెచ్చిపెట్టింది
- వెనువెంటనే 'విట్నీ - గ్రేటెస్ట్ హిట్స్' అనే డబుల్ ఆల్బమ్ విడుదలయింది. ఇప్పటివరకు కోట్ల పైనే అమ్ముడుపోయింది
- 1989లో ది విట్నీ హౌస్టన్ ఫౌండేషన్ ఫర్ చిల్డ్రన్ అనే సంస్థ స్థాపించి పిల్లలకోసం తన సంపాదనలో చాలా భాగాన్ని వెచ్చిస్తుంది విట్నీ.
- ఇంతే కాదు, యునైటెడ్ నీగ్రో కాలేజి ఫండ్, చిల్డ్రన్స్ డయాబెటిస్ ఫండ్, ఎయిడ్స్ బాధితుల ఫండ్ ఇత్యాది అనేకవాటికి విరాళాలిస్తుంది.








చలన చిత్రరంగంలో ఎన్నో నూతన అధ్యాయాలకు నాందిగా నిలిచిన చిత్రం అన్నపూర్ణవారి

# తోడికోడళ్ళు

అంతకుముందు 'అమర సందేశం' చిత్రానికి దర్శకత్వం వహించినా 'తోడికోడళ్ళు'తోనే ఆదుర్తి సుబ్బారావు తన జైత్రయాత్రను ప్రారంభించారని చెప్పాలి. అలాగే అన్నపూర్ణ సంస్థలో ఆత్రేయ అడుగు పెట్టడం, అంతవరకూ సెకండ్ హీరోయిన్‌లకు, పిల్లలకు పాడే సుశీల హీరోయిన్‌కు పాడడం తర్వాత్తర్వాత హీరోయిన్‌లకు సుశీలే పాడాలి అనే సెంటిమెంట్ ఏర్పడిపోవటం ఇవన్నీ 'తోడికోడళ్ళు' చిత్రంతోనే మొదలయ్యాయి. అనితర సాధ్యమైన వైవిధ్యంతో పాటలను స్వరపరిచే మాస్టర్ వేణు స్వరకల్పనలో ఆ చిత్రంలోని పాటలన్నీ అలరించాయి. వాటిలో ముచ్చట గొలిపే కొన్ని పాటలివి.

కారులో షికారు కెళ్ళే
పాలబుగ్గల పసిడి చానా
బుగ్గమీద గులాబి రంగు
ఎలా వచ్చెనో చెప్పగలవా
నిన్ను మించిన కన్నెలెందరో
మండుటెండలో మాడుతుంటే
వారి బుగ్గల నిగ్గు నీకు
వచ్చి చేరెను తెలుసుకో
కారులో షికారు కెళ్ళే
పాలబుగ్గల పసిడి చానా
నిలిచి విను నీ బడాయి చాలు
తెలుసుకో ఈ నిజా నిజాలు
చలువ రాతి మేడలోన
కులుకుతావే కుర్రదానా
మేడకట్టిన చలువరాయి
ఎలా వచ్చెనో చెప్పగలవా
కడుపు కాలే కష్టజీవులు
ఒడలు విరిచి గనులు తొలచి
చెమట చలువను చేర్చి రాళ్ళను పేర్చినారు తెసుకో ॥కారులో షికారు॥
గాలిలోనా తేలిపోయే చీరకట్టిన చిన్నదానా ॥2॥
జిలుగు వెలుగుల చీర శిల్పం ఎలా వచ్చెనో చెప్పగలవా
చిరుగు పాతల బరువు బ్రతుకుల నేతగాళ్ళే నేసినారు
చాకిరొకరిది సౌఖ్యమొకరిది సాగదింక తెలుసుకో ॥కారులో షికారు॥









ఇప్పటి వరకు కొన్ని సినిమా పాటలపై 'ఇది ఎవరు రాసి ఉంటారు?' అనే చర్చ రావటం, విషయం తేలాక ఆ వాదానికి తెరపడడం జరుగుతూ వచ్చింది. కానీ 'కారులో షికారుకెళ్ళే' పాట విషయంలో మాత్రం రాసింది ఆత్రేయేనని ఎన్నిసార్లు నిరూపించబడుతున్నాసరే 'శ్రీశ్రీ'యా అని అడగటం పరిపాటిగా - అడగకపోవటం పొరపాటుగా - వస్తోంది. ఒకే విజయాన్ని ఆ సరస్వతీ పుత్రులిద్దరూ ప్రత్యక్షంగా, పరోక్షంగా పంచుకున్న అరుదైన సంఘటన ఇది. ఇక ఈ పాట సాహితీ వైభవాన్ని విశ్లేషించి రాయాలంటే మొత్తం పాటని తిరిగి మననం చేసుకోవటం తప్ప మరో గతి లేదు. నిజానికి ఈ పాటను ఆత్రేయ సినిమా కోసం రాయలేదు. రోజూ సాయంకాలం మెరీనా బీచ్‌కి వెళ్ళే అలవాటుండే దాయనకి, క్వీన్ మేరీస్ కాలేజ్‌లో చదువుకునే ధనవంతులైన అమ్మాయిలు చల్లగాలి కోసం కార్లలో కాలక్షేపానికి వచ్చేవారక్కడికి. వారిని చూసి స్పందించి ఆత్రేయ రాసుకున్న పాట అది. ఈ చిత్రంలో కథానాయకుడు ఆదర్శ భావాలున్న యువకుడు, అతనికో ఇంట్రడక్షన్ సాంగ్ అని అనుకున్నపుడు 'నా దగ్గిరో పాటుంది వింటారా?' అంటూ ఆత్రేయ తను రాసుకున్న పాటను చూపించటం దానికి దుక్కిపాటి మధుసూదనరావు గారు ఎంతో బావుందని మెచ్చుకోవటంతో అలా చిత్రంలో చోటుచేసుకుందా పాట. ఘంటసాల హిట్స్‌లో ఒకటిగా నిలిచిపోయిన ఆ పాటను ఇంటర్ లూడ్స్‌తో సహా స్టడీ చేయగలిగితే వేణు పేరుకి ముందు మాస్టర్ అని ఎందుకు ఉందో కొంత అర్థమవుతుంది.

జోజో....జోజో....
జోజో....జోజో...
కలకాలమీ కలత నిలిచేది కాదు
కనుమూసి కాసేపు నిదురించు బాబు
నిదురించు బాబూ ॥ కలకాలమీ॥
పెంచింది పెద్దమ్మ ముద్దార నిన్ను
మమకారమొకసారె మరచునా తాను
త్వరలోనే మనమంతా కలిసేము బాబు ॥ త్వరలో॥
మదిలోన ఆ చింత మానరా నా తండ్రి
కనుమూసి కాసేపు నిదురించు బాబు
జోజో...జోజో...జోజో...జోజో...
చలచల్లగా సాగు సంసారమందు
చెలరేగె మా పోరు నలిగావు నీవు
మా నేరముల నెల్ల మన్నించు బాబు ॥ మా నేరము॥
మదిలోన ఆచింత మానరా నా తండ్రి ॥ కలకాలమీ॥











ఈ పాటను తాపీ ధర్మారావు నాయుడు గారు రాశారు. సుశీలపాడిన ఈ పాటను సావిత్రి(సినిమాలో) తన కొడుకును నిద్రపుచ్చడానికి పాడే పాటగా చిత్రీకరించారు. సంగీత దర్శకుడు నౌషాద్ అంటే మాస్టర్ వేణు గారికి ప్రాణం. ఆయన శైలిని ఈయన ఎంతగా పుణికిపుచ్చుకున్నారో ఈ పాటలో మనం పట్టుకోవచ్చు. 'పెంచింది పెద్దమ్మ ముద్దారనిన్ను' అనే చరణానికి ముందు గల ఇంటర్‌లూడ్‌ను బాగా బైహార్ట్ చేసి ఆలపించుకుంటూ వెళితే 'మొఘల్-ఎ-ఆజం' కోసం నౌషాద్ స్వరపరిచిన 'ప్యార్‌కియాతో డర్నా క్యా' అనే పాటలోకి, ఆ పాట ఇంటర్‌లూడ్స్‌లోకి వెళిపోతాం. ఆ తరహా ఇంటర్‌లూడ్‌లు నౌషాద్ స్వరరచనలలో అంతకుముందు చాలాచోట్ల ఉన్నా 1960లో విడుదలయిన 'మొఘల్-ఎ-ఆజం' చిత్రంలోని ఆ పాటని సులువుగా అర్థం అవడం కోసమే ఉదహరించటం జరిగింది.

ఆడుతు పాడుతు పనిచేస్తుంటే అలుపు సొలుపేమున్నది
ఇద్దరుమొకటై చేయికలిపితే ఎదురేమున్నది
మనకు కొదవేమున్నది ॥ఆడుతు॥
ఒంపులు తిరిగి ఒయ్యారంగా ఊగుతు విసురుతు గూడేస్తుంటే
నీ గాజులు ఘల్లని మోగుతుంటే
నా మనస్సు ఝల్లు మంటున్నది నా మనసు ఝల్లు మంటున్నది
తీరని కోరికలూరింపంగా ఓరకంట నను చూస్తూంటే
చిలిపి నవ్వులు చిందులు తొక్కి సిగ్గు ముంచు కొస్తున్నది
నును సిగ్గు ముంచుకొస్తున్నది ॥ఆడుతు॥
చెదరి జారిన కుంకుమ రేఖలు పెదవులపైన మెరుస్తు ఉంటే
తీయని తలుపులు నాలో ఏమో తికమక చేస్తూ ఉన్నవి
అహ...తికమక చేస్తూ ఉన్నవి ॥ఆడుతు॥
మాటల్లో మోమాటం నిలిపి రాగంలో అనురాగం కలిపి
పాటపాడుతుంటే నా మది పరవశమై పోతున్నది
అహ పరవశమైపోతున్నది ॥ఆడుతు॥










చేలకు నీళ్ళను అందించటానికి 'గూడ'వేసే పద్ధతిని 'ఆడుతు పాడుతు' పాటలో చూపించారు. ఆ మూమెంట్‌కు తగ్గట్టుగా ఫోక్ మ్యూజిక్‌ని బేస్ చేసుకుని రిథమ్‌ని 2/4లో అంటే చతురస్రంలో సెట్ చేసుకుని మరోవైపు అందమైన ఓ ప్రణయ గీతంలా కూడా రూపొందిస్తూ 'పనిపాట' అనే నానుడికి అద్దంపట్టి అర్థం చెప్పేవిధంగా నిర్మాత, దర్శకుడు, రచయిత, సంగీత దర్శకుడు, గాయనీ గాయకులు, నటీ నటులు, తదితర సాంకేతిక బృందం అంతా కలిసి చేసిన సమిష్టి కృషి పాటంతా కనిపిస్తుంది- గూడవేసే పద్ధతి తప్ప మరో మూమెంట్‌లేని ఆ పాటను మొనాటనీ అనిపించని రీతిలో - తీర్చిదిద్దుకున్న తీరుచూస్తే ఆ రోజుల్లో ఉన్నదేమిటో, ఈ రోజుల్లో కొరవడుతున్నదేమిటో అరటిపండు చేతిలో ఒలిచి పెట్టినట్టు తెలిసిపోతుంది. వ్యవసాయ కుటుంబం నుంచి వచ్చిన అక్కినేని ఎంతో సులువుగా గూడవేస్తూ చేసే అభినయానికి ధీటుగా ఉండటానికి సావిత్రి ఓ మూడురోజుల పాటు అక్కినేని శిక్షణలో సాధన చేసిందని ఈ సందర్భంగా ప్రత్యేకించి చెప్పక తప్పదు. ఛానల్స్‌లో ప్రసారం అయినప్పుడుగాని, సి.డి. తెచ్చుకుని చూసినపుడుగాని గమనించండి. అక్కినేని, సావిత్రి కలిసి గూడ వేసే 'డైరెక్ట్ షాట్'లలో కనీసం 49 నుంచి 50 సార్లకు పైగా వారిద్దరూ గూడ వేయటం కనిపిస్తుంది. పాటను, లిప్‌మూమెంట్‌లను లాంగ్‌షాట్‌లో మానేజ్ చేయించేసుకునే కళాకారుల దృష్టికి రావలసిన సత్యమిది.

ఇక్కడ ఇంకో విషయం కూడా ఉంది. జాగ్రత్తగా ఈ పాట ఆలపించు కుంటూ పోతే బాగా తెలిసినవారికి నౌషాద్ స్వరకల్పన చేసే పద్ధతి మనసులో మెదుల్తుంది. నౌషాద్ వద్ద గులాం మహమ్మద్ (పాకీజా సంగీత దర్శకుడు) వంటి వారు సైతం శిష్యరికం చేసినా ఆయన స్టయిల్‌ని అందిపుచ్చుకోలేకపోయారని అది కేవలం ఒక్క మాస్టర్ వేణుకే సాధ్యపడిందని ఓసారి నౌషాదే అంగీకరించారట. ఈ పాట చివరి చరణంలో ఆ ముద్ర చాలావరకు తొంగిచూడడాన్ని మనం గమనించవచ్చు. ఈ పాటను కొసరాజు వ్రాయగా ఘంటసాల, సుశీల ఆలపించారు.

నలుగురు కలిసీ పొరుపులు మరిచీ
చెయ్యాలి ఉమ్మడి వ్యవసాయం మన కిస్తుందెక్కువ ఫలసాయం
ఇది రైతులకెంతో సదుపాయం ॥నలుగురు॥
ఒక సంసారం వందెకరాలను పండించటమే అరుదుకదా
అది భరించలేని బరువు కదా
పది కుటుంబములు వెయ్యెకరాలను
సాగు చెయ్యడం సులువు కదా ॥నలుగురు॥
మహారాజులూ జమీందారులూ మచ్చుకు దొరకని కాలంలో
ఈ ప్రజలే ఏలే రాజ్యంలో ఇతరుల కష్టం దోచుకు తినడం
ఇకపై సాగే పని కాదు! ॥నలుగురు॥
ఇదియే సూత్రం ఒక్కడు మాత్రం భూమిని గుత్తకు కొనరాదు
కడు సోమరిపోతై మనరాదు
నేలా నీరూ గాలీ వెలుగూ కొందరి సొత్తని అనరాదు
అవి అందరి హక్కై అలరారు ॥నలుగురు॥
ఒక్కొక్క వ్యక్తీ, సమస్త శక్తీ ధారపోసి పని చెయ్యాలి
ధన ధాన్య రాశులే పెంచాలి
కూటికి గుడ్డకు లోటులేక తనకవసరమైనవి పొందాలి ॥నలుగురు॥



ఈ పాటను శ్రీశ్రీ రాయగా ఘంటసాల, బృందం ఆలపించారు. అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రి, కొంతమంది ఉపపాత్రధారులపై చిత్రీకరించారు. ఈ పాటలో సాహిత్యం గురించి ముందుగా చెప్పుకోవాలి. ఇవాళ ఎంతోమంది ప్రకటిస్తున్న భూసంస్కరణలు ఆ రోజుల్లోనే పాట ద్వారా తెలియజేయడానికి ప్రయత్నించారని పాట సాహిత్యం మొత్తం అవలోకిస్తే అవగతమవుతుంది. మూడో చరణంలో-గుత్తకు కొనరాదు/సొత్తని అనరాదు/హక్కై అలరారు వంటి పద ప్రయోగాలని ట్యూన్‌తో సహా మననం చేసుకుంటూ ఉంటే అర్థ సౌందర్యంతో పాటు శబ్ద సౌందర్యాన్ని కూడా శ్రీశ్రీ ఎంత రసాత్మకంగా ఆవిష్కరించారో తెలుస్తుంది. అలాగే ఘంటసాల వారి గాత్ర మాధుర్యాన్ని ఏ రేంజ్‌లో ఉపయోగించుకున్నా రసానుభూతి చెడదని ఆఖరి చరణాన్ని ఓ సారి పాడుకుంటే అనుభవంలోకి వస్తుంది.

అ: తింటానికిక్కూడు చాలదే. జాంగిరీ వుంటానికిల్లు చాలదే
బస్తీకి పోదాము పైసా తెద్దామే రావేనా రంగసానీ!!
ఆ: టౌను పక్కకెల్లొద్దురా డింగరీ! డాంబికాలు పోవొద్దురా
టౌను పక్కకెళ్లేవు డౌనైపోతావురో రబ్బీ బంగారు సామి!
అ: రెక్కలన్నీ యిరుసుకుంట రిక్షాలు లాక్కుంట
చిల్లరంత జేర్చుకుంట సినిమాలు చూసుకుంట
షికార్లు కొడదామే - పిల్లా జలసా చేద్దామే ॥బస్తీకి॥
ఆ: కూలి దొరకదూ నాలి దొరకదూ
గొంతు తడుపుకొన నీరు దొరకదూ
రేయింబగలూ రిక్షా లాగిన
అద్దెకు పోనూ అణా మిగలదు
గడప గడపకు కడుపు బట్టుకుని
ఆకలాకలని అంగలార్చితే
గేటు బిగించీ కొట్టొస్తారు!
కుక్కలనే వుసి కొల్పిస్తారు ॥టౌను పక్క॥
అ: ఫ్యాక్టరీలలో పని సులువంట
గంటయిపోతే ఇంట్లో వుంట
వారం వారం బట్వాడంట
ఒరే అరే అన వీల్లేదంట
కాఫీ తోటే గడపొచ్చంట కబుర్లు చెప్పుకు బ్రతకొచ్చంట
చూడ చిత్రమంట పిల్లా! చోద్యమౌతదంట ॥బస్తీకి॥
ఆ: పిప్పయి పోయే పిచ్చి ఖర్చులు పోకిరి మూకల సావాసాలు
చీట్ల పేకలు సిగసిగ పట్లు తాగుడు వాగుడు తన్నులాటలు
ఇంటి చుట్టునా ఈగలు దోమలు
ఇరుకు సందులు మురుగు వాసనలు
అంటురోగములు తగిలి చచ్చినా
అవతల కీడ్చే దిక్కు వుండదు ॥టౌను॥
అ: ఏలికేస్తేను కాలికేస్తావు ఎనక్కు రమ్మని గోల జేస్తావు
ఏ దారంటే గోదారంటవు ఇరుకున బెట్టి కొరుక్కు తింటవ్
దిక్కు దోచనీవే పిల్లా! తిక మక జేసేవే
బస్తీకి నే బోను నీతో ఉంటానే! రాణీ నా రంగసానీ
గొడ్డూ గోదా మేపుకుందాం! కోళ్ళూ మేకలు పెంచుకుందాం
కూరానారా జరుపుకుందాం! పాలూ పెరుగు అమ్ముకుందాం
పిల్లా జెల్లను సూసుకుందాం! కలో గంజియో తాగి పడుందాం
ఇద్దరు: టౌను పక్కకెళ్లద్దండోయ్ బాబూ
డాంబికాలు పోవద్దండోయ్
టౌను పక్కకెళ్లేరు డౌనైపోతారు!
తానే తందాన తాన తందాన!తందాన తాన
















ఈ పాటను కొసరాజు రాయగా ఘంటసాల, జిక్కి ఆలపించారు. ఇ.వి.సరోజ, ఈ చిత్ర నృత్య దర్శకుడు ఏ.కె.చోప్రా కలిసి అభినయించిన ఈ నృత్య గీతంలో అక్కినేని, సావిత్రితో పాటు కొంతమంది ఉపపాత్రధారులు కూడా కనిపిస్తారు. వాస్తవాలను వ్యంగ్య వైభవంతో జోడించి చెప్పటంలో కొసరాజు ఎప్పుడూ ముందుండే రాజే తప్ప కొసన ఉండే రాజు మాత్రం కాదు. ఏ చరణానికి ఆ చరణం 'కరెక్టే కదా' అని అనిపిస్తూ అందులోని గుణదోషాలను వ్యంగ్యరీతిలో తెలియజేయటంలో కొసరాజు ప్రతిభా విశేషాలు ఎటువంటివో తెలియజెప్పే మరొక గీతమిది. వికాసాన్ని పెంచే విధంగా విజ్ఞానాన్ని వినోదంతో పాటు అందించే సందేశాత్మక గీతాలను ప్రతి చిత్రంలోనూ ఉండేలా చూసుకోవటం అన్నపూర్ణ సంస్థ ఆనవాయితీ... ఇక ట్యూన్ పరంగా చూసుకుంటే ఆ రోజుల్లో బాగా పాపులర్ అవటమే కాక ఇవాళ విన్నా కూడా ఎంతో ఫ్రెష్‌గా ఫీలయ్యే స్వరరచన యిది.

గ్రామ జనాభా పెద్ద సంఖ్యలో పట్టణాలకు వలస రావడంతో గ్రామీణ ఆర్థిక వ్యవస్థ దెబ్బతినడం, నగరపాలనా వ్యవస్థ అదుపు తప్పడం జరిగింది.

అది అనేక సామాజిక సమస్యలకు దారి తీసింది. ఈ ప్రమాదాన్ని 45 సంవత్సరాలక్రితమే పసిగట్టి పెద్దగా చదువుకోని గ్రామ వాసులకు (ఈ హెచ్చరిక వారికేగా) సైతం అర్థమయ్యే రీతిలో విడమర్చి చెప్పారు కొసరాజు. అర్బనైజేషన్‌ను నిరసిస్తూనే గ్రామీణ సమాజంలో ఉండే లోపాలను(శ్రామిక వర్గాలకు మర్యాద ఇవ్వకపోవడం, పరిమితి లేకుండా పనిచేయించడం) కూడా ఎత్తి చూపి 'నేటివ్ సోషల్ సైంటిస్టు'గా తన సత్తా చూపించారాయన.

అ: నీ సోకు చూడకుండ నవనీతమ్మ
నే నిముసమైన బతకలేనె ముద్దుల గుమ్మ
నీ నీడ వదిలి వుండలేనే ముద్దుల గుమ్మ
ఆ: ఎంత మాయగాడవురా రమణయ్ మావ
నిన్నే తల్లి కన్నదిరా వయ్యారి మావ
నీ కెన్ని విద్యలున్నయ్‌రా వయ్యారి మావ
అ: నీవు చూసే చూపులకు వన్నెలాడీ
నీరుగారి పోతానె చిన్నెలాడీ
మనసు దాచుకోలేను నవీనతమ్మా
పది మాటలైన చెప్పలేను ముద్దులగుమ్మా ॥నీసోకు॥
ఆ: ముచ్చట్లు చెబుతావు వన్నెకాడ
మోసపుచ్చి పోతావు చిన్నవాడ
మాటవరసకైన నువ్వు రమణయ్ మావ
ఒక్క మాడైనా ఇచ్చావా రమణయ్ మావా ॥ఎంత॥
అ: నీ తోటి సరసమాడి పడుచుపిల్లా
నెల్లూరు వెళతానె గడుసుపిల్లా
మళ్ళి తిరిగి వస్తానె నవనీతమ్మా
నిను మరచిపోయి వుండలేనె ముద్దులగుమ్మా ॥నీసోకు॥
ఆ: నెల్లూరు పోతేను నీటుగాడా
తెల్ల బియ్యం తెస్తావా నీటుగాడా
పక్కవూళ్ళో నువ్వుంటె రమణయ్ మావ
నే ప్రాణాలు నిల్పలేను రమణయ్ మావ ॥ఎంత॥



ఈ పాటను మాధవపెద్ది సత్యం, జిక్కి పాడగా రేలంగి, రాజసులోచన అభినయించారు. కథాపరంగా ఆలోచిస్తే వివాహితుడైన ఓ పాత్రధారి, అతడిని తన వలలో వేసేసుకున్న ఓ పాత్రధారిణి కలిసి వాళ్ళ మూడ్‌లో పాడుకునే పాట యిది. ఇదే థీమ్‌తో ఇవాళ ఓ పాట సినిమాలో పెట్టాల్సి వస్తే ఎటువంటి సాహిత్యాన్ని కవిగారి దగ్గర్నుంచి రాబట్టుకుంటారన్న విషయంపై ఇప్పుడు తర్కించినా, తల బాదుకున్నా ఏ ప్రయోజనం నెరవేరదని తెలిసినా-కనీసం ఆనాటి పాటలలోనైనా దిగజారని భాష ఉందికదా, అవన్నీ మన పిల్లలకి చెప్పి మంచేదో చెడేదో వివరించే అవకాశమైనా వుందికదా అనే తృప్తితో మనసు సేద తీరుతుంది. అంతేకాదు ఆ పాటని ఇవాళ చూస్తుంటే ఏదో కామెడి పాట చూస్తున్నట్టు వుంటుందే తప్ప నైతిక విలువలు వదిలేసుకున్న ఇద్దరు పాడుకునే శృంగార గీతంలా ఉండదు. అదీ ఆనాటి పాటలకున్న విలువ!!

శరత్ రాసిన బెంగాలీ నవల 'నిష్కృతి' ఆధారంగా ట్రీట్‌మెంట్ తయారుచేసుకున్న ఈ కథని 'తోడికోడళ్ళు'గా తెలుగులోను 'ఎంగళ్‌వీట్టు మహాలక్ష్మి'గా తమిళంలోను ఏకకాలంలో నిర్మించారు దుక్కిపాటి మధుసూదనరావు. రెండూ కొద్ది రోజుల తేడాతో 1957లో విడుదలయ్యాయి. రెండిట్లోనూ కామన్‌గా అక్కినేని, సావిత్రి, కన్నాంబ, ఎస్వీ రంగారావు, రాజసులోచన ఉన్నారు. తమిళ వెర్షన్‌కి డైలాగుల్ని (తర్వాత దర్శకుడిగా మారిన) శ్రీధర్ రాయగా కొన్ని పాటల్ని ఉడుమలై నారాయణ కవి రాశారు. ఈ తెలుగు చిత్రం రజతోత్సవం చేసుకోగా, తమిళ చిత్రం శతదినోత్సవం జరుపుకుంది.

## రిపబ్లిక్‌డే అవార్డులు


టి.ఎమ్.సౌందరరాజన్

ఈసారి పద్మశ్రీ అవార్డులు పొందిన వారిలో తమిళ సినీ నేపథ్య గాయకుడు (తెలుగులో కూడా పాడారు) టి.ఎమ్.సౌందరరాజన్, కణ్ణదాసన్ వారసుడిగా పేరు తెచ్చుకున్న తమిళ సినీ గేయ రచయిత వైరముత్తు ఉన్నారు. వాద్య సంగీతానికై ఉస్తాద్ షఫాత్ అహ్మద్‌ఖాన్‌కు పద్మశ్రీ లభించగా పలువురు కర్ణాటక సంగీత విద్వాంసులకు 'పద్మభూషణ్'లు లభించాయి. వారిలో బాలసుబ్రమణ్య రాజం అయ్యర్, మదురై కృష్ణన్ నారాయణన్, పులియూర్ సుబ్రమణియం నారాయణస్వామి, శంకర నారాయణన్, త్రిచూర్ వి.రామచంద్రన్, ఉమలాయపురం కె.శివరామన్ ఉన్నారు-రాష్ట్రపతికి కర్ణాటక సంగీతం పట్ల ఉన్న అభిరుచి ఇలా వ్యక్తమయిందా అనిపించేట్లు! పద్మభూషణ్ లభించిన ఇతరులలో 'గజల్' జగజీత్‌సింగ్, తీజన్‌బాయీ (ఫోక్ మ్యూజిక్) ఉన్నారు.

# ఘన రాగ రసాల ఘంటసాల



ఘంటసాలగారి శరీరం గతించి దశాబ్దాలు దాటినా వారి శారీరం మాత్రం అజరామరమై శతాబ్దాలు జీవిస్తుంది. కర్ణాటక, హిందూస్థానీ సంగీతాలతో పాటు తెలుగు వారికి మరొక సంగీతం ఉంది. ఆ సంగీతమే ఘంటసాల సంగీతం. పద్య పఠనంలో లలిత గీతాల గానంలో భావకవితల ఆలాపనలో ప్రణయగీతాల ప్రస్తారంలో కొత్త పుంతలు త్రొక్కి తెలుగు జాతికి మరపురాని మధురిమలను సరిగమలుగ అందించిన అమర గాయకుడు ఘంటసాల.



రచన :
వేటూరి సుందరరామమూర్తి

నా చిన్నతనంలో ఆయన మా ఊళ్లో సుసర్ల కృష్ణబ్రహ్మశాస్త్రిగారి వద్ద సంగీతం అభ్యసించటం నాకు బాగా గుర్తు. ఆయన స్వస్థలం మా ఊరికి రెండు కిలోమీటర్ల దూరంలో అడ్డదారిని వెళితే వస్తుంది. మాది సంగీత సాహిత్యాలకు పేరెన్నికగన్న పెదకళ్ళేపల్లి గ్రామం. చాలా మంది ఆయన స్వంత ఊరు గుడివాడ దగ్గర చౌటుపల్లి అనుకుంటారు. అది ఆయన జన్మస్థలం. తల్లిగారు పుట్టిన ఊరు. తండ్రి సూరయ్యగారిది ఘంటసాల వంశీకులది, టేకుపల్లి. మా రెండు గ్రామాలూ దివిసీమలోనివి. అక్కడ కృష్ణ ఉత్తరవాహిని.

అప్పుడప్పుడు నా బాల్యంలో ఘంటసాలగారు అడివి శివరామకృష్ణయ్య అనే తన సహాధ్యాయితో పాటలు, పద్యాలు పాడటం, అవి అందరూ ఆసక్తితో వినటం జరిగేది. అటు తర్వాత నేను ఆయనను చూసింది 1951లో మద్రాసులో విద్యార్థిగా ఉన్న రోజులలో !అప్పటికి 'పాతాళభైరవి' 'చంద్రహారం' చిత్రాలు రిలీజ్ అవ్వటం, దేశం అంతా ఘంటసాల గాత్రంతో ప్రతిధ్వనించటం జరుగుతుండేది. సెలవులలో ఇంటికి వెడదామని మద్రాసు సెంట్రల్ స్టేషనులో జి.టి.ఎక్స్‌ప్రెస్‌కి వచ్చి ఇంటర్ క్లాసు ఎక్కాను. అప్పుడు జి.టి. మధ్యాహ్నం 3 గంటలకు బయలు దేరేది. నేను ఎక్కేసరికే ముగ్గురు పెద్దలు అందులో కూర్చుని సంగీత గోష్ఠి జరుపుతున్నారు. మాటలధోరణి చూస్తే వీరెవరో సినిమావారు అన్పించింది. ఉన్నట్టుండి అందులో ఒకరు మరొకరి కోరికపై 'స్వప్నసుందరి' సినిమాలో 'నిజమాయె...కల నిజమాయె..' అనే పాట పాడారు. వినగానే ఈ గొంతు ఎక్కడో విన్నానే అనిపించింది. పాడిన వ్యక్తి కొంచెం స్థూలంగా, సిల్కు లాల్చీ, మల్లు పంచెతో ఉన్నారు. నన్ను చూసి మధ్యమధ్య నవ్వుతున్నారు. ఎదురు సీట్లో కూర్చున్నాయన ఎడతెరిపి లేకుండా తమలపాకులు చిలకలు చుట్టి నములుతూ ఆ తాంబూల గంధం విరజిమ్ముతూ మాట్లాడుతున్నారు. రైలు పోతూనే ఉంది. ఉండబట్టలేక ముందుకు వంగి ఆ తాంబూలకుడి చెవిలో 'ఎవ్వరండీ ఆయన?' అని అడిగాను. ఆయనా రహస్యంగానే నోరు నా చెవి దగ్గర పెట్టి రహస్యంగా 'ఘంటసాల' అన్నారు. ఒక్కసారి వెనకటి సంఘటనలు గుర్తుకొచ్చాయి. కాని 'ఆయనేనా?' అనే సందేహం ముసురుకుంది. ఆశ్చర్యంతో ఆయన వైపుచూశాను. ఆయన నవ్వుతూ జరిగిందంతా గ్రహించి 'మీదేవూరు?' అని అడిగారు. 'మాది పెదకళ్ళేపల్లి' అని చెప్పాను. అనగానే ఆయన మొహం విప్పారింది. 'మీ ఇంటి పేరేమిటి?' అని అడిగారు. చెప్పాను. అప్పుడు దూరంగా కూర్చున్న నన్ను పైనచెయ్యివేసి 'మనం చాలా దగ్గరి వాళ్ళం. దగ్గరకు రావయ్యా' అన్నారు. నాకు ఏనుగు ఎక్కినంత ఆనంద మయ్యింది. నా చిన్నప్పటి విషయాలు ఆయనకు చెప్పాను. 'అన్నీ గుర్తున్నాయి. మనం ఇప్పటి వాళ్లం కాదులే' అన్నారు. కాలం గడిచిన కొద్దీ ఆ మాట నాకు పాటగా వినిపించసాగింది.

అటు తర్వాత మద్రాసులో వారిని చాలా సందర్భాలలో కలిసాను, పత్రికా విలేఖరిగా! పాటల రచయిత అయిన తర్వాత నా పాట ఆయన గాత్రంలో వినే అదృష్టం నాకు భగవంతుడు ఇవ్వలేదు.

ఎక్కడో శ్రీకాకుళంలో ఘంటసాలకు గుడి కట్టించారట అభిమానులు. నిత్యపూజాభిషేకాలు నిర్వహిస్తున్నారట. తిరువయ్యారులో త్యాగయ్యగారి సమాధిపై ఆలయం కట్టి ఎందరో సంగీత రసపిపాసులైనవారు నిత్య పూజలు, అభిషేకాలు చేసి తరిస్తున్నారు. ఈ మహానుభావులిద్దరికి ఈ సేవ దొరికింది. ఇది తెలుగు వారి అదృష్టం.

కాని ఆయన పాడక నా పాట మూగబోయింది. ఆయన వారసత్వం బాలగంధర్వుడి స్వరమై నాపాల ఇన్నాళ్లుగా పలకనేర్చింది. నా కలం, బాలూ గళం, ఇలా శ్రుతిలయలుగా అద్వైత సిద్ధిని పొందటం వెనుక ఘంటసాల గారి ఆశీర్వచనం వుందనుకుంటాను.

ఆయన పుణ్యావర్ధంతి సందర్భాన ఘంటసాలకిదే నా అక్షర నీరాజనం. ●

# ఆ సంతృప్తే మాకు ఓదార్పుగా మిగిలింది



సుగుణ
(ఘంటసాల కుమార్తె)

పిల్లలంటే తల్లిదండ్రులకు ప్రేమా, అప్యాయతలు ఉండటమనేది సహజం. అలానే అమ్మా, నాన్న మమ్మల్ని బాగా చూసుకునేవారు. చలన చిత్రసీమలో నాన్న గారికి ఓ ప్రత్యేకమైన గుర్తింపు, గౌరవం, హోదా వున్నా ఇంట్లో మాతో ఆ రకమైన ప్రభావం ఏదీ లేకుండా చాలా సరదాగా నవ్విస్తూ, నవ్వుతూ మాట్లాడుతుండేవారు. వృత్తిపరంగా ఎంత బిజీగా వున్నా సరే సాయంకాలాల్లో బీచ్‌కు, హోటల్‌కు తీసుకెళ్ళేవారు. చిన్నప్పట్నించి మాకు సంగీత ప్రపంచం తప్ప మరొకటి తెలియదు.



అందరి ఇళ్ళలో కంటే భిన్నంగా మా దినచర్య మొదలయ్యేది. నాన్నగారు పొద్దున్నే న్యూస్ పేపర్లు చదివి, తనకు తోచిన రీతిలో పాటల్ని పాడుతూ సంగీత సాధన చేసేవారు. మా ఇంటి అవుట్ హౌస్‌లో నాన్నగారి అసిస్టెంట్ సంగీతరావు గారు వుండేవారు. ఆయన దగ్గర నేను, మా అక్క శ్యామల వీణ నేర్చుకునే వాళ్ళం. మేం మొత్తం అయిదుగురం. అక్కకు వీణ, నాకు సితార, అన్నయ్య విజయ్ కుమార్‌కు పియానో, మరో అన్నయ్య రత్నకుమార్‌కు వయొలిన్, చెల్లి శాంతికి ఒకల్ నేర్పించాలన్నది నాన్నగారి ఆశయం. మా అందరి ఆర్కెస్ట్రాతో ఘంటసాల గాత్రకచేరి అంటూ సంగీత కార్యక్రమాల్ని చేయాలనే కోరిక వుండేది. అయితే నేను కూడా అక్కతో వీణే నేర్చుకున్నాను.

ఉదయం ఎనిమిది గంటల వరకూ సంగీత సాధన ఇంట్లో నడిచేది. నాన్న గారి కోసం తోటి సంగీత దర్శకులు, గాయకులు, వాద్యకారులు, నిర్మాతలు, దర్శకులు వస్తుండేవారు. మ్యూజిక్ సిట్టింగ్స్ కూడా మా ఇంట్లోనే పెద్ద హాలులో జరుగుతుండేవి. రికార్డింగ్స్ పూర్తి చేసి ఇంటికి వచ్చాక, అమ్మతో మాత్రం ఆ విశేషాల్ని బాగా చెబుతుండేవారు. 'ఘనాఘన సుందర' పాట పాడి వచ్చాక, అమ్మతో ఆ పాటలో పాండురంగా... అనే పదాన్ని పలికిన ప్రతిసారి ఒక్కో విధమైన భావనతో పాడాను అని నాన్న చెప్పడం నాకు బాగా గుర్తుంది.

మమ్మల్నందరిని ఓ గ్రూప్‌గా చేసి కచేరి చేయాలనే నాన్న గారి కోరిక తీరకపోయినా... హెచ్.ఎం.వి. కంపెనీ కోసం నాన్న గారు సాయిబాబా పాటల్ని ఆడియోగా తీసుకొచ్చినప్పుడు అందులో పాలుపంచుకునే అవకాశం మా అయిదుగురికి వచ్చింది. సాయిబాబా మీద పాటల్ని కూడా నాన్నగారే రాసి, సంగీతాన్ని సమకూర్చి పాడారు. మేం అయిదుగురం ఆ పాటలకు కోరస్ ఇచ్చాం. ఆయనతో గొంతు కలిపి ఆలపించిన ఆ మధురానుభూతిని ఎప్పటికీ మర్చిపోలేం. పాటల రికార్డింగ్ పూర్తి కాగానే హెచ్.ఎం.వి.కి చెందిన మేనేజర్ కోరస్ ఆలపించిన మా అందరికీ తలో వంద రూపాయలు ఇచ్చారు. మేం అయిదుగురం ఆ డబ్బుల్ని తీసుకెళ్ళి అమ్మ చేతికి ఇచ్చాం. సంగీత పరంగా మేం సంపాదించిన మొదటి సంపాదన అది. అమ్మ చేతిలో డబ్బులు పెట్టడాన్ని నాన్నగారు చూశారు. ఒక్క క్షణం ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి.... ఆ సమయంలో ఆయన మనసులోని ఆలోచన ఏమిటో నిజంగా నాకు తెలియదు...

ఆయన చనిపోయే నాటికి నాకు 14 సంవత్సరాలు... అనారోగ్యం పాలైన ఆయన ఆరోగ్యం కుదుటపడింది... ఈ రోజే ఇంటికి వచ్చేస్తారు అనుకుంటుండగా... మా సదాశివరావు బాబాయ్ మా స్కూల్‌కి వచ్చి, మమ్మల్ని హాస్పిటల్‌కి తీసుకెళ్ళారు. అప్పటికే నాన్నగారు చనిపోయారు. అంతకు ఓ రోజు ముందే నాన్న ఉల్లాసంగా మాట్లాడుతూ... 'నేను రేపు డిశ్చార్జ్ కాగానే ఉడ్‌లాండ్స్‌లో 'పీచ్‌మల్బా' ఐస్‌క్రీమ్ తినిపిస్తాను... అందరం కల్సి బీచ్‌కెళ్ళి అట్నించి మాలతీచందూర్ ఆంటీ ఇంటికి వెళ్దాం' అంటూ ఎన్నో కబుర్లు చెప్పారు... ఆయనతో నేను మాట్లాడిన ఆఖరి క్షణాలు అవే. ఆయన మా మధ్య లేకపోయినా పాటను ప్రేమించే అశేష ప్రజానీకం మనసుల్లో గూడుకట్టుకున్నారనే సంతృప్తే మాకు ఓదార్పుగా మిగిలింది.

సరిగ్గా పదేళ్ళ క్రితం హైదరాబాద్‌లో స్వర్గీయ ఘంటసాల గారి విగ్రహాన్ని ప్రతిష్ఠించిన ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం ఆ మహోత్సవానికి విచ్చేసిన అతిరథ మహారథులైన సంగీత దర్శకులు, గాయనీగాయకులు, రచయితలను ఒకచోట చేర్చి లతా మంగేష్కర్‌తో ప్రత్యేకంగా తీయించిన ఫోటో ఇది. ఇందులోని



ఫస్ట్ లైనులో...
1. గణేష్ 2. చంద్రశేఖర్ 3. వాసూరావ్ 4. జి.ఆనంద్ 5. కీ॥శే॥ శంకర్ 6. ఎస్.పి.బాలసుబ్రహ్మణ్యం 7. పట్టాభి భాగవతార్ 8. విద్యాసాగర్ 9. మాధవపెద్ది సురేష్ 10. భువనచంద్ర 11. కృష్ణ-చక్రలోని కీ॥శే॥కృష్ణ

సెకండ్ లైనులో...
1. రాజన్ 2. కీ॥శే॥నాగేంద్ర 3. సుసర్ల దక్షిణామూర్తి 4. కీ॥శే॥విజయభాస్కర్ 5. కీ॥శే॥ఎస్.రాజేశ్వరరావు 6. ఎం.ఎస్.విశ్వనాథం 7. లతా మంగేష్కర్ 8. కె.వి.మహదేవన్ 9. టి.జి.లింగప్ప 10. జె.వి.రాఘవులు 11. 'విజయా' కృష్ణమూర్తి 12. వేటూరి 13. కీ॥శే॥మాధవపెద్ది సత్యం

థర్డ్ లైనులో...
1. కీ॥శే॥జంధ్యాల 2. పుహళేంది 3. హైద్రాబాద్ శంకర్ 4. కీ॥శే॥జయదేవ్ 5. జిక్కి 6. కృష్ణవేణి (కోరస్) 7. బి.వసంత 8. కమల (కోరస్) 9. రమోలా 10. స్వర్ణ (వి.కుమార్‌గారి భార్య) 11. జమునారాణి 12. రావు బాలసరస్వతి 13. కౌసల్య (కోరస్) 14. కీ॥శే॥సత్యారావు 15. ఎ.ఎ.రాజ్ 16. కీ॥శే॥రాజశ్రీ

ఫోర్త్ లైనులో.....
1. హంసలేఖ కుమారుడు అలంకార్ (నాలుగేళ్ళ క్రితమే హీరో అయ్యాడు) 2. హంసలేఖ 3. శ్రీనివాసమూర్తి 4. మిత్రా 5. సాలూరి బాబు 6. కీ॥శే॥మాధవపెద్ది రమేష్ 7. ఎస్.పి.ఈశ్వర్ 8. వెన్నెలకంటి 9. వందేమాతరం శ్రీనివాస్ 10. సాహితి 11. పైడిపాల 12. జొన్నవిత్తుల 13. కీ॥శే॥జి.కె.వెంకటేష్

RNI Regd. No.APTEL/2001/5503 HAASAM HAASYA SANGEETHA PATHRIKA Postal Regn. No.H-HD-997.

సుమంత్ ఆర్ట్ ప్రొడక్షన్స్

# ఒక్కడు

యం.యస్.రాజు మణిశర్మ గుణశేఖర్

పరుచూరిబ్రదర్స్ సిరివెన్నెల

శేఖర్.వి.జోసెఫ్ అశోక్ కుమార్ విజయన్ బి.భాస్కరరాజు శ్రీకర్ ప్రసాద్

